సాధన గ్రంథ మండలి 48.

# మహాత్మా ఉపాసనీ బాబా

గ్రంథకర్త:

శ్రీ కేశవతీర్థస్వామి



సాధన గ్రంథ మండలి, తెనాలి.

 1952 [ వెల 1-8-0

Dedicated to the

# Memory of Sri Kamala Nehru

the devoted consort of

Hon. SRI JAWAHARLAL NEHRU

THE PRIME MINISTER OF INDIA.

# FOREWORD

'De Adjuantee Non Timendam' God assisting nothing to fear is a latin proverb which dives deep into the practical life of every Satpurusha. Bharat Desa is rich in great Mahatmas even in present age like, Sri Arabindo, Sri Ramana Maharshi and Gandhi.

Maharastra is abundant with Bhakti cult since the times of Sri Sati Sakkubayi. The life of Sri Sayi Baba of Shird and the life Sri Upasani Baba of Sakori are events of 1912 and onwards pregnant with lusture to Indian soil. Sri Kesava Tirtha, the Author, brought the life of Sri Upasanibaba in a simple idiomatic Telugu language. Mr. V. K. Ghathy, B.A., L.L.B., pleader of Hyderabad with blessing of Godavari Mataji brought this book to light. This book will be of immense help in moulding the character of young women and men. I am sure this little book-let will surely be patronised both by public and educational institutions.

Hyderabad,
Deccan.
12-3-1952

**V. Suryanarayana Rao,**
**B. A M. L**
High Court Judge.

ఓమ్

# తొలి పలుకు

శ్రీ రామకృష్ణ పరమహంస దేవులకు శ్రీ మద్వివేకానంద స్వామి వారివలె, శ్రీ సాయిబాబా భగవానునకు శ్రీ ఉపాసనీబాబా మహారాజ్ ప్రముఖ శిష్యులు. దుఃఖతరంగ సంకులమైన సంసార మహాసాగరాన్ని తరించడానికి నిరుపమాన పరమశాంతి తీరాన్ని చేరడానికి ఏవి అవశ్య లక్షణాలు గల మహాపురుషుణ్ణి ఆశ్రయించాలో, ఆ మహాదర్శ లక్షణాలు గల మహాత్ముడు శ్రీ ఉపాసనీబాబా. కలి సంక్షోభితమైన యాంత్రికరంగంపైన మహా పవిత్రమైన భారత ఋషి జీవిత ప్రతిభను ప్రదర్శించి, నాటికన్న నాస్తిక మార్గంలో తికమక పడుతున్న జనానికి వెలుగు చూపిన ఆదర్శ పురుషుడు శ్రీ ఉపాసనీబాబా. ఆ మహానుభావుని జీవిత సౌందర్య సముద్రపు అట్టడుగులను చేరలేక పోయినా ఉపరితాగ శోభనైనా అవలోకించడానికి ఈ రచన ఉపయోగించగలదు. మహాత్ముల జీవితాల శ్రద్ధతో అధ్యయనం చేస్తే మనమూ మహాత్ములం కాగలం. ఆత్మ వికసించి మహాత్ముల మవుతాము. ఇట్టి మహాప్రయోజనాన్ని ఈ రచన కలిగియున్నదని నా విశ్వాసం.

శ్రీ ఉపాసనీ బాబా శరీరులై యున్న దినాల్లో అంటే షుమారు 12 ఏండ్ల క్రితమే నే నీ గ్రంథాన్ని రచించాను. నేను వ్రాసిన జీవిత రచనల్లో ఇదే తొలిరచన. ఆ రోజుల్లోని నా దైవతృష్ణకు ఈ చరిత్ర ఎంతో సహాయం చేసింది. శ్రీ బి. వి. నరసింహా స్వామి వారి Sage of Sakori అన్న ఆంగ్ల గ్రంథానికి ఇది అనుసరణం. శక్తి తక్కువగా ఉన్నా ఉద్రేకం ఎక్కువై యీ గ్రంథం వ్రాశాను. శ్రీ నరసింహస్వామి మొదలైన సత్పురుషు లెందరో యీ గ్రంథాన్ని ఆ దినాల్లో సమీక్షించారు. శ్రీ ఉపాసనీ బాబా గారికి కూడా ఆ దినాల్లో యీ నా రచన విషయం తెలుసు. మౌనగంభీరులైన ఆ సిద్ధపురుషుని ఆ నాటి ప్రసన్నభావనే, నాకీ విముక్త జీవితాన్ని ప్రసాదించి యుండవచ్చు ననుకుంటాను. నేను చేసిన ఆయన ఆరాధనకు ఎట్టి అద్భుత మహాఫలాన్ని ప్రసాదించారు. లౌకిక కష్టపరంపరలను తట్టుకోలేక నేనప్పుడు అంతర్విరాగంలో తన్నుక లాడుచున్న

రోజులు. నా అశ్రుధారలకు ఆమహాత్ముడు కరిగి అందరికిలాగా కష్టాలు కూడా తీరుస్తా డనుకొన్నాను. కానీ- ఆయన ఆ మహిమలు చూపలేదు. లోకులుగానీ. నేనుగానీ గ్రహింపలేని గంభీర మహిమను చూపాడు. ఇప్పుడు నేను ఆ సిద్ధపురుషుని అదృశ్య మహిమను వ్యాఖ్యానించుకో గలుగుతున్నాను. ముక్తపురుషుని చేయదంతలంటె విశేషప్రేమ ఇంకొకటి ఉంటుందా ?

ఆరోజుల్లో గ్రంథం ఎలాగో వ్రాశాను. ముద్రణ చేయించాలని గందరగోళ పడ్డాను, అతిసామాన్యమైన యీ చిన్నకార్యం చేయలేక, విసిగి వేసారి- కాలగమనంలో ఏతద్వ్యాపాన్నే ఉపసంహరించుకొని గ్రంథం మూలపడవేశాను. క్రమతః శ్రీరామతీర్థ సేవోద్యమంలో నిమగ్నుడనై ప్రచండ కార్యక్రమాన్ని కొనసాగించాను. ఎన్నో మహారచనలు వెలువడ బడ్డాయి. ఎప్పుడైనా యీ గ్రంథం చూచి సప్పుడు, తిరిగి బాగావ్రాసి, సవరించి వెలువరిద్దామనే ఒక భావన ఛాయగా ఉండేది, కానీ తీరికలేక కాలంగడిచి పోసాగింది, కానీ కాలం వచ్చికూర్చున్నది. సత్కార్యం వృధాగా పోతుందా ? కేవల దైవప్రేరణతో — బ్ర. శ్రీ. బులుసు సూర్య ప్రకాశశాస్త్రిగారు, తెనాలి సాధన గ్రంథ మండలి సంస్థాపకులు, యీ గ్రంథాన్ని స్వీకరించి వెలువరించారు. బాబా తన కృపాహ్వనిగా శ్రీ ప్రకాశ శాస్త్రిగారిని స్వీకరించారు. ఆ మహాసుగుణాలు శ్రీ శాస్త్రిగారిలో ఉన్నాయి. కుచేలునివంటి పరిస్థితిలో కుబేరుడు చేయదగిన పనులు చేస్తున్నారు, వారి సారస్వత వీరావేశానికి హద్దులు పద్దులులేవు. మంచిగ్రంథం కనబడితే ప్రెస్సుకు ఎక్కించడమే పని. పందలకొలది బుకాలు ప్రక్కన పీక్కొని తింటూనే ఉంటాయి. వీరిలో నాకు ఒక ఋషిత్వం గోచరించింది. దానికి నా కృతజ్ఞతా నమస్సులు! గ్రంథమును కొంచెం సవరించడానికికూడా నాకు అవకాశం కలుగలేదు, ఆనాటి నా హృదయ స్వరూపాన్ని, బాబా యిట్లు యథాతథాగా చూపింప దలచాడనుకొంటాను, బాబా నిర్యాణవిశేషాదులను నేను వ్రాయలేదు. అవన్ని శ్రీ శాస్త్రిగారే పొందుపరచారు. ఈ పవిత్ర గ్రంథాన్ని యిట్లు సమగ్రపరచి, శుద్ధ స్వరూపంలో, ఈ నాటికి భాగవత లోకానికి సమర్పింపగలిగిన శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారి దివ్యకృషి సర్వసంస్తుత్యము.

ఈ ఉపాసనీబాబాగారి జీవితానికి ఆ దినాల్లోనే పీఠిక వ్రాసిపంపిన శ్రీ శ్రీతత్త్వానంద స్వాములవారికి ధన్యవాదా లర్పిస్తున్నాను.

ఇంతవరకు తెలుగులో యీ గ్రంథంలేదు. దీనిలోని గుణసంపత్తిని బట్టి, యీ గ్రంథం వెలువడడం మహానందకర విషయం అనడంలో సంశయంలేదు. జీవదశను అతిక్రమించి దేవదశను అధిరోహించడానికి, ఈ జీవిత గ్రంథం మహోపయోగకరం. శ్రద్ధగా పఠిస్తే మీరే యీమాటంటారని నా నమ్మకం. ఇంక సెలవు.

శ్రీరామతీర్థ సేవాశ్రమం. }
పిడుగురాళ్ల. 10-9-1952 }

ఓం తత్సత్
కేశవతీర్థస్వామి.



# పీఠిక

ఈ జగము మాయావిలాస నాటకమను విషయము సకల ప్రవక్తలును ప్రకటించియున్నారు, ఇయ్యది అన్నిమతముల వారికిని సమ్మతమగు నుడియే అయినను ఈ మాయా మహిమను పల్వురు పలు తెరంగుల వర్ణించుచున్నారు. పండితులు సయితము తమతమ [illegible]ములకు ఏకాభిప్రాయులు కాజాలకున్నారు.

లోకములలోని సకలజీవులకును జీవయాత్ర బాధాకరముగ నున్నదనుట తథ్యము. కాని దానిని వేఱుపడు కోరిక ఎవరిహృదయమునను స్థిరముగా నావేశింపుటలేదు. రాగము హెచ్చినకొలదిని సుఖభ్రాంతి బలపడుచున్నది. కాని ఆ సుఖము దీర్ఘకాలము నిలుచునదిగాకను, తృష్ణాసాగరమున ముంచి దుఃఖప్రాప్తికే సదా దారితీయుచుండుటచేతను [illegible]రములు వాసముచుండును. అయిననేమి, విరక్తి ప్రాపంచిక[illegible] సహజముగ దోచి, మరల భ్రాంతికి లోనగుచున్నారము. ఇటుల రాగవైరాగ్యముల తెరలాట మధ్యమున జిక్కి, దిక్కుగానక [illegible]. ఎవరెన్ని చెప్పినను ఇయ్యది మాయయొక్క దుర్గ్రాహ్యమును అనిర్వచనీయమునగు విచిత్ర చర్యయనక తీరదు.

ఈ మాయయొక్క ధాటినుండి తప్పించువారెవరాయని తెలిసియో తెలియకనో ఎల్లరును మొఱలిడుచునేయున్నారు. కావున పీడితులను పాలించి జగన్నాటక సూత్రధారియగు పరమేశ్వరుడు తన ప్రతినిధుల పంపి ఆర్తుల బాధానివారణోపాయముల బోధింపించుచుండును. వారు వచ్చి మాయలేక ప్రకృతివలన మోహమున జిక్కిన జీవులకు, వారు వారు ధరించియున్న పాత్రధారణము అశాశ్వతమనియు, వారి స్వస్వరూపము నిర్వికారముగ నిలిచియే యున్నదనియు, అప్పుడప్పుడు వారి హృదయములందు పొడసూపు వైరాగ్యము పరమేశ్వరుని ఆదేశమనియు, దాని ననుసరించినచో సకల క్లేశములును తొలగి శాశ్వతానందపదవి సహజముగనే లభ్యమగుననియు తెలుపుదురు. ఇట్టి మహనీయులనే ప్రవక్తలనియు అవతారములనియు వ్యవహరింతుము. ఈ కోటిలో గణింపదగిన ఉపాసనీ బాబాగారి దివ్యచరిత్రమును ఈ గ్రంథమున పాఠకులు చదువనున్నారు.

అఖిలాండకోటి బ్రహ్మాండములను తన యేకాంశమున నిండియుండియు, మాయచే ఆచ్ఛాదింప బడియున్న మనల బాహ్యాభ్యంతరము

లందు ఆవరించియు, మనకు గానరాక పోయినను పరమాత్మ నిండు తేజముతో వెలుంగు చున్నాడు. ప్రాకృత జీవులు ఈ అనంత జగన్నాటక లీలలందు దగుల్కొని, బుద్ధి మందులై ఆత్మతత్త్వమును బోధించుచున్నను తెలిసికొనజాల కున్నారు. తమ క్షేత్రమునకు దిగివచ్చి, తమతోడి సానుభూతి వహించి, తమవలెనే జీవిత కష్టసుఖముల ననుభవించుచు, ఉత్తమ జీవన పథమున దారిదీసి నడపిననని తమను ప్రబోధింప వచ్చిన మహాత్ముల యుపదేశములను వీరు గ్రహింపజాలరు. ఎంతటి ప్రజ్ఞాశాలి యగు గురువు పలవడి పెట్టియిచ్చినను, ఆ పలవడిని అతడే దిద్ది చూపిననే బడిపిల్లలు దానిని అనుకరింప గలరు. లేకున్న పంతులుగారి శ్రమవ్యర్థమే. కావుననే ప్రవక్తలును, అవతారపురుషులును సామాన్య మానవజీవన విధానమును అవలంబించి, సామాన్య సాధనల ననుసరించి, తమ బోధనల తా మనుకరించి, మనకు మార్గదర్శులుగ వర్తించుచుందురు. తాము ప్రజ్ఞాన ఘనులయ్యును, అజ్ఞానాంధకారనిమగ్నులయి పరవృలాడుకొనుచు, తపోవ్వాల గావించుచు, జీవితగమ్యమును ప్రాపించు తెరవు ఇటులుండునని తమ చరితల మూలముననే నిదర్శన పూర్వకముగ బోధల గావింతురు ఇయ్యది వారి అపార కరుణావిశేష చాతుర్యము తప్ప అన్యము గాదు.

ఉపాసనీ మహారాజు దారిద్ర్యక్లేశముల ననుభవించినాడు. సాంసారిక బాధల నెన్నిటినో భరించినాడు. కులాభిమానముచే క్రుంగినాడు. వైరాగ్యబలము కొలువడి తాను పూనిన సత్పథమున నిలుకడ చిక్కక తబ్బిబ్బులైనాడు. మహమ్మదీయుని గురువుగా వరింప నేవగించుకొని దైన్యత నందినాడు. గుర్వాదేశముల పాలింప మనస్సు నిరాకరింపగా దానితో వేసట జెందినాడు. కాని తుదకు సర్వార్పణము చేయక మార్గాంతరము లేదని గ్రహించినప్పుడు తన యహంకారమును నడంచివైచి ప్రజ్ఞాన తేజోవిరాజితుడై తాను ముక్తుడై, పరులకు ముక్తి దాతయై, జగద్గురువై భాసిలినాడు. సర్వజ్ఞమూర్తియై సకల మతములును మోక్షమార్గములే యను సత్యము వెలుంగి సద్బోధలు సలిపినాడు. సమస్త మానవ కోటిని వారి వారి సంస్కారవిశేషముల ననుసరించి, వారివారి మతసిద్ధాంత మర్మముల దెలిపి, అజ్ఞానజనిత విభేదముల విస్మరింప జేసి, ప్రాపంచిక ద్వంద్వముల దాటి యెల్లరు పరమానంద పదవిని ప్రాపింప నర్హులని

చాటుచు. తనజీవన చరితల ద్వారమున నిదర్శనాపూర్వకముగ నుపదేశించి యున్నాడు.

బుద్ధి పాటవముగలిగి జిజ్ఞాసాపథమున పోగల్గువారలు జ్ఞానమార్గము ననుసరించియు, ఉత్సాహావేశములతో పూజాద్యుత్సవాదులు జరుపు నిచ్ఛగలవారు భక్తిమార్గావలంబులయ్యును, తీవ్ర ప్రవృత్తి పరాయణులై నిష్కామ సేవలు సలుప జాలువారు కర్మమార్గము బూనియు పరమార్థమును సాధించి ధన్యులు కాగలరను సత్యమును చక్కగ నిరూపించి యున్నాడు. ఇటుల తను జీవితచర్యల మూలమున నెవరికిని తగినఆదర్శముల వారికి ప్రదర్శించి సకల ప్రజలను క్రమగతిని నడపగలవారే సద్గురువులు. ఉపాసనీబాబా గారి కరుణ అపారము. కుక్కలు, పిల్లులు, పిట్టలు, పురుషులు మొదలు వారి ఆదరణకు పాత్రములైనవి. ప్రజలచేత మూఢాచారము లనియు, గ్రుడ్డినమ్మకములనియు నిరసింపబడు ఉపవాసాదులును, పూజా పునస్కారములును, తీర్థయాత్రలును శ్రీవారి దిద్దుపాటులతో తరణోపాయములైనవి. సర్వజన సమాదరణీయ మగు ఉపాసనీబాబాగారి జీవిత కథను ఆంధ్రసోదరులకు వారిమాతృభాషా ద్వారమున కానుకగా సమర్పింప సమకట్టిన గ్రంథకర్త యెల్లరకును వందనీయుడు. * శ్రీ కేశవరావుగారు తమగ్రంథము ఆంగ్లమునకు భాషాంతరీకరణము గదా యని, ఆంగ్లభాషా మర్యాదను మన్నించి యున్నారు. అనువాదముగాన మఱికొంత స్వాతంత్ర్యము పూని తెలుగు భాషా సంప్రదాయమునే సర్వత్ర పాటించినను ఆక్షేపణ యుండెడిది కాదని తలచెదను. మొత్తముమీద ఈ గ్రంథము సులభ గ్రాహ్యమగు శైలిలో చక్కగ వ్రాయబడియున్నది. శ్రీ బాబా గారిని గుఱించి తెలిసికొన చిరకాలమునుండి అభిలాషగల నాకు ముద్రణకు పూర్వమే ఈ గ్రంథమును పఠించు నదృష్టము చిక్కినదిగదా యని సంతసించుచున్నాను. ఆంధ్రసోదరులు శ్రీబాబాగారి జీవితకథను జదివి, విజ్ఞానము గడించి ధన్యు లయ్యెదరుగాక.

శ్రీ మైత్రేయాశ్రమము
1–11–38

శ్రీ తత్త్వానంద స్వామి

---

* సన్యాసానంతర నామము, శ్రీ కేశవతీర్థస్వామి.

# నివేదన

మానవజన్మ యమూల్యమైనది. ఐహిక పారలౌకిక సుఖముల బడయుటకు సాధనము లనంతములు. అందు మహాత్ముల చరిత్రలు, ప్రవచనములు, వీరి సాంగత్యము ఇవియు సాధనములే. మహాత్ముల జీవితములు వఠన మననముల వలన మానవ జీవితము పవిత్రవంత మగును. దానివలన ఉత్తమ కర్మాచరణము జరుగును. తద్ద్వారా పారలౌకిక సుఖముల బడయవచ్చును. ఈ ఉపాసనీబాబా జీవితముకూడ ననేకవిధముగ మానవ జీవితమును పవిత్రము చేయుటకు సహాయకారి కాగలదు. శ్రీ ఉపాసనీబాబాలోని మహత్వ ప్రతిభా విశేషములు నిట పొందుపఱుచ నక్కరలేదు. "అమృతపానము చేయుచు రుచి యడుగనేల?"

**మండలి మాట :-**

మండలికి ఐదు సంవత్సరములు పూర్తియై, ఆరవ వత్సరము నడచుచున్నది. నేటివరకు మండలి చేయు కృషి యెల్లరకు విదితమె. కాని ఆర్థిక సాధన యేమియు కలుగలేదు. అనేక కష్టనష్టములకు లోనై, తనధర్మమును తాను నిర్వర్తించుచున్నదని మనవి. మీయందరి సహాయము పూర్తిగ నితోధికముగ నపేక్షించుచున్నదని విన్నపము. ఈనాడిట్టి కృషి లోకమున కవసరము. కాన మీ సాధన గ్రంథ మండలి కృషిని దేశము నలుమూలల వ్యాపింప జేయు బాధ్యత మీదే అని మా విజ్ఞాపన.

## కృతజ్ఞత :-

మహాపురుషుడగు శ్రీ రామతీర్థ స్వామి వారి సంపూర్ణ సారస్వతాన్ని దేశమెల్లడల విరజల్లుటకు బద్ధకంకణులైన, పూజ్యపాదులు శ్రీ కేశవ తీర్థ స్వామివారికి మా మండలి యెడ గల యవ్యాజ కరుణారూపమె ఈ ఉపాసనీబాబా చరిత్ర. వారికిని, పీఠిక వ్రాసియిచ్చిన శ్రీ తత్త్వానంద స్వామివారికిని, హైకోర్టు జడ్జి శ్రీ వి. సూర్యనారాయణరావుగారికిని కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

ఈ గ్రంథ ముద్రణ విషయమున తగురీతిగా తోడ్పడి సాయము చేసిన, శ్రీ శ్రీవత్సస వెంకట హనుమాయమ్మగారు, శ్రీ జి. దమయంతమ్మగారు, శ్రీ చినపాల సువర్ణముఖమ్మగారు, శ్రీ శాంత కన్యాకుమారిగారు, శ్రీ లక్ష్మి అన్నపూర్ణాదేవిగారు వీరికి మా కృతజ్ఞత. శ్రీ ఉపాసనిబాబా కరుణాకటాక్షమునకు వీరుపాత్రులై ఆయురారోగ్య ఐశ్వర్యముల ననుభవింతురుగాక!

నందన
ఆశ్వయుజము
10-9-52

బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
వ్యవస్థాపకుడు
సాధన గ్రంథ మండలి, తెనాలి.

# విషయసూచిక

-: చిత్రపటములు :-



మహర్షి శ్రీ ఉపాసనీబాబా

( శ్రీ సద్గురు సాయిబాబా శిష్యులు

ఓమ్

# ఉపాసనీబాబా

## ఒకటవ యధ్యాయము

### ఋషీంద్రుఁడు - అతని వంశము

బొంబాయి రాజధానియందలి అహమ్మద్ నగర మండలములోని 'సకోరి' యనున దొక చిన్న గ్రామము. ఇరువది సంవత్సరముల క్రితమిది ప్రజల కంతగాఁ దెలియదు. క్రీ. శ. **1917** సంవత్సరమున నొకఋషీంద్రున కిది నివాసస్థల మయినది. అప్పటినుండి యాతనికీర్తి దిగంతముల వ్యాపించి, యిది పరమ పవిత్రమగు యాత్రాస్థలముగా మారినది. ప్రథమమున నీఋషీంద్రుని నివాసగృహమాగ్రామమందలి శ్మశానములోని తాటియాకులగుడిసె. యోగీంద్రునిఁ జూడవచ్చిన జనుల కీతాళపత్రమందిరము వసతిగానుండనందున, కొందరు భక్తులచ్చోట నొకసుందరమైనభవనము, దత్తాత్రేయాలయము రెండు ధర్మశాలలు నిర్మింపఁజేసిరి. భయానకమయిన పూర్వపు శ్మశానభూమియొక పరిశుభ్రమయిన చిన్నపట్టణముగా మారినది. ఋషివర్యుఁడు సంచారార్థ మీగ్రామమును వీడి, యితర ప్రదేశములకేగి నప్పు డచ్చటి విశేషములు గమనీయములు. ఈమహనీయుఁడు, **1930** వ సంవత్సరమున 'బొంబాయి' నగరమున కరుగుదెంచి 'సెత్ గోవిందదాస్ బెనాత్ వాలా' గృహ

మున విడిసెను. స్వామిదర్శనార్థమయి, జనులనేకులు త్రోసి కొనివచ్చి ఋషివర్యునిఁ బుష్పములచేఁ బూజించి, సాష్టాంగ దండప్రణామము లొనరించిరి. మధ్యాహ్న మొంటిగంట మొదలు రాత్రి 9 గంటలవరకు జనసమూహములరాక కంతము లేదు. సహజముగా నెవరైనను, "ఈ ఋషి యెవ్వరు? ఈతని మాహాత్మ్యమేమిటి? వేనకువేలజనులీతని నేలదర్శింపవచ్చెదరు? ఆతనివలన వీరలుపొందు లాభమేమి?" అని ప్రశ్నించినచో సంపూర్ణోదంతమును వాక్రువ్వ సాధ్యముకాకపోయినను, వారి జీవితోదంతమును కొంతవరకీ చిన్నిపొత్తమున వ్రాసితిని.

కాశీనాథగోవిందోపాసనశాస్త్రి లేక శ్రీ ఉపాసనీబాబా మహారాజ్ అని యీ ఋషీంద్రుని నామము. పారంపర్యంత మనంతభక్తివైరాగ్యములుగల్గిన పరమపవిత్రవంశమున జనించిన మహారాష్ట్రబ్రాహ్మణుఁడు. వీరివంశీకులు గ్రామపౌరోహిత్య మును సలుపుచు గ్రామమునఁ బురాణాదులఁ జెప్పుచు, జీవన ముఁ గడుపుచుండిరి. వీరి నివాసస్థలము 'నాసికా'మండలమం దలి 'సతానా'. కుటుంబము దరిద్రావస్థచేఁ దులదూగుసమయ మునఁ జనించినాఁడీ కాశీనాథుఁడు.

తనకిరువదిరెండవయేఁడు వచ్చువరకు కాశీనాథుఁడు, పితామహుఁడగు గోపాలశాస్త్రికడనే 'సతానా'లో పెరిగిపెద్ద వాఁడయ్యెను. ఆతనితండ్రియగు గోవిందశాస్త్రి 'ధులియా'లో సివిల్‌కోర్టునందొక గుమాస్తాగా, భుక్తికై కష్టించుచుండెను. ఈతఁడు జ్యోతిష గణితశాస్త్రములయందెక్కుడు పాండిత్యము గణించి, గ్రంథములరచించెను. కాశీనాథుని పితామహుఁడగు గోపాలశాస్త్రి తనయిరువదితొమ్మిదవయేట శ్రీకృష్ణభక్తిప్రేరిత

ముగ 'నుద్ధవునిప్రార్థన' మనుపద్యముల రచించెను. మొదటి దినములలో నతనికీర్తియే 'బరోడా' రాజాస్థానమున ముఖ్య సలహాదారునిగఁ జేసినది. తదనంతరమా సింహాసనమొక రాజ కుమారుని హస్తగతమాట, నాతనియవివేకప్రవర్తన కనుకూలింపక గోపాలశాస్త్రి 'బరోడా'నువిడచి, పూర్వస్థానమగు 'సతానా'కుఁజేరెను. అక్కడ తనవైదిక కృత్యములయందప్రమత్తుఁడయ్యెను. తాను వేదాధ్యయనమొనరించుచు, పిల్లలకు వేదముల నేర్పుచుండెను. ఇతరులకు సహాయము చేయుచుండెను. యజ్ఞాదిక్రియలఁ జేయుచు, నితరులు చేయువానియందెక్కుడు, శ్రద్ధతోఁ బాల్గొనుచుండెను. ప్రతిదినమాతఁడు బీదలకాతిథ్యమీయకఁ గూడుఁగుడువఁడు. అనుదినమెనిమిది పదిమందిబాలకులఁ దనయొద్దఁగూరుచుండఁ బెట్టుకొని వేదములను, మంత్రములను, సంస్కృతవ్యాకరణము మొదలగువిద్యల స్వంతమనుమలకువోలె, నేర్పుచుండెను. తమగురుచంద్రునకెన్నివిద్యలుగలవో, యవియన్నియు నీవిద్యార్థులు, నూరిత్రాగి జీర్ణించుకొని, గురువునంతటి వారలయిరి. ఈమహనీయుని పవిత్రశీలమందునఁ బ్రజ్వరిల్లు మహోన్నతాశయములగు, నౌదార్యము, నిష్పక్షపాతబుద్ధి, సత్యప్రవర్తన, సాధుత్వము, తృప్తి, నిష్కాపట్యము, వేదములయందు విశ్వాసము, పెద్దలయందు భక్తి, మొదలగు సద్గుణము లీశిష్యుల కలవడినవి. 'ఉపాసనీబాబా' జీవితమును గాంచినవార లీపితామహుని యుత్కృష్టగుణములే వీని హృదయఫలకమునఁ బ్రతిబింబించినవని గ్రహింపఁ గలరు,

ఆతని తండ్రికిఁ గలిగిన నైదుగురిలో రెండవవాఁడే కాశీనాథుఁడు. వీని సోదరుఁడగు 'బాలకృష్ణశాస్త్రి' గొప్ప సంస్కృతపాండిత్యము కలవాఁడు. బొంబాయి 'విశ్వవిద్యాలయ' మందలి 'మాస్టర్ ఆఫ్ ఆర్ట్సు డిగ్రీ'కి పరీక్షకుఁడుగా నియమింపఁబడి, నీతిశాస్త్ర విశారదుఁడై, ప్రధానన్యాయాధిపత్యమును వహించెను. తమరాజ్యములయందు జరుగువిషయములయందు ధర్మములనడుగుటకై 'హిందూరాజకుమారులు' సైత మప్పుడప్పుడు వచ్చుచుందురు. ఆతని నిర్మలహృదయమునుబట్టియు సత్యప్రవర్తనము, నిష్కాపట్యమందహాసము, మధురభాషణములబట్టియు 'మధుశాస్త్రి'యని బాల్యమునుండియు యన్వర్థ నాముఁడయ్యెను.



## రెండవ యధ్యాయము

### జననము - బాల్యము

**1870**-వ సంవత్సరమున మే 5-వ తేది కాశీనాథుని జన్మదినము. ఎనిమిది సంవత్సరముల ప్రాయమునం దుపనయనానంతర మీబాలకుఁడు ప్రాథమికవిద్యాశాల కంపఁబడెను. నిర్దాక్షిణ్యుఁడై,యుపాధ్యాయుఁడగు 'ఘూర్ పూర్' ఒకదినమున కాశీనాథుని దేహమెల్ల వాయఁగొట్టెను. ఆదెబ్బలబాధకు రోదనముసేయుచు గృహమునకుఁ బరుగిడి మరల పాఠశాలయన్న వెట్టిటో యెఱుంగడు, "ఈయుపాధ్యాయులచేఁ జావఁ

గొట్టఁబడు విద్య యెందులకు? ఈవిద్యచే వచ్చు లాభమేమి? 'కోటివిద్యలు కూటికొఱకే"యని విద్యావ్యాసంగమందనురక్తి లేనివాఁడయ్యెను. ఇంటిలోపెద్దఁ బెద్దవా రేమయినఁ జదివించు చున్నను, మనబాలకుని చిత్తముమాత్రము దానియందు లేదు. ఈతనికి యుక్తవయస్సు వచ్చినది. తనజీవితముఁ గడుపుకొను మార్గము కానరాదు.

కాశీనాథుఁడు సహజముగా దృఢకాయుఁడయినప్పటి కిని, మలబద్ధము, మలరోగము లాతని విడనాడినవి గావు. అయిన నాతఁడేమాత్ర మీ దేహావస్థను లెక్కఁగొనక, 'యీశరీరమొక సోదరుఁడయిన (తోడ్కబుట్టిన) గాడిదె. (Brother ass). నాఆత్మ నీచమయి, యజ్ఞానావస్థలో నున్న గార్దభము. దానిననుసరించుచున్న నీశరీరమొక గార్దభసోద రుఁడు. కావున దీనినిసుఖపెట్టఁ జనదు. కష్టకార్యములయం దునఁ బాల్గొనఁజేయవలయు" నని వేపాకుజిగురునందిసుకనంజు కొని భుజించువాఁడు. బాల్యమునం దీవిషయములోక విచి త్రాభిప్రాయుఁడగు 'పీసునానా' యనునతఁడు బోధించుటచే యీయభిప్రాయమందు నమ్మకముగలిగినది. ఇంతటితో నాగక కాశీనాథబాలకుఁ డీవిషయమందెక్కువ యగాధాలోచనఁ జేసి శరీరము తనకుఁ బ్రబలశత్రువుగాఁ దలంచెను. "చూడుఁడీశరీర మును. తనసౌఖ్యములకొఱకై, మనల నీచకార్యములయం దునఁ బాల్గొనజేయుచున్నది." అని చెప్పుచుండువాఁడు. కాశీ నాథునిగృహముప్రక్క నొకభాగ్యవంతుఁడు వసించుచుండెను. ఆధనికుఁడు తనధనమంతయుఁ గమ్మనిభోజనమునకే వినియో గించువాఁడు. అజీర్ణవ్యాధి పిశాచమాతని నావరింప, తిన్న

తిండి సైతము జీర్ణింపక, దుర్భరావస్థపడి, కలరారోగముచే యమలోకమునఁ బ్రాతకాపయ్యెను. ఈవిషయము నేజెప్పి పెద్దలతో కాశీనాథుఁడు, "చూచితిరా, యీతోలుగప్పిన యస్థిపంజరమును! విశ్వాసఘాతకియు, మాయావియు, నీచాతి నీచమయిన యీశరీరమాతనిచే ఘృతసూపభక్ష్యాదులచేఁ బెంపఁబడి, విశ్వాసవిహీనమై చివరకాతనిని నట్టేటముంచి కష్టావస్థలో విడచిపెట్టినది! మిత్రాకృతిఁదాల్చిన శత్రువుకాదా దేహము?"—అని వాదించువాఁడు. పూర్వమొక సభలో 'మీనియస్. అగ్రిప్పా' రచించిన 'పొట్ట - దానిపోషకులు' అను కథను వినినప్పుడువలె, యెప్పటికైన నీమాధ్యముపోగల దని యీబాలకుని వాక్యములవిని వారలేమియుఁ జెప్పఁజాలక మూకలవలె యుందురు. క్రొత్తవెల్లువలోవచ్చెడి మడ్డి, చెత్త మొదలగు మలినపదార్థములు, కొంతతడవునకు ఘనీభవించి యడుగునఁ జేర నుదకములు శుభ్రమగురీతి యీతనిపసితనపు మాధ్యము పోగలదని కాశీనాథుని ముఖారవిందమునుగని నవ్వుచుండెడివారు. వేదాంతసాధనమందలి ప్రథమరంగమనఁ దగు ఆత్మశరీరభేదములీబాలకునకు వయస్సునకుమించిన బుద్ధి యని నవ్వుచుండెడివారు. తానేదిచేయనెంచునో దానినీబాల కుఁడు నిర్వర్తింపకమానఁడు. ఆకారణముననే కాశీనాథుఁడు తనజీవితములో ననేకపర్యాయములు దాదాపుగ మృత్యువు వాతఁబడవలసిన వాఁడునయ్యెను. నిఖిలచరాచరప్రపంచపాల కుఁడగు భగవంతుఁడీవిశ్వమున నేదియోమహత్తరకార్యనిర్వ హణమునకుఁ వీనిం బంపియుంటచే నాకార్యసమాప్తికై సజీ వుఁడుకావలసివచ్చినది.

ఒకదినమున కాశీనాథుఁ డొకపొలమునకేగెను. అచ్చట వ్యవసాయమునకైన యంత్రచక్రమొకటి యతివేగమునఁ బరిభ్రమించుచుండెను. ఆచక్రమధ్యభాగమున నొకరంధ్రముండెను. ఆరంధ్రాంతరమున వ్రేలుపెట్టిన నేమిజరుగఁగలదోయని కాశీనాథునకొక యూహజనించుటచే, 'నిదినాదిగాదుగదా!'యని వ్రేలుదానియందుంచెను. ఏదితలంచునో యదిక్రియారూపము దాల్చును. వ్రేలుకుగాయముతగిలినది. ప్రథమమునఁదాదలంచిన పిచ్చియూహలకు సిగ్గుఁజెంది, తదనంతరము కాశీనాథుఁడు నూతనముగఁ బదిశ్రమసల్పి, "పూర్వకర్మానుసారముగశుభాశుభములు కలుగుచుండును. జీవయాత్రయందువిజయమొందుటకు శరీరమునునిందించినలాభములేదు. పరిపూర్ణజ్ఞానానందము కలుగునంతవరకు దేహమును సక్రమపథానువర్తిగానొనర్పవలయును. దేహమును సక్రమముగనడిపించిననేగాని యంతరాత్మ పరిశుద్ధముకాదు. విద్యావ్యాసంగాదులచే చిత్తమును పరిశుద్ధము జేయుట, దివ్యకాంతిమయుఁడగు నీశ్వర సాక్షాత్కారమునకే—. పరమేశ్వరునిఁ గనుఁగొనవలయునన్న తానుగడించిన అవిద్యాగంధమంతయు మఱువవలెను. తన్నుతానె మఱచిపోయెడి స్థితిరావలయును." అనినిశ్చయించుకొనెను. కాని యీతని బాల్యమందలియాశయము శరీరమొకప్రబలశత్రువనియు, విద్యాదిక్రియలు దేహపోషణమునకెగాని యాత్మోద్ధారణమునకుఁ గావని—.

కాశీనాథునికిఁ దన పితామహునివాక్యములయందు శ్రద్ధాభక్తులుమెండు. అందువలననే తాతగారుసెప్పెడి బోధనలు ప్రకృతిబాహ్యవిషయములయందు నమ్మక మెక్కువ.

తనజీవనోపాయ విషయమైగాని, పితామహుని వాక్యముల యందు నిజానిజపరీక్షాశక్తిగాని లేదీబాలకునకు – ప్రతిదినము స్నానసంధ్యాదిక్రియలు సక్రమముగ నిర్వర్తించి శ్రీరామ మారుతీవిగ్రహముల నర్చించుచుండువాఁడు. పితామహుఁడు చదువుచుండెడి రామాయణభారతాదిపురాణముల నాకర్ణించి తనబాల్యముననే "మంత్రములయం దఖండాగ్రగణ్యప్రభావము గడించెను. అందువలననేగదా సామాన్యులగు ధృవవిశ్వా మిత్రులు, నిస్సహాయులయ్యును జపప్రాణాయామములవలన ప్రపంచఖ్యాతయశులై దేవతాగణములచే సైతము నమస్కృ తులఁబొందిరి." అని మనమున దృఢాభిప్రాయుఁడై, తనగృహ మున మానవకిల్బిషములందు మంత్రసామర్థ్యమెంతవరకో కనుఁగొనఁ బ్రారంభించెను. రాత్రులందతఁడు నిద్రించుతఱి యెవ్వరో భయంకరాకారులగుకింకరులు నిర్దాక్షిణ్యులై తన్నొక భయంకరప్రచండజ్వాలామయమగు నగ్నికుండమునఁ ద్రోయు చున్నట్లుకలఁగని వెంటనే తాతసెప్పినమంత్రముఁ బఠించుకొని తద్బాధానివారితుఁడయ్యెడివాఁడు. ఆసనసిద్ధి ప్రాణాయామాది క్రియల నలవరచుకొని మంత్రోచ్చారణాదిక్రియల నసగా విష్ణు సహస్రనామము సప్తశతి మొదలగువాని నెల్లపుడు రాత్రిం దివములు జపించువాఁడు. సహాధ్యాయులు చదువుకొని యాటపాటలఁదేలుచుండ ప్రశాంతమయమ్ములైన నేదుర్గమార ణ్యములలోనో యే గిరి గుహాంతరములందుననో తపస్సొన రింపవలయునని కాశీనాథునికోరిక.

యౌవనములోనున్న నీబాలకునియా శయములఁగని బంధు గులు, యితరులుసైతము, 'పనికిమాలినపిల్లవాఁడని' నిందింప

# అధ్యాయము 3

## వివాహము - గృహత్యాగము

సహజముగా యువకులకు పునస్సంధానానంతర మీ దుఃఖమయ ప్రపంచము వసంతకాల స్వర్గోద్యానవనవాసమై గానవచ్చును. పదునాల్గేండ్ల ప్రాయము గలిగిన కాశీనాధునిస్థితి యీ విషయమునకుఁ జాలదూరము. తమవారితనికిఁ బెండిలి సేయ నిశ్చయించుకొనుటెఱింగి, "నేనే నా జీవనముఁ గడుపు కొనఁజాలని యశక్తుఁడను. అట్టిచో నాకు వివాహమేల; నిరుప మాన దారిద్ర్యాంధకారమగ్నమయిన యీ కుటుంబమునకు నేనేభారమయియుండ మరియొక బరువెందులకు? నా విషయమై తక్కినవారేల బాధపడవలయును?" అని యీ యువకుఁడు తమవారిఁ బ్రశ్నించెను. పాపము! పిన్నవయస్సులో నుండి యస్వతంత్రుఁడై నిస్సహాయుఁడైన బాలుని కోరికలు కొన సాగునా? పెద్దవారీబాలకుని వాక్యముల సరకుగొనక 'దుర్గా బాయి' అను నెనిమిదేడుల నీడుగల బాలిక నీతనికిచ్చి వివా హముఁ గావించిరి.

అశక్తులయిన బాలకులపై వివాహాది బాధ్యతల వైచి నచో, వారలే కష్టనిష్ఠురములఁబడి తెలివిఁ దెచ్చుకొనగలరని – ఈత నేర్చుకొనుటకుముందు బాలకుల నీటిలోనఁ ద్రోయు పట్లు, తమ పిల్లలపై తలిదండ్రులు బాధ్యతల వైచుచున్నారు. ఇవియే కాశీనాథుని జననీజనకుల యూహలయిన, వారి తలం పులు కొలదికాలమున విఫలములగును. ఇక మన యువకునకు

చదువన్న భయము. పొట్టపోసికొనుటకే పలువిద్యలని యాతని తలంపు. ఇతనిని సంసారమార్గమునకుఁ ద్రిప్పి ధనము సంపాదింపఁజేసి భార్యతో సుఖముగా మెలఁగఁజేయవలయునని కొందరీతనిని హెచ్చరింపసాగిరి. కాని వీరి ప్రయత్నములీ యువకుని వైరాగ్యజ్వాలకు మారుతమయ్యెను. వివాహమాతని దుఃఖాంధకారమును సాంద్రీకృతముఁ జేసి బ్రతుకునందు విరక్తి గలిగించినది. సంసారత్యక్తదీక్ష దుర్భరమయి, పరిపక్వావస్థఁ జెందని బాలకు నుక్కిరిబిక్కిరిగావించినది. కొన్ని మాసముల కొకనాఁడీబాలకుఁడు 'సతానా' యందలి పితామహునితో "తాతగారూ! నేనిక నీ గృహమునందుండుట దుర్భరము! నే నెక్కడికయిన వెళ్లెదను — యీ యింటికెంత దూరమున నుందునో నా చిత్తమున కంతశాంతి! — " యని ధైర్యముతో పలికెను. ఈ గృహమును విడచి, 'ధులియా' కేగినచో నట తలిదండ్రు లేమయిన మాన్పఁగలరని పితామహుఁడీతనిని 'ధులియా' కంపెను. ధులియాలోసైతము కాశీనాథుఁడు చదువుకొనక గృహమునుండి పారిపోయి వైరాగ్యజ్వాలాతప్తహృదయుఁడై, యచ్చట మహాదేవాలయ మంటపపు మూలఁ గల భూగర్భమందలి చిన్నగుహలో గంటలు గంటలు రహస్యముగా జపముసేయుచుండువాఁడు. కాని కాశీనాథుని జీవితము భరింపరానిదయ్యెను.

ఒకనాటి ప్రాతఃకాలమునఁ బెందలకడ మేల్కొని యొక కాగితముపై తన సంసారత్యాగమునకుఁ గారణముల వ్రాసి, యా గృహకుడ్యమున కద్దాని నంటించి త్వరితగమనమునఁ బారిపోయెను. నానాకష్టపరంపరలకు గురియై, యెట్టో

నాల్గుదివసముల కెనిమిది మైళ్ళు నడచి 'నాసిక' జేరెను. అంతవరకాతనికొఱకెవ్వరురాలేదు. తలిదండ్రులంత ధులియా యందు కొంతవరకు వెదకి తమకసాధ్యమని స్వప్రయత్నముల విరమించుకొనిరి. కీర్తిగతమయిన కుటుంబమునఁ గొన్ని స్వల్పకారణములచే నొకఁడు పారిపోయినాఁడను నపకీర్తిని వారు భరింపవలసివచ్చెను.

నాసికఁ జేరినపిదప కాశీనాథునకు స్వగృహము, తలిదండ్రులు జ్ఞాపమునకువచ్చి, వారి క్షేమవిషయములఁ దెలిసికొనవలయునను నూహబొడమి, 'నేనిప్పుడు నాసికలో స్నేహితులకడ నున్నాన'ని యొక లేఖను వ్రాసి పంపెను. తదనంతరము మాసము రెండుమాసములలో తన తల్లి రోగగ్రస్తురాలయినదని తెలిసికొని గృహాభిముఖుఁడయ్యెను.

కొన్నిదినముల కాతని యర్ధాంగి భౌతికశరీరముఁ ద్యజించినది. మన యువకుని కష్టములు పర్వతాకృతులఁ దాల్పఁ జొచ్చినవి. భార్య మరణించిన కొన్నివారములలోననే ద్వితీయ వివాహ మాచరింపఁబడినది. దీర్ఘాలోచనాపరులయి తలిదండ్రు లీవివాహము నాచరించినచో తప్పొప్పులం దెల్పు టంత కష్టముగాదు. పదునైదేండ్ల ప్రాయముఁ గలిగిన కాశీనాథుఁడు తొమ్మిదివత్సరము లీడుగలిగిన యాతని సతీమణియు తమ జననీజనకులచేతులలో జూదరుల హస్తగతములగు చదరంగపు కాయలైరి. వివాహమయిన వత్సరములోపలనె మరల జీవిత మీాతనికి దుర్భర హాలాహలతుల్యమయి భార్యాగృహత్యాగిని జేసి దేశములఁ దిరుగాడ సమకట్టించినది. నిజగృహమున తన భార్య వసించిన నేఁడేడులలో ప్రథమవత్సరములం దీతఁడు

'పూనా'లో నివసింప సమకట్టెను. నీచాతినీచమయిన సేవా (దుర్మార్గ విషయమునఁ గాదు) కార్యములఁ జేయుటయు, తిండికై బిచ్చమెత్తుకొనుటయు కాశీనాథునికి తటస్థించినవి. అప్పుడప్పుడింటికేగుచు వచ్చుచుండెను. 'కాని కష్టములు శాశ్వతములు కావు. మంచిరోజులు రాగలవ'ని దలఁచువాఁడు- యిదియే యీతని జీవితమందలి ఘోర విషాదఘట్టము!

లోకపూజ్యుఁడగు మహానుభావుఁడు పలువురచే నవమానింపఁబడెను. కొందరు తృణీకరించిరి. కసరి తరిమివైచిరి. గర్వాంధులగు ప్రజలచేఁ జిన్నబుచ్చఁబడెను. ఇదియే యీతని జీవితచరిత్రమందలి ఘోరవిషాదావృతఘట్టము.

విచార జీవితమునకు తన నక్షత్రములఁ దిట్టుకొని, "అయ్యో! పూర్వజన్మమున నేఁగావించిన పాపమేమి? దయామయుఁడగు పరమేశునకు నాపై నింత నిర్దాక్షిణ్యమేల?" అని తనలోఁదాను దుఃఖాశ్రుపూరితనయనుఁడై ప్రశ్నించుకొనెడివాఁడు. కాని యీదీనాలాపములకుఁ బ్రత్యుత్తరము లేదు. ఈకష్టపరంపర లన్నియుఁ, దనమంచికేయని కొంతతడవునకుఁ దెలిసికొనెను. 'కార్యనిపుణుఁడగు శిల్పి వృథాగా శిలలఁ జెక్కఁడు. రోగికిఁ గావలసినవర కౌషధము లొసంగునుగాని వైద్యుఁడెక్కువ యేమాత్రమీయఁడు. తనచుట్టుఁ గ్రమ్ముకొనిన యీశోకసాంద్రాంధకార మేఘములలో భగవత్కృపా విద్యుత్కాంతిఁ గానఁగలనని తలఁచెడివాఁడు. కాని యీకారు మబ్బులీతనిని గ్రమ్మి సాంద్రాంధకారమున ముంచివైచినవి. మార్గమాగానరాదు! యీఘోరాంధకారమున తన వైరాగ్య విద్యుజ్జ్వాలాకాంతిచే చరించి విజయమొందవలయును. ఎన్ని

దినములు తినుటకొక ముద్దైనలేక యుపవాసవ్రతములు? వేప జిగురు నదీజలము లెన్నిదినము లీయాకటిపిశాచము నాపుట? ఎట్లు తలదాచుకొనుటకు గుడిసెలేక, మాతయగు వసుంధరా దేవి యొడిలోననో, ఏవృక్షచ్ఛాయనో, ఏ బహిరంగప్రదేశ మందునో, ఏసత్రములందుననో తన మోచేయియే తలక్రింది దిండుఁజేసికొని, సుఖములు తన్నుపీడినను తన్నుపీడని జీర్ణ మలినాంబరమే యాచ్ఛాదనముఁ జేసికొని నిదురించుట? స్నేహితులెవరు? ఆహారములులేక కృశీభూతులై, ఒకరొట్టె కొఱకై తగవులాడి కొట్టుకొను దరిద్రనారాయణులు దప్ప?

భయంకర కష్టాగ్నిజ్వాలలో మ్రగ్గి తేలిననేగాని నిజ మయిన మానవత్వము బయటపడదు. గాయములు తగిలి రణరంగములోఁ బడిపోయి, పిపాసాపీడితుఁడై, మరణశయ్యపై నున్న 'సర్ ఫిలిప్‌సిడ్నీగారు' దాహోపశమనమునకై, యతి కష్టమున నొక జలపాత్రమును దెప్పించుకొని, త్రాగనున్నతఱి ప్రక్క మరణావస్థలో పిపాసాపీడితుఁడై గాయములుతగిలి పడి యున్న సాధారణసిపాయిని గాంచి, "మిత్రమా! నాదాహోప శమనముకన్న నీకోరికఁ దీర్చుటయెక్కువ" యని జలంబొసగి యుసురులఁబాసిన విషయమే యిచ్చటఁ గాంచనగును. 'పూనా సరిహద్దులలో నోంకారేశ్వరదేవాలయముకలదు. ఆదేవాలయ మందు తినతిండిలేక మలమలమాడు దరిద్రనారాయణ సంఘ ములో నొకసభ్యుఁడు మనకాశీనాథుఁడు. ఒకప్పుడితఁడు మూడహోరాత్రము లన్నములేక కనులుమూసికొని పరుండ వలసివచ్చెను నాలవదినమున దుర్భరమైన నాకటిమంట కాగ

లేక పట్టణవీధులలోనఁబడి తిరుగుటఁగని నొకదయార్ద్రహృద
యయగు స్త్రీ యీమహాత్మునకాహారమిడినది. పట్టెడన్నము
లేక మలమలమాడుచున్న నీభారతపుత్రుఁ డితరుల కాశ్చర్య
మునఁగల్గించు మితిమీరిన తిండి భుజించెను. రెండవదినమునఁ
గూడ నాయమె, భోజనముబెట్టఁ దినఁదిండిలేక తోలుఁగప్పిన
శుష్కశల్యాంగములతో మలమలమాడుచు విచిత్రఖేదతాం
డవ మొనరించుచున్న దరిద్రనారాయణులు నేత్రములయెదుటఁ
గానఁబడ దేవాలయమునకుఁబరుగిడి తెచ్చిన పదార్థమంతయు
వారలకిడెను. ఈ మహనీయుని యుదారస్వభావమున కచ్చెరు
వంది యా లలనామణి నెలదినము లాహారమొక వేయిమంది
దరిద్రసోదరుల కుక్షుల కర్పించి ధన్యాత్మయయ్యెను. ఈవిధ
ముగజీవితములోననేక పర్యాయములు కాశీనాథుఁడు తనప్రక్క
బాధపడుచున్న సోదరుఁవీడి తృప్తిపడి యుండలేదు. భృంగము
చేదుపూవులనుండి సైతము, మధుబిందువులఁ గ్రోలురీతి, కాశీ
నాథుఁడు, దుర్మార్గులనుండి సయితము మంచిని గ్రోలువాఁడు.
తదువరి కాశీనాథుఁడు తన దరిద్రసోదరులను, పూనానువిడచి,
తనకు బ్రహ్మచర్య ప్రాశస్త్యమును, శివారాధనామార్గమును
బోధించి, తన భావిజీవితమునకు మరువరాని మేలుగూర్చిన
సాధుబ్రహ్మచారి యను యోగీంద్రునికడ కేగెను.



## అధ్యాయము ౪

## బూర్గాడ్ గుహాంతరమున ననేక మాసములు సమాధియందుండుట

బ్రహ్మచారినివీడి కాశీనాథుఁడు పశ్చిమమునకరిగెను. దొరకినదినమునఁ బెసలుగాని వేపుడుబియ్యముగాని యవల రొట్టెగాని భోజనము. దొరకని దివసమున నుపవాసము. కొన్నిదినముల కితఁడు కల్యాణపురమునకేగి క్షుద్బాధాపీడితుఁడై, 'భవతీ! భిక్షాందేహి!' యని బ్రాహ్మణజాతీయోద్యోగుల గృహకవాటములకడ మొఱఁబెట్టుకొనెను.

కాని మానవాకారములఁ దాల్చిన నాక్రూరరాక్షసులు కసరి తరిమివైచిరి. శోకపరితప్త హృదయుఁడై, యొక జలాశయముకడ కరిగి నీరుఁద్రావి నిజ దురంతోదంతమున కంతరంగమున వంతఁజెందుచు నొకవృక్షచ్ఛాయను పరుండెను. నేత్రములనుండి ప్రవహించుచున్న దుఃఖాశ్రువులు పైనున్న జీర్ణాంబరమును తడపివైచినవి. అశ్రుతోయములఁ దానమాడిన యాపదితొమ్మిదేడుల బాలకుఁడు అత్రోవనేగుచున్న నొక మరాటీయువతి దృక్పథమునఁ బడెను. ఆముదుసలి యాతని సమీపించి వృత్తాంతమంతయు నాకర్ణించి గడచిన తన దుఃఖమయ పూర్వవృత్తాంతమును జ్ఞప్తికిఁదెచ్చుకొని ఆయమ తండ్రిచెప్పిన యీక్రిందివాక్యము లాతనికివినిపించినది. 'జలముఁ గ్రోలియైన జీవితముఁ గడుపుము. (ఏమియు లభింపక పోయిన) – పరమేశ్వరుని ప్రేమింపుము –సర్వకార్యములయం

దప్రమత్తుఁడవుకమ్ము - దురదృష్టమును భరింపుము. అదృష్ట మొనఁగూడినఁ ద్యజింపుము - నీకోరికల నరికట్టుము. మహాత్ముల చెలిమిని వీడకుము." ఈ పవిత్ర వాక్యముల నాకర్ణించిన కాశీనాథుఁడా సందర్భరితుఁడై జ్ఞప్తియందుంచుకొనఁ దనలోఁ దాను మననముఁ జేసికొనియెను. కులవిచక్షణాభిమానమున నీతఁ డామువ్వ సలినుండి జలాహారములఁ బొందలేడుగాని పరమానందమునఁ గొంత జ్ఞాన మలవరచుకొనియెను. "నీకింత యన్నముఁ బెట్టని పాషాణహృదయులగు పురుషులుందురా ముందరిద్వారమున. ఆ వెనుకద్వారముకడ కేగి యడుగుము. సుగుణులగు గృహిణు లన్నముఁ బెట్టఁగలరు." అను నీ వృద్ధాంగనావాక్యముల విని మరియొకసారి యాబ్రాహ్మణోద్యోగుల గృహాంగణపు వెనుకద్వారముల భిక్షాటన మొనరించెను. అచ్చటీసారి యాతని కశనము దొరకినది. వృద్ధ మరాఠీకాంత తనకు, 'స్వజాతీయ తత్త్వమునకు (స్త్రీలకు) ప్రపంచమందలి పురుషులకుఁగల భేదమును తెలిపినదని మనమున గ్రహించెను.

కల్యాణమునుండి 'సతానాకు' ప్రయాణము సాగించినాడు. మార్గమున నాసికదాటి పదిమైళ్ళ దూరమునఁగల రెండు శివాలయముల గాంచెను. అచ్చటనుండి ఆతఁడొక సాంద్రారణ్యమును గాంచెను. ఆ యరణ్యమధ్యమున నొక కొండగలదు. (భూర్‌గాడ్‌కొండ) యీ కొండపైభాగమున మనుష్యులుగాని మృగములుగాని సులభముగాఁ జేరరాని చిన్నగుహాకలదు. ఈదృశ్యముఁ గాంచినంతనే కాశీనాథుని

కిది యొక పవిత్రప్రదేశమనియు తానిచ్చటఁ *ప్రాయోపవేశ మొనరించి నిర్జలాహారుఁడై మృత్యుగర్భమున కతని శరీర మొసంగవలెననెడి యూహజనించినది. తన పూర్వకర్మవల ననే యివియన్నియుఁ జరుగుచున్నవని తలంచి, దుర్గమను లయిన శిలాకంటకావృత ప్రదేశములదాటి, యెట్లో యగ్గిరి పాదమునకుఁ జేరి యిరువదిముప్పదడుగుల యెత్తువరకుఁ బ్రాకి నొక వటవృక్షమున్న విశాలరహితమయిన కొండయంచును పట్టుకొనెను. అంత నతఁడామహీజముఁబ్రాకి గుహపైకిఁబారిన నొక శాఖనుండి యా గుహాద్వారమున దుమికెను. అచ్చట నతఁ డుపవిష్టుఁడై నలుదిక్కుల దృక్కుల సారించెను. కను చూపుమేరలో—నిర్జనమైన యరణ్యము. కొన్ని మైళ్ళ దూర మున గుడిసెలు కొన్నిమాత్రము కానవచ్చినవి. రెండహోరా రాత్రము లచ్చట నిద్రాన్నపానములఁ ద్యజించి సంతోషముగ మృత్యుగర్భ ప్రవేశమునకు వేచియుండెను. మూడవదిన మాతని మానసమున, "కీ వృథాకాలక్షేపమేల? మృత్యువు నకై వేచియుండి కాలమును వ్యయపుచ్చుటకన్న భగవధ్యా నము తరుణోపాయము!" అను యూహ బొడమి పవిత్రము లయిన మంత్రములతో జపముసేయ మొదలిడెను. ఆతఁడటుల జపముసేయుచు 'సమాధి' యందున ప్రవేశించెను. ఆతఁ డెట్లంతకాలముండెనో యాతనికే తెలియదు. సమాధినుండి లేవనున్నతఱి పామునకుఁ గుబుసమూడునట్లు యెవరో యొక వ్యక్తి తన శరీరోపరిభాగమునఁగల చర్మమును వలచినట్లుఁ

* ప్రాయోపవేశనమనఁగా మృత్యువునకు సిద్ధపడుట, ఆత్మహత్య వలె నిది క్రూరకార్యముగా నెంచఁబడదు.

దనకుఁ బొడకట్టుటచే భయభ్రాంతుఁడై కనులఁ దెఱచెను. ఆ నూతనవ్యక్తి కానఁబడలేదు. శరీరముఁ జూచుకొని యాథావిధిగా నుండుటఁ గాంచి సంతసించెను. అంతటఁ నాతనికిఁ బిపాస జనించినది. నాలుక పిడుచగట్టి వెనుకకు లాగుకొనిపోవుచున్నది. 'జలమని' బిగ్గరగా యఱచుటకైన శక్తిలేదు — అఱచినను — ఆ భయంకర నిర్జనారణ్యములో — దుఃఖమును చూడఁజాలకఁ గంపించు వృక్షములుదప్ప వినువారెవ్వరు? కనుచూపుమేరలో యెచ్చటను జలము కానఁబడలేదు — ఉన్నను కదలుటకు సైతము శక్తిలేదు. జపార్థమయి వదలబడిన కుడిచేయిదప్ప సర్వావయవములు మొద్దుబారి చలనరహితములయినవి. నిజముగా పిపాసాపీడితుఁడై మృత్యువును గలిసికొన వలసినదే?! "నేనీ ప్రదేశమునకు మృత్యుదేవతాలింగనమునకుఁ జనుదెంచి మరణింపనుంటినని భయమొందనేల?" యని ధైర్యహృదయుఁడయ్యెను. దయాస్వభావయగు ప్రకృతి యీతనిని మూర్ఛాక్రాంతునిఁ జేసి పున్నెముఁ గట్టుకొనినది. ఇట్టి సమయమున — మేఘములు క్రమ్ముకొనినవి. వనమంతయు గాఢాంధకారబంధుర మయినది — ఆ కారుమేఘముల నుండి 'తళుక్కు'మని మెఱసి యదృశ్యములగుచున్న విద్యుల్లతలు — భయంకరములై, కొండలనుండి గుండులు దొఱలించిన ట్లురుములు కడవలతోఁ గ్రుమ్మరించిన తెఱంగున నలుదెసల వర్షధారలు — కాననమంతయు జలమయము. ఆతని గుహలోనికి సైతము నీరు వచ్చినది. ఆతఁడు స్మృతివచ్చి కనులఁ దెఱచుతఱికి వర్షమాగి తనకుఁ జేరువగనే కుడిచేతి కందునటుల నీరుండుటఁగని భగవన్మహిమకు సంతోషస్వాం

తుఁడై జలములఁ గుత్తుకబంటి గ్రోలి, కారుణ్యామయమగు ప్రకృతివైపు చూపుల నిగిడ్చెను. ఆహా! మహనీయుఁడగు కాశీనాథుఁడు క్షుత్పిపాసావస్థచే మృతినొందక తమ కపకీర్తిఁ దొలగించినాఁడను సంతసమున నానందబాష్పములు రాల్చు చున్నవోయన యా వనశాఖి పర్ణములనుండి వర్షబిందువులు రాలుచుండెను. ఇతఁడట్లు జలములఁ గ్రోలి మూఁడుదినము లాకలిదప్పుల నుపశమింపఁ జేసికొనెను. తన కుడిచేయి సహాయమున యితరావయవములు సళ్ళుబారి కదలసాగెను. ఈ మూఁడుదినములందొక నాఁడాతఁడొక కలఁ గనెను.

జలములఁ గ్రోల నాతఁడొక ప్రవాహముకడ కరుగ హిందువుఁ డొకఁడు, మహమ్మదీయుఁ డొకఁడు తన కిరు ప్రక్కల నిలువఁబడి తన శరీరోపరిచర్మమును లాగివైచి (యొలిచి) ఆ శరీరమునుండి మరియొక సూక్ష్మశరీరమును వెలికిఁ దీసి దానినిఁజూపుచు "ఓయీ! నీవు చచ్చుట కిచ్ఛగించెదవా? నిన్నుఁ జావనివ్వము మేము. మేము నీ వెనుకనేయున్నాము" అని యంతర్ధానమొందిరి. అందుచేత నితఁడీల్గుట కిచ్ఛగింపక యీ గుహనుండి పోవుమార్గము నన్వేషింపఁ దొడఁగెను.

ఈతని శరీరము శుష్కించినది. పూర్వపు శరీర పటుత్వము క్షీణించినది. ఈతని శరీరమిప్పుడు తోలుగప్పిన యెముకల బొమ్మ. బలహీనుఁడగుటచే కొండదిగుట సాధ్యము కాదయ్యెను. ఆ కొండయంచునఁ గల వటశాఖ నొకదానినిఁ బట్టుకొని పర్యవసాన మేమైనను సరియే, క్రిందికి దుమకనుద్యుక్తుఁడై యటులఁ గావించెను. కాని దైవవశమునఁ గ్రిందికి దొరలకఁ గూలఁబడియెను. శరీరమునకు కొన్ని చిన్న గాయ

ములు తగిలి కొంచెము బాధ కలిగించినవి. సాయంతనము నాలుగు గంటలప్పుడు ప్రయాణము ప్రారంభమయినది. పాపము! నడువలేనందునఁ బ్రాకుడు పురుగువలె నేలపై చేతులపైనను పాదములపైనను ప్రాకుకొనుచు నెమ్మదిగా పొదలు, రాళ్లు, గుట్టలుదాటి మార్గరహితమయిన కాననమునఁ బడి యైదుగంటలు ప్రయాణముఁజేసి రెండుమైళ్ల దూరములో నున్న 'గావల్ వాడీ' యాదిమనివాసుల గుడిసెలున్న ప్రదేశముఁ జేరెను. ఆ అంధకారమున నేలపైఁ బ్రాకుకొనుచు తమ దెసకు వచ్చుచున్న యా శుష్కీభూతశరీరునిఁ గాంచి కొందరు 'భిల్లకాంత' లేదియో 'పెనుభూత' మనుకొని భయ భ్రాంతులై పరువెత్తుచుండఁ గని, కాశీనాథుండు మాటలు తడఁబడ హీనస్వరుండై, "నేను మనుష్యుఁడను — భయపడకుడు..." అని పలికెను. అంత వారు చేరువ కరుగుదెంచి వృత్తాంత మాకర్ణించి తమ గుడిసెలకుఁ దీసికొనిపోయి మూడు దినములు క్షీరములిచ్చి పోషించిరి. నెలదినములు లా యాదిమ నివాసులచే నీయఁబడిన యడవిధాన్యములఁ దిని, వారితోఁ గలిసి కట్టెయలఁ గొట్టుకొని నాసికయందమ్మగా వచ్చిన ధన మును వారల కొసఁగుచుండెను. తదనంతరము తన ప్రయాణము సాగించి, 1890 జులై 22 వ తేదీన 'సతానా' జేరెను.

గృహముఁ జేరినపిదప 'తన ప్రయాణములలోను తిరిగి వచ్చుటయందుఁ బట్టిన కాలముఁ దెలిసికొని 'బూర్ గాడ్ గుహ' యందా సమాధ్యవస్థలో చాలకాలముఁ గడిపితినని తెలిసి కొనియెను.



# అధ్యాయము ౫

## అదృష్టము - దురదృష్టము

బూర్‌ఘాగ్ కొండ గుహాయందు పొందిన సమాధి దశ నుండి కాశీనాథుని జీవితము నూతనఘట్టముగా మారినది. అట్లతఁడు మహాతపోనిష్ఠాగరిష్ఠుఁడై నిర్వికల్ప సమాధియం దనేక మాసములుండునంతటి మహోజ్వలశక్తి వచ్చునని ఆతఁడుగాని, బంధుగులుగాని కలనైనఁ దలఁచి యెఱుంగరు. అదియుఁగాక ఆ కొండగుహాలో మృత్యుముఖమునుండి వెలువడి సజీవుఁడగుటెంతయు నాశ్చర్యకరము! అతఁడు నిజముగా అంతవరకుడాగి యిప్పుడిప్పుడు బయల్పడి ప్రపంచమునకు నిజ ప్రతిభాగంధమును విరజిమ్ముటకు వికసింప నున్న పుష్పము వోలు తపస్వి (యోగి) గాని—యెందుకుఁ బనికిమాలిన మందబుద్ధిగాడు—!

ఈ విధముగ నా బూర్‌గాడ్ నందు సమాధిఁబొందిన నాటనుండి యాతనికీర్తి దిశదిశాక్రాంతమగుటతఁడు మహాను భావుఁడు ప్రపంచోద్ధరణార్థమావిర్భవించిన దివ్యపురుఁడు! కులదీపకుఁడు!" అని ప్రజలు వాకొనసాగిరి. ఇతఁడు నిజ గృహామునకు ప్రయాణమయిన పదునెనిమిది దినములలో 'గోకులాష్టమి' దినమున (8 8-1890) నిజజనకుఁడు 'సతానా' యందు నిర్యాణ మొందినందున నప్పుడున్న వారలయం దాతఁడే గరిష్ఠుఁడుగాన తండ్రి కంత్యక్రియలు నెరవేర్చుట కాశీ నాథుని పనియయ్యెను. ఆతని పితామహుఁడగు 'గోపాల

శాస్త్రి సైతము హెమిప్లేగియా పార్శ్వవాతము (Hemiplegia) వలన మంచముఁబట్టెను. తాతగారి కుపచర్య సేయుచు ఆయుర్వేద గ్రంథముల నవలోకించుచు యితరుల వలన ననేక సలహాలఁబొందుచు నన్ని యౌషధముల స్వయముగ దయారుసేయుచు, ఆ యా యౌషధ తత్వములఁ గ్రహించుచు పరీక్షించుచు కాశీనాథుఁడు వైద్యశాస్త్రమునఁ గొంత ప్రవేశముఁ గల్గించుకొని యీ వైద్యపరిశ్రమనే సలుపవలయునని తలంచెను. ఆతని పితామహుఁడు 1892 వ సంవత్సరమున సంసారమును దరిద్రావస్థలో విడచుటయేగాక ఋణబాధావశ్య మొనరించి దివంగతుఁడయ్యెను. తదుపరి యొక సంవత్సరమున కాకుటుంబము 'లోకమాన్య బాలగంగాధరతిలక్' మహాశయుని మహెూన్నతోదారకారుణ్యవృక్షము క్రింద నీడఁ గలిగించుకొనియెను. ఇట్టి యిక్కట్టులలో గోరుచుట్టుపై రోకటిపోటువలె కాశీనాథుని ద్వితీయార్థాంగి దివంగతురాలయ్యెను. ఇట్టిసమయమున బాలకృష్ణశాస్త్రి కష్టించి, కొలదియో గొప్పయో సంపాదించుటకని కాశీనాథుఁడు సైత మేదేని కృషిసల్ప నుద్యుక్తుఁడై 'సంగ్లి' కేగి, అనేక కష్టపరంపరాహతుఁడయి ఆయుర్వేదశాస్త్రమును, సంస్కృత వ్యాకరణమును, వేంకటరమణాచారిగారికడ నభ్యసించెను. మొదటివత్సరమున* అన్యాయముగాఁదటస్థించిన నొకయాపదకు

* 1896 వ సంవత్సరమున నిది జరిగినది. అమరావతి యందలి దేవాలయమున నొక హరికీర్తనా సమాజము కలదు. అచ్చట ఏదియో ప్రసాదము పంచిపెట్టఁబడెను. అది తిన్న వారిలో కొంతమంది రోగ గ్రస్థులై మరణించిరి. ఆ ప్రసాద మేదో యుక్తపదార్థమై యుండవచ్చును.

లోనయ్యును, అమరావతియందు తన పరిశ్రమ వృద్ధిసేయుచు పదివత్సరములు వసించెను. అతఁ డమరావతిని ప్రవేసించినది 1896 వ సంవత్సరమున. అచ్చటతఁడు జి. యస్. కఫర్ దే గారి సాహాయ్యమున వైద్యాలయ మొకటి స్థాపించుటయే గాక దాని కుపవైద్యాలయ మొకటి 'నాగపురము'న సైతమున నిర్మించి ఔషధములఁ బ్రచారమొనరించుచు, 'భేషజరత్న మాల' యను వైద్యవిషయక మాసపత్రిక నొకదానినిఁ బ్రకటించుచు తన పరిశ్రమను వృద్ధిగావించి కొంత ధనము గూడ గడింపఁగలిగెను. ఈ యమరావతీ ప్రవేశమునకు ముందే, యాతఁడు మూడవ పెండిలి చేసికొని యుండెను. ఆయమ గూడ నిచ్చట తన భర్తతో వసించుచు నిరాడంబరముగ దయాకలిత స్వభావమున భక్తియుతమయిన జీవితముఁ గడిపినది. అదృష్టమాతని యందునఁ దాండవ మాడుచుండుట వలన యమరావతి యందలి యాపదివత్సరము లాతని పూర్వ బాధల స్మృతి పథము నుండి తొలగించినవి. సహజాగ్న్య మతాభిమాన యనుదిన మాతఁడు పూజా, ప్రాణాయామముల నిర్వర్తించుచు సీతాగాడు పంచదశి ప్రాణాయామ : శ్రమ మొదలగు గ్రంథములఁ జదువుచుండువాఁడు. ఈ విధముగనే అదృష్టదేవత యాతనిని ఆ యమరావతి యందుననో, నాగ

---

దీనిలో కాశీనాథుఁడు గూడ నేరస్థుఁడుగా నెంచఁబడి నాలుగు మాసముల కొలది శిక్ష ననుభవించెను. అది యాతని మీద నన్యాయముగా విధింపఁబడిన శిక్షయని మనము గ్రహింపవచ్చును. తదనంతరము మరల మంచి స్థితిలోనికి వచ్చి (1896 - 1906) అమరావతి నాగపురములయందు పెద్దవారిలో స్వేచ్ఛగా సంచరించెను.

పురమున నో రోగాస్పదులకు మిత్రులకు ప్రేమాస్పదుఁడయి మర్యాదగడించిన గృహస్థుఁడుగా తన జీవితము గడుపుకొను నట్లు మార్చినది. కాని – బూర్‌గాన్ గుహాంతరమున నాశ్చర్యకరముగ రహస్య రక్షకులచేఁ గాపాడఁబడిన జీవితమున కేదియేనా పర్యవసాన సాఫల్యము? అవమానములకోర్చి పట్టెడు కూడయినలేక యహోరాత్రము లలవటిల్లి బాధల భరించి దుఃఖతరంగోప హతుఁడయ్యును తెప్పరిల్లి మహోన్నతమయిన తప స్సొనరించి సమాధ్యవస్థను పొందిన యీతనికి లభించిన విధియేనా? ఉన్నత పర్యవసానములు? ఏది యెటులున్నను, డాక్టరునకు వేరేపర్యవసానములు ఈ పరిశ్రమయందునఁ గానఁబడ వయ్యెను. డాక్టరు సంతానహీనుఁడయినను తన పరిశ్రమయందు బాగుగా ధనము గడింపఁ గలఁ డనియు, అదియుఁ గాక తన జీవితము నొక ధనికుఁడును, భక్తుఁడయిన డాక్టరొకఁడెటులఁ గడుపఁగలఁడో, యటుల గడుపఁగలఁ డని' సహజముగా జనులనుకొనుచుందురు.

బూర్‌గాన్ గుహాంతరమున, తన ప్రాణవాయువుల దక్కించి,తనదివ్యశరీరముఁ దనకుఁ జూపించి కాపాడిన మహాత్తర దివ్యజ్ఞానశక్తి ఎచ్చట డాగినది? అది నశించినదా? లేక మఱియొక పర్యాయ మీ తుచ్ఛపు ఐహికేచ్ఛల విరక్తినిఁ గలిగించి, మహోన్నత జ్ఞానానంద జీవితము నొనఁగూర్పఁ గలదా?

తానుగడించిన ధనమందు కొంతవెండిపాత్రలకు, గృహమందలి పనిముట్లకు, తదితర కార్యములకు, వెచ్చించెను. మరికొంత మతవిషయకముగ వెచ్చించెను. మరికొంత

మిగిలినది. అట్టి సందర్భమునసే, 'గ్వాలియర్ కల్లోలము' సంభవించినది. మాల్‌గుజరీస్ అని పిలువబడు 'దక్షిణ ఇండియా' యొక్క 'మిట్టాస్'కు సంబంధించిన ఎస్టేటులును బెంగాలీజమీందారీ భూములును చవుకరేట్లకు విక్రయింపఁ బడుచుండెను. ఇట్టి సమయముఁ బోగొట్టరాదని డాక్టరు 600 రూప్యములు చెల్లించి 2000 ఎకరముల ఎస్టేటును గొనదలంచెను. ఆభూముల కౌళ్ళకిచ్చి, వ్యవసాయముఁ జేయకయున్న బంజరుభూముల సేద్యముఁ జేయించియు అపరిమిత లాభముఁ గాంచవచ్చునని తలంచెను.

వెంటనే 600 రూపాయలఁ బంపించి, తన సామానులఁ దీసికొని, తన పరిశ్రమకు, ఔషధములకు, మెడికల్‌జర్నల్‌కు, అమరావతి · నాగపురములకొక నమస్కారమిడి, తనయెస్టేటును ప్రవేశించెను. అందువలనఁ బండిత ఉపాసనశాస్త్రి కె. 'ఉపాసన మల్‌గుజార్'గా మారిపోయినాడు. విశ్వాసపూరితులయిన ఔషధసేవకులచే నిండియుండవలసిన పత్తనము, పన్నులు వసూలుచేయవలసిన వారలతోడను వ్యవసాయ నిర్వాహకులయిన మిత్తేదారులతోడను నిండిపోయెను. పూర్వపు 'మల్ గుజార్' క్రూరుఁడగుటచేతను, యీతఁడు క్రొత్తవాఁడును యీవిషయముల నీతఁడెఱుంగడు కావునను, దురాలోచనాపరులయి గ్రామోద్యోగస్థులు, తదితరులు, కౌలుదారులు లక్ష్యముసేయరైరి. పన్నులు సక్రమముగా వసూలగుట సులభముగాదయ్యెను. వ్యవసాయక్రియలు సక్రమముగా నిర్వర్తింపఁబడుటలేదు. ఖర్చులవలన లాభములేకపోయెను. ముందు సంపాదనయంతయు వ్యయపరుపవలసి వచ్చెను. పైఆఫీసర్లకుఁ

దెలియఁజేయుటవలన లాభములేదు. ధనమంతయు యీపాడు పనులకు వెచ్చింపవలసివచ్చెనని తలంచెను. ఒక్కొక్కప్పుడు స్వకార్యములయందొక గ్రామమునుండి మరియొక గ్రామము నకుఁ బ్రయాణము సేయునప్పుడు, కౌలుదారులు, పనివాం డ్రిచ్చిన, యాతిథ్యములవల్ల ఆరోగ్యము సన్నగిల్లినది. ఈకష్ట పరంపరలఁదలంచి, పూర్వరీతి, శాంతజీవితమును గడుప నమ రావతికిఁ దిరిగివచ్చెను.

అమరావతిలోసైతము దురదృష్టదేవత ఆతనిని వదల దయ్యెను. వైద్యపరిశ్రమ యొకపర్యాయము చాలించుకొని, మరలఁబ్రారంభించుటవలన లాభములేదు. ఆతని ఔషధములు విక్రయింపఁబడకపోవుటయేగాక, జర్నల్‌గారుగూడ మరణిం చిరి. మరల బాగుగాఁ బరిశ్రమసల్ప యావచ్ఛక్తిని ధారపో సెను. కాని లాభములేదు. దీనితోపాటనారోగ్య మాతనిని వేధింపసాగినది. ఒక్కొక్కప్పుడు తిరిగి తిరిగి, రాత్రికిగాని యలసిసొలసి నిరాశాహృదయముతో గృహమునకు వచ్చు చుండును. ఈవిషయమును గ్రహించి, భార్య యీపరిశ్రమను విరమింపుమని బ్రతిమాలినది. అందుల కాతఁడు 'నిజదారా పోషణమున కయినను, ధనము గడింపవలయును' అని నుడు వుటచే, ఆయనసతీమణి తనభర్త తలపునకు మిక్కిలి చింతించి, తననాథునికన్న ముందుగనే గతింపఁగలనని నుడివినది. తదనంత రము 'డాక్టరు' తనవైద్యకృషిని చాలించి, ఏప్రియలు 10 వ తేదీన దాచినధనముతో, విశ్రమముఁదీసికొని, తన కాలమును, శక్తిని, పవిత్రయాత్రలయందు వినియోగింపఁ బయలుదేరెను.



# అధ్యాయము ౬

## యాత్ర

నర్మదానది గట్టులపైనఁ గల ఓంకార లింగమును నీ భక్తియుతులయిన దంపతులు దర్శించిరి. ఆ నదికి దాని యుప నదియైన కావేరీనదికి మధ్య నొక చిన్న కొండ గలదు. పర్వతాగ్రమునఁగల నరణ్యమధ్యమున నొక మహోన్నత లింగము గల చిన్న ఆలయము — (సోమనాథ లేక గౌరీశంకరాలయము) కలదు. ఈ లింగపు చుట్టుకొలత దాదాపు పదునొకండడుగులు. పీఠము గాకెత్తు ఆరడుగులు. పీఠముతో తొమ్మిదిఅడుగులు. ప్రశాంత మీ దేవాలయమున మూర్తీభవించియున్నది. ప్రార్థన సేయ వారిరువు రాలింగమున కిరుపార్శ్వములఁ గూరుచుండిరి. తెలియకుండగనో, తెలిసియో పూర్వపరిశ్రమయగు శ్వాసా నిరోధము (ప్రాణాయామము)న కుద్యమించెను.

కొంతతడవున కాయువతీమణి తెలివితప్పి మాటలులేక యుండుటేగాక హృదయచలనము సైతమాగి క్రిందఁబడియున్న భర్తనుగాంచినది. దానికామె భీతిఁజెంది, ఆతని ముఖముపై కొంచెము నీరముఁ జల్లినది. కొంచెము తెలివి వచ్చినదికాని ఆతని శ్వాసకోశములాగియే యున్నవి. ఇప్పుడు డాక్టరు తనకు స్మృతి వచ్చినదని తెలిసికొని తన శ్వాసకోశములు చెడి పోయినవని తలంచెను. తదనంతర మాతఁడు తదితరకండరముల నిజశరీరభాగములఁ గదలించుటచే శ్వాసకోశము లాడనారం భించినవి.

ఏది ఎటులున్నను ఆశ్చర్యకరముగ భగవత్కృపావిశేష మున నీ పర్యాయము సైతము ప్రాణము దక్కినందులకుఁ బరమేశునకుఁ బ్రణుతి లొనర్చిరి.

నాగపురమున సైతమప్పుడప్పుడు శ్వాసావస్థ తల యెత్తు చుండుటవలన పెద్ద శబ్దముతో నుచ్ఛ్వాస నిశ్వాసము లతి వేగమునఁ జరుగుటచే మిక్కుటముగ మరణబాధపడెడువాఁడు. ఆ శ్వాసకోశావస్థయు, మితిమీరిన శ్రమయు లేనప్పుడు, డొమాక్లిస్ ఖడ్గమువలె, ఆతని కట్టెదుటఁ బ్రత్యక్షమగునది. శ్వాసయోగి యాకస్మికముగ మృత్యువు పాలుగాగలనను భయము – దానివలన నాతఁడు కంటినిండ నిదురయు, కడుపు నిండఁ గూడెఱుంగఁడు. దానితోపాటు మలబద్ధము మిక్కిలి బాధించుచుండెను. ఇట్టి కారణము వలన ఆతని నియమిత దిన చర్య క్రమముగఁ జరుగక జీవితమంతయు దుఃఖాంధకారమగ్న మయినది. ఇట్టి యనారోగ్య కారణమునఁ గాశీనాథుఁడు నాగపురమున వైద్య పరిశ్రమను వీడుటకు వీలుకలుగదయ్యెను. తాను వైద్యసహాయముఁ గాంచుచు ఇతరులకుఁగూడ సహా కారము సలుపవలెనను గోరిక మిక్కిలిగా యుండెడిది. అనేక భిషగ్వరులువచ్చి చూచిరి. కాని వారి యనుభవములోపలను చదువునప్పుడుసైత మిట్టిరోగమును వారెప్పుడుగాంచి యెఱుంగ మని వాక్రుచ్చిరి. ఇది ప్రాణాయామము వలనఁ బుట్టుటచే "యిదేమియు జబ్బుగాదు. ఎవరివద్దను నేర్చికొనకయే గొప్ప హఠయోగ పరులచే నొనర్పఁబడు శ్వాసానిరోధమువలనను, రక్తచలనము నాపుటవలన నీతనికిది సంభవించినది. ఏమందులు

లేకయే ముందు ముందిది కుదురఁగల"దని కొందరు సలహో లొసంగిరి.

ఎట్లయినను 'నాగపురము' బాధావశుఁడైన పండితునకు శాంతి యొనఁగూర్పదయ్యెను. ఎప్పుడో, యొకప్పు డాకస్మిక ముగా మృత్యువాతఁబడుదుననియు పరాయివారి మధ్యమున బ్రాణములఁ గోలుపోవుట వలన యితరులకుఁ జచ్చునప్పుడు సైతము కష్టముఁ గల్గించినవాఁడనగుదు' నని తలంచి కాశీ నాథుఁడు నిజమాతాసోదరులు వసించుచున్న 'ధులియా' కేగెను. ఇచ్చట సైతము పూర్వమువలె, మామూలు వైద్య ములు మతవిషయక వైద్యములు జరుపబడుచునే యున్నవి. కాని వాని వలన లాభము లభింపదయ్యెను. సనాతనులు తమకు తటస్థించిన కష్టపరంపరలకుఁ గారణము 'పూర్వకర్మ' ఫలితమనియు తన్నివారణమున కిప్పుడు, సత్కర్మాచరణమే మార్గమని తలంతురుగానఁ దన వైధవ్యముఁ దొలగించుకొను టకు సత్కర్మచేయుట తప్ప వేరుమార్గములేదని ఆతని సతీవ తంసము దలంచినది. ప్రాణేశ్వరుఁడు ఆరోగ్యలబ్ధుఁడు కావలె నని, పాపమాతని యర్ధాంగి 1,25,000 పర్యాయము లశ్వత్థ వృక్ష ప్రదక్షిణమాచరించినది. ఎన్ని వైద్యము లొనరించినను లాభము గానరానందున కాశీనాథునకు వినుగుజనించినది. శరీ రము కృషించుచున్నందులకుఁగాని, అనారోగ్యమువల్ల గలిగిన కష్టములకుఁగాని ఆతఁడు లెక్కించి యుండఁడు. ఒక్కసా రియే మృత్యుదేవత కబళించినట్లయిన సంతోషదాయకమే. ఎప్పుడో యొకప్పు డాకస్మికముగ మరణదేవత తనపైనఁ బడ గలదను భయము మాత్రమాతనిని వేధింపసాగినది. దీర్ఘ

కాలమునుండియు, తనబంధుగుల కాతురతయు, దుఃఖము, తన వలనఁ గలుగుచున్నందుల కాతని చిత్తము దుఃఖాయత్తమయి నది. దాదాపు పన్నెండు మాసములనుండి కాశీనాథుఁ డీవిధముగ 'ధులియా'లో కాలము గడుపుచుండెను. మరల ప్రపంచ పర్యటన మొనరించి, తన రోగమును నయముఁ జేసి, తన్నొక సుఖజీవిగాఁ జేయఁగల యోగినిఁ గనుఁగొనుట గాని, తన బంధువుల కేమాత్రము బాధఁ గలిగింపక, నెచ్చటనో యొక్కచోటఁ దన భౌతికదేహమును త్యజించుటగాని చేయవలయునని నిశ్చయించుకొనెను. తదితర పథము లాతని కగోచరములయ్యెను. ఇట్లు నిశ్చితాభిప్రాయుఁడయి ప్రయాణకాలమునఁ దనకు సహాయార్థమనుపఁబడిన నిరువురు బాలురతో 1911 వ సంవత్సరమున నేప్రియల్ మాసారంభమున ధులియా నుండి బయలుదేరెను. కాని ప్రయాణమయిన మరుసటి దినముననే యాతఁడా బాలకుల వెనుకకు మఱల్చి ఆరోగ్య ప్రదాన మొనరించు యోగివరుల నన్వేషింప నొంటరియై పయనించెను.



# అధ్యాయము ౪

## రోగనివారణమునకు యోగిని వెదకుట

పండితుఁడు మొదటఁ జనినది 'అహమ్మద్‌నగర ప్రాంతమునఁగల 'రాహురి' యందలి 'కూల్‌కార్ని' (Kool Karni) యనెడి యోగికడకు. తన శరీరానారోగ్యమున కేదేని మందొసంగుటకు బదులపరిమితమయిన భగవన్నామోచ్ఛారణ నిర్ణయింపఁ

బడెను. సోమనాథాలయమున నతనికిఁగలిగిన యవస్థల నాకర్ణించి 'కూల్ కాన్సి', శ్వాసకోశములు రక్తచలనము సైత మాగుటయు చిత్తచలనముసైతమాగి, స్మృతిహీనుఁడగుటయు యివియన్నియు మహోన్నత యోగపదవియగు నిర్వికల్ప సమాధికి లక్షణములని తలంచెను.

ఆయోగి కాశీనాథునితో, "మహాయోగివరేణ్యులకు సైతము సులభముగా, లభ్యముగాని సుషుమ్నావస్థ నీకప్ర యత్నముగా లభ్యమయినది. కావున నీవీ యోగమహిమయం దున్నతస్థానమొంద 'షిర్డీ'యందున 'అవులియా సాయి బాబా' (Avalia Sai Baba)ను గాంచు"మని బ్రతిమాలెను. ఆ'అవు లియా సాయి' యను పదముల విని, ఒక మహమ్మదీయ వ్యక్తి నామమని తలంచి, "బ్రాహ్మణుఁడనగు నేనెట్లు ఒక మహమ్మదీయుని పాదము లాశ్రయింతును ?" అని తలంచెను. ఆయోగి, 'సాయిబాబా సామాన్యమానవుఁడు కాఁడు. కులము రంగు నాతఁడు పాటింపఁడు' అని బోధించెను. కాని పండి తునకవి రుచింపక తన రోగనివారణమును జేయు నెవరేని హిందూయోగి నాశ్రయింపఁ దలంచుచుండెను.

కాశీనాథుఁ డొకదినమున రాహురి పట్టణవీథుల సంచ రించుచున్నతఱి, ఆతనికొఱకై వెదకుచున్న వృద్ధుఁడొకఁడీతనిని గాంచి, "ఓయీ! ఇది శ్వాసావస్థ! నీవు భరింపఁగలిగినంత యుష్ణోదకములఁ ద్రావుము. అప్పుడు నీకు సౌఖ్యమొనఁ గూడును." అని నాశ్రుచ్చి వెడలిపోయెను.

ఆమాటల నతఁడు లెక్కింపక 'మోరెగాం' (More-goan) (గ్రామము) లోని 'పాతక్' (Phatak) అను హిందూ యోగినిఁ గాంచ బయలుదేరెను. మార్గమధ్యమున జెజూరి (Jejure) కడ నాతని కాకస్మికముగ వైరాగ్యోదయమయి, "ఇకముందీయారోగ్యమున కెంతమాత్రము బ్రయత్నింపను." అని నిశ్చయించుకొని, యచ్చోట నొక నాగదాళిపొదను గాంచి, యుపవిష్టుఁడై యేడుదినము లఖండ సమాధ్యవస్థ యందు మైమఱచెను. ఆనాగదాళి ఫలములుదిని క్షుద్బాధను వారించుకొనెను. ఎనిమిదవ దినమునఁ బిపాసాపీడితుఁడై చేరువనున్న నొకప్రవాహమందలి నిర్మలశీతలోదకములఁ గ్రోలఁ జనుదెంచెను. రాహురియందా వృద్ధుడు సెప్పిన (156 మైళ్ల దూరమున) పలుకులు స్మృతిపథమునకు వచ్చినవి. ఆశ్చర్యకరముగ నావృద్ధుఁ డాక్షణముననే యాతని వెనుక నిలువఁబడి కృద్ధకంఠమున నిటులఁబలికెను. "శీతలోదకములఁ గ్రోలకుము. వేడినీరమునే త్రాగుమని నేను నీతోడఁ జెప్పలేదా? చేరువనున్న జనపదమునకరిగి వేడినీరముఁ గ్రోలుము." ఇటులాడి యాముసలి యదృశ్యుఁడయ్యెను. * అంతటతఁడా వృద్ధాంగుని వాక్యముల కొడంబడి వేడినీరములఁ గ్రోలెను. ఉష్ణోదకపానమునఁ గలిగినలాభ మాదినమునుండియే కానవచ్చెను. అంతనుండి కంటినిండ కూరికగలిగినది కాశీనాథునకు. ఉచ్ఛ్వాసనిశ్వాసములు సక్రమముగజరుగసాగెను. అంతనుండి యాతఁడు వేడినీరమునే త్రాగసాగెను. ఇరువది దినములలో 'జిజూరి' వద్ద నాతనికారోగ్యము గలిగినందున స్వగృహాభిముఖుఁ

* చింతోపత్ - బెల్‌సారి గృహమున.

డయ్యెడివాఁడే! కాని ఆరోగ్యము సంపూర్ణముగాఁ గలుగలే దనితలంచి 'పాతక్'ను దర్శింప 'మోఁరెగాం'కేగి యచ్చటతఁడు గానగానంమున బొంబాయియందలి 'ఖేడ్‌గాంభేట్' (Khed-gaonbhet) న గల మహారాజ్వల దత్తాత్రేయ భక్తవర్యుఁ డగు 'నారాయణమహారాజు'ను దర్శింపఁ బయనమయ్యెను.

'నారాయణ మహారాజు'ను కాశీనాథుఁడు దర్శించి, వారివలనఁ బొందిన యాతిథ్యగౌరవముల కత్యాశ్చర్య మొం దెను 'మహారాజు' పండితునకుఁ దాంబూలమొసంగి, "లోప లను, వెలుపలను పండితివనియు, యికముందు మన మిరువు రము మాటలాడ నావశ్యకములేదు" అని పలికెను. మరు దినము మరల పండితుఁడు మహారాజుకడకేగి, "నీ వేమియు రానవసరములేదు నీ పని పూర్తిఅయినది–" అను మహారాజు వాక్యముల విని, యాశ్చర్యమగ్నుఁడయ్యెను. పండితుఁడు, 'నన్నేల మహారాజు పనిపూర్తి అయినది. రానవసరములేదని నుడివెను. ఏమిపని పూర్తిఅయినది?' అని మనమున నాశ్చర్య పడుచు మహారాజును వీడ్కొని వెడలిపోయెను. ఒకవేళ పని పూర్తి అయినదనుట కర్థము – ఆరోగ్యము లభించుట గావ చ్చును. కాని లోపల, వెలుపల పండుటేమిటి? వెలుపల పండుట – తాంబూలచర్వణమున నరుణాకృతిఁ దాల్చిన అధర ములా? లోపలపండుట–నోటియందలి నాలుకరంగా? పండుట రూపాలంకారమా? ఉదాహరింపఁబడిన సంగతియా?

తుదకు పండితుని యోగివరాన్వేషణము ముగిసినది. తన ఆరోగ్యభాగ్యమును దొలంగించిన గ్రహములకుఁ ఉరిగి

వెళ్ళ నుద్దేశించి సోదరునకు తన దేహారోగ్య ప్రయాణముల గురించి కమ్మ నొకదానిని వ్రాసెను. నిజగృహమునకుఁ బోవు మార్గమున 'కులకర్ణి' యోగిని దర్శించెను. ఆ మహానీయుఁడు మార్గమధ్యమున 'షిర్డి' యందు సాయిబాబాను గాంచుమని నొక్కి చెప్పెను. ఆతఁడు చెప్పినచొప్పున పండిత కాశీనాథుఁడు **1911** వ సంవత్సరమున జూన్ **27** వ తేదీన షిర్డీకి చనెను. ఒకటి రెండుదినముల పిదప సెలవుగొనుటకై సాయిబాబాను దర్శించెను. కాని వారచ్చటనే యుండవలసినదని చెప్పిరి. పండితుఁడింటివద్ద కష్టములవలన తానుండుటకు వీలుకలుగ నందునఁ జనుట కనుమతి గోర మరల నెనిమిది దినములలోఁ దిరిగివచ్చు షరతున సెలవొసంగెను. కాని కాశీనాథుఁడు తన యార్థిక దుస్థితులవలన యటుల నెరవేర్చ లేనని వాక్రుచ్చెను. పండితుఁడచ్చటనే యుండవలయును. షిర్డీని వీడవలదని సాయిబాబా పట్టుబట్టెను. ఎటుచనుటకు వీలులేని చిక్కు వలనఁ బండితునకుఁ దన స్థితి బాధాకరమయ్యెను. ఇట్టి విషయము పండితునకుఁ గష్టముగా నున్నదని గ్రహించి, సాయిబాబా, 'ఏదియో కలవరపడుచున్నావు నీవు. పోవలసియున్నఁ బొమ్ము. నా చేతనైనది నే చేసికొనియెదను' అని పలికెను. సెలవొసంగిరని కాశీనాథుడు షిర్డీని విడచి పయనమయ్యెను. నిజగృహమునకుఁ జనుట గాన త్వరగా జనవలసినందులకు, నేరుగా 'ధులియా' కేగవలయును. కాని ఏదియో యస్వస్థ కారణమున నొక స్థలమునుండి మరియొకస్థలమునకు నెమ్మదిగా నడచుచు షిర్డీనుండి **14** మైళ్ళలోపలమాత్రమే ప్రయాణము చేయఁగలిగెను. **8** వ దినమున నతఁడు షిర్డీకి **11** మైళ్ళ దూర

మున నున్న కోపర్‌గాం (Kopergoan)లో నొక బ్రహ్మచారితోడ విడసినవాఁడయ్యెను. ఆ బ్రహ్మచారి ఆతనిని షిర్డీకి సాయిబాబాకడకు మరల నొకసారి జనుటకై యనేకవిధముల బోధించి ప్రయత్నించెను. షిర్డీకేగుచున్న యాత్రికులను కొందరినిఁగాంచి బ్రహ్మచారి 'యీతనిని మీతోడ షిర్డీకిఁ గొనిపొండని' చెప్పెను. వారితోఁ గలిసి పండితుఁడు షిర్డీకి వెళ్లెను. సాయిబాబా పాదారవిందములఁ బ్రణమిల్లెను.

సాయిబాబా:- ఓ వచ్చితివా ? నీవు! ఎప్పుడు వెళ్లితివిచ్చటనుండి ?

పండిత కాశీనాథుఁడు:- గురువారము.

సాయి:- ఎన్నిగంట లప్పుడు ?

పం:- మూఁడు గంటలప్పుడు.

సాయి:- ఈ రోజేవారము ?

పం:- గురువారము.

సాయి:- ఇప్పు డెన్నిగంట లయినవి ?

పం:- మూఁడుగంటలు.

సాయి:- నీవిచ్చటనుండి వెడలి ఎన్నిదినము లయినది.

పం:- ఒకవారము. ఈరోజు ఎనిమిదవది.

సాయి:- నీవు వెళ్లునప్పు డెనిమిది రోజులలోఁ దిరిగి రాలేనని చెప్పితివే.

పం:- ఇది యంతయు నెటులఁ జరిగినదో నేను చెప్పఁజాలను. ఇదియంతయు నీపని,



శ్రీ సద్గురు సాయిబాబా

( మహర్షి శ్రీ ఉపాసనీబాబా గురుపాదాలు )

సాయి:- ఓయీ! ఈ ఎనిమిది దినములనుండి నేను నీవెనుకనే యున్నాను. సరె. ఇప్పుడు వెళ్లి ఆ యింటియందుండుము. (అనగా శ్రీసాయిబాబా దర్శనార్థమయివచ్చు వారలు మామూలుగా వసించు కాకాసాహెబు వాడ.)

అట్టి మహావిచిత్ర శక్తిసంపన్నునిర్మాల తానేమియుఁ జేయఁజాలని శక్తిహీనుఁడనని తెలిసికొని కాశీనాథుఁడు సాయిబాబా యనుజ్ఞ శిరసావహించెను. స్వగృహాభిముఖ కాలమున "పోదలంచినఁ బొమ్ము. నాచేతనయినది నే గావించెద" నని పలికిన (శ్రీ) సాయి వాక్యము లతని కిప్పు డర్థమయ్యెను.

షిర్డీయందే వసించుచు కాశీనాథుడు శ్రీసాయిబాబా సేవలయందునను, హారతినిచ్చు పనియందునఁబాల్గొని శ్రీవారి దివ్యవిశేషములను, వారిని సేవించు శిష్యకోట్లవిషయములను అచ్చోటఁ జరుగు ప్రతివిషయమును జాగరూకతఁబూని కని పెట్టుచుండెను.



# అధ్యాయము ౮

## సాయిబాబా

185రీ వ సంవత్సరమున (శ్రీ) నిజాము రాజ్యమందలి 'పత్రి' (Pathri) గ్రామమున నొక బ్రాహ్మణ కుటుంబమున నొక పురుష శిశువు జనించెను, బాల్యముననే యాతఁడొక

'ఫకీరు'న కొప్పగింపఁబడెను. ఆ ఫకీరులతోడఁగూడి యీతఁడు గూడ నొక ఫకీరుగా మారిపోవుటయేగాక యెవరో యొక రీతని కనేక సద్గుణములఁ గఱపి, యాశ్చర్యకరమగు మహోన్నత శారీరక బలమునుగూడ వృద్ధిగావించిరి. పదునారేండ్ల ప్రాయమునం దొకనాఁడీ బాలకుఁడు రెండు నెలలక్రిందఁ బోయిన తన గుఱ్ఱమునకై వెదకుచున్న ధూప్ కెడ (Dhoopkeda) వాసియగు 'చాఁదాబాయ్‌పటేల్'ను గాంచి, తనకాతని కీవఱకేమాత్రము పరిచయము లేకపోయినను ఆతనిగుఱ్ఱ మెచ్చట నున్నదో గుఱితప్పకుండఁ జెప్పెను. సాయి జెప్పిన స్థలంబుననే తనగుఱ్ఱముఁగని 'పతేలు' ఫకీరువద్దకుఁ జనుదెంచి, యింకను, అనేక వింతలఁ గాంచఁగలిగెను. పొగగొట్టముఁ ద్రాగ 'ఫకీరు' నిప్పు, నీరుఁ దెప్పింపఁగోరి, 'హూప్' అని యొక కేకవేసి, 'మోసెస్'వలె (Moses) నేలపై యొక దెబ్బఁగొట్టి, యొకచో గావలసినంత నీరమును, మరియొక్కచోటఁ బట్టకారు – ఎఱ్ఱని నిప్పుకణికనొకని మేషమున నావిర్భవింపఁజేసెను. 'పతే'లిది కాంచి యాశ్చర్య సంభ్రమాయత్తచిత్తుఁడై, 'షిర్డీ'యం దొక నాటి వివాహసందర్భమున 'ఫకీరు'న కాతిథ్యమిచ్చెను (1872). అప్పటినుండి యీతఁడు 'షిర్డీ'యందే వసించుచు, యే ఋషి వర్యునైనఁ బిలువఁదగు సాయిబాబా యను నామధేయమునఁ బిలువఁబడుచుండెను.

సాయి మసీదునందే నివాస మేర్పరచుకొని ప్రతి దినమా జనపదవీథుల భిక్షాటన మొనరించుకొనుచుండెను. సాధారణముగా నతఁడు నిరాడంబరమై చినుగులువారిన 'కుప్నీని' (Cupni) కప్పుకొని సోమరివోలె నేదేని వేపచెట్టుక్రింద గాని

పాలకులందుగాని యుపవిష్టుఁడై యుండుటఁ గాంచఁగలము. ఒక్కొక్కప్పుడు తనలోఁ దానేదియో కోపమున మాటలాడు కొనును.—ఏ విషయమై? ఎందులకో? ఎవరు చెప్పఁగలరు? ఇట్లతఁడొక పిచ్చి ఫకీరుగా బాహ్యప్రపంచమునకుఁ గానవచ్చు చుండెను. ఆతని హృదయ నిర్మలత ముఖ్యముగా గ్రహింపఁ దగినది. రోగగ్రస్థులగు జనులకతఁడు స్వయముగా నౌషధ ములఁజేసి, వారలకుఁ దానే స్వయముగ నుపచరించువాఁడు. ఎవరయిన భగవద్భక్తులగు మహనీయు లాగ్రామమున నున్నచో వారలదర్శించి భగవద్విషయముల మాటలాడువాఁడు. ఎల్లప్పు డతఁడు 'హరి - హరి' యని భగవన్నామ స్మరణ సేయుచుం డును. ఇట్లు క్రమక్రమమున మహోన్నత దివ్యశక్తినిగడించి ఔషధములతోఁ గాక తన వీబూది (Udhi) తోడనే రోగము లను తదితరకష్టములను నివారించుచుండెను. ప్రథమమున జను లీ మహనీయుని వెఱ్ఱివానిగఁ దలంచి, మసీదుకడ వెలిగించు నాతని ప్రమిదెయందు ననుదినప్రకారము నూనె నొసంగరైరి. ఆ రాత్రిరా ప్రమిదెయం దాతఁడు నీరు మాత్రమేపోసి తెల్ల వారువఱ కానీటితోడనే వెలిగించెను. తదనంతర మొక వ్యవ సాయదారుఁడు, సబుయినస్పెక్ట రొక్కొక్కరు ముగ్గురు భార్యలఁ గలిగియు సంతాన హీనత్వమున ఖిన్నత్వమొంది యీ మహాత్ముని దర్శించి వారి దీవన వలన సంతాన ప్రాప్తి బొందిరి. ఇట్లతఁడు తన 'వీబూది' వలన సకల దుఃఖపటలముల భస్మీపటలముఁ జేయుటవలన, బొంబాయి రాజధానియం దతని కీర్తి దిశదిశాక్రాంతమయ్యెను. వేనకువేలు జనులరుదెంచి గుమిగూడి పాదముల వ్రాలి, హిందూ పూజావిధానమున

పెద్దగా హరినామకీర్తనాపరులయి సేవింపఁదొడంగిరి. హిందూ
మత భక్తులను మహమ్మదీయ మతస్థులుగగాని, మహమ్మ
దీయుల హిందువులుగగాని మార్పఁ బ్రయత్నింపక వారివారి
యిష్టపద్ధతుల నవలంబింప ననుజ్ఞయొసంగెను. తన మసీదు
నాతఁడు 'ద్వారకామాయి' (Dwarka Mayi) అని పిలుచు
వాఁడు. అచ్చోట నొక 'తులసిచెట్టు' నొకగద్దియపై నేర్పాటు
జేసి హిందూభక్తుల వలన దానికడ శ్రీభాగవతాది గ్రంథపఠ
నము సల్పుచుండును. హిందువులు తదితరులెల్లఁ బాల్గొన
వచ్చును. ఎవరో యొక తెలుఁగుశాస్త్రి యచ్చటి కరుగుదెంచి,
తనపసిబిడ్డయొకతె రోగగ్రస్తురాలయి, క్షీరపానమునకు సైతము
చేతఁగానిస్థితియందున్నదనియు, ఈ క్లిష్టస్థితిఁబాపిన నిన్నుఁ బర
మేశ్వరావతారముగా నెంచెదననిపలికెను. వెంటనే యైదు
నిముసములలో శిశువు పాలుఁద్రాగినది. మరుదినమునుండి
యాశిశువు సారోగ్యమున దినదినప్రవర్ధమానయయ్యెను. ఆ
శాస్త్రి యాశ్చర్యమగ్నుఁడై 'సాయిబాబా! సాక్షాత్తు దత్తా
త్రేయావతార' మని నిరాఘాటకంఠమున వాక్రుచ్చెను. కొంద
రాతనిని విఠోబాదేవుఁడనిరి. (పండరినాథుఁడు) కొందరు గణ
పతియనిరి. కృష్ణుఁడనియు, రాముఁడనియు, లక్ష్మీనారా
యణుఁడనియు, వారివారి యిష్టదైవభావమునఁ దలంచిరి.
శ్రీవారియందఖండ విశ్వాససంభరితులైరి. మహమ్మదీయులు
కూడ వారికడకుఁజని యెట్టి విచిత్రములైనఁజేయఁజాలు మహ
నీయుఁడని గౌరవించుచుందురు. సర్వమతభక్తులు 'సాయి
బాబా ఎచ్చటేది జరుగుచున్నను, భూతభవిష్యద్వర్తమాన
విషయములఁ జెప్పఁగలఁడనియు, ఆతఁడు సర్వాంతర్యామి

యనియు, ఎయ్యదిపూనిన నద్దాని నిర్వర్తింపఁగలఁడనియు, వారాడినపలుకు తప్పదనియు, ఎవ్వరికిఁగానుపింపక యదృశ్యులగు శక్తిఁగలవారనియు' హృదయపూర్వకముగ వాకొనుచుండును. తన జీవితపర్యంతము తన్నుదర్శింపవచ్చిన వారల నుండి దక్షిణలఁగ్రహించుచుండును. కాని యిది ధనార్జనమునకుఁగాదు. ఇదియొక పవిత్రాశయమునకై వసూలుచేయఁబడుచున్నది. క్రిందటి 10 వత్సరములలో సగటున దినమునకు రు 300-0-0 లు దక్షిణలుగా వారికిముట్టెడివి. ఆధనమునందు ¾ వంతు ఫకీరులకును, మిగిలినది తనకచ్చట బాల్యదశయందు సహాయ మొనరించిన 'తాట్యాపటేల్ (Tatyapatel) అనునాతనికి నొసంగుచుండును. ఒక్కొక్కప్పుడాధనమును తన్నుదర్శింపవచ్చిన పాంథుల-అన్నపానీయాదివసతుల కర్పించుచుండును. అయినను ప్రతిప్రాతస్సాయంతనముల కతఁడొక దమ్మిడీలేని 'ఫకీర్' కావలసినదే! అతనికంత ధనము వచ్చుచున్నను, ప్రతిదినము గ్రామవీధులయందొనరించిన భిక్షాటనాన్నమే భోజనము! ఆతఁడొకమహోన్నత శక్తిసంపన్నుఁడయినను, పలుకుబడి, ధనము గడింపఁగల వాఁడయినను, ధైర్యము-స్వాతంత్ర్యముఁగలుగువాఁడేగాని, గర్వసంభూతుఁడు కాఁడు. ఒకపర్యాయము ఖ్యాతుఁడయిన 'రివిన్యూకమీషనరు' (Revenue Commissioner) 'జిల్లాకలెక్టరు' తదితరోద్యోగస్థులీతని మాహాత్మ్యమెంతవఱకో కనుఁగొననరుదెంచిరి. వారిరాకకుఁ బొగడకచ్చటనే (మసీదువద్ద) నిలువఁబెట్టి భిక్షార్థము గ్రామవీధులకుఁ జనియెను. వారలాలస్యమున కోరువనందున, 'తదుపరి తనకుఁ దీరినప్పుడు రమ్మని' కాలము

నింకను పెంచెను. ఇంతియుగాని వారియాతురతకాతఁడేమియు 'నాశాభంగముగాని అయిష్టముగాని' గలించలేదు. అనేకులు శ్రీవారిని దర్శించినవారలు మహారాజశ్రీ జి. యస్. కఫర్దే గారును [(G. S. Khaparde) యిప్పుడు కౌన్సిలుస్టేటుకు మెంబరు] "శ్రీసాయిబాబా, భూమిపై నవతరించిన దేవుఁడని మానిశ్చితాభిప్రాయ" మని నిజముగా చెప్పినరు.



## అధ్యాయము ౯

### శిక్షణకాలము - షిర్డీయందు

ప్రథమమున సాయిబాబా పండితునకు భగవదారాధనా మార్గ మేమియుఁ జెప్పక "వెళ్లి ఆయింటియందుండుము" అని మాత్రము వాక్రుచ్చెను. శ్రీవారి యుద్దేశ్యము లతినిగూఢములు. ఆతఁ డేమిసేయునో, వానివలన నేమిజరుగునో, భక్తులకు సూచనగా మాత్రము తెలియఁజేయును. ఆపరమేశ్వరాంశసంభూతుని, యుద్దేశ్యముల విషయమైగాని, వారి యంశములఁగాని ప్రశ్నించుట కెవ్వరు సాధారణముగ సాహసింపరు. అచ్చటఁగల భక్తులతోఁ గాశీనాథుఁ డావాడయందే నివాసమేర్పరుచుకొని, వారియనుభవములను, శ్రీసాయిబాబా పద్ధతులను, వారిమహాద్భుతశక్తులను, మహోన్నతధర్మగుణమును,పవిత్రప్రవర్తనల నతిశ్రద్ధతో నవలోకించుచుండెను. శ్రీ సాయిబాబా శిష్యులెల్లఁ దమగురుదేవుని భగవంతునిఁగా

భావించి, మారుమాటలాడక, న్యాయసమేతములును,తమకు లాభకరములైన వారియాజ్ఞల నతివినయవిధేయతలతో ననువర్తులై ప్రవర్తించుటాతఁడు కనుఁగొనియెను. ఐతేఁ జావిచిత్రశక్తియందు లీనమయి నాటివలె యాశక్తియందు చరింపనసమర్థుఁడయ్యెను. కాని యొక శిశువునకు క్రొత్తదగు గుఱ్ఱపు పిల్ల సులభముగా మచ్చికయగునా ? కష్టపరంపరయనెడు పాఠశాలయందు నలుబదివత్సరములు పరిశ్రమమొనరించెను. కాని శిశుకుఁడగు శ్రీసాయియను మృగివశీకగుణునిప్రేమాలల ఆతఁడొక యాటవికాశ్వ శాబకమే! శ్రీ సాయిబాబాయొక్క మహోన్నతదైవబలము, దయాగుణము లాతనిని పరిశుద్ధునిఁ జేసి ఆతని అంధకారావృతహృదయమందిరమున పరంజ్యోతిని వెలిగించి, అధఃపతితుఁడైయున్న నాతనిని లేవనెత్తి, ఎన్నటికిఁ జలింపని మహోన్నతాత్మబలసంయుతునిఁ జేయ సమకట్టినవి.

''ఓమూఢుఁడా! భగవంతునిఁ బరిశోధింప నహంకారపడకుము'' అని పెద్దలాడుదురు. అందువలననే, మహాభాగవతోత్తములగువారలు తమ గురుదేవుఁ డతీతప్రభావుఁడని వాక్రుచ్చెదరు. ఎవరైననొక మహనీయుని, జీవితచారిత్రమును పరిశీలింపఁ బ్రయత్నించుట, సహస్రకిరణప్రకాశమానుఁడగు సూర్యభగవానుని చిన్నదీపికచే శోధింపనెంచుట యగును. అనగా శ్రీ సాయిబాబా ఋషీంద్రుని చింతనలను వారియుద్దేశ్యములను, నియమముల నారయనెంచుట గూడ యట్లే యగును. ప్రథమమువ గురుదేవుని యందత్యంతానురాగము, భక్తిఁ గలుగఁజేసి, "సర్వభారనిర్వహణమునకు సర్వసంశయనివారణమునకు గురుదేవుఁడే'' యని తలచునట్లు చేయుట

శ్రీసాయిబాబా శిష్యులకుఁ గావించు ప్రథమసోపానారోహణము. నూతనశిష్యుల కప్పుడప్పుడు తన యద్భుతవిచిత్రములను దయాస్వభావమునుచూపించి వారల నీప్రపంచవ్యామోహమునుండియు, కష్టపరంపరలనుండియు, విముక్తులఁజేసి, 'తల్లియందు శిశువునకువలె' తనయందు (గురు) అఖండప్రేమ విశ్వాసములఁ గల్పించుకొనుచుండును. (భగవంతునియం దుండవలసిన స్వతస్సిద్ధమయిన విశ్వాససిద్ధాంత మెట్టిదన) పసిబిడ్డ తల్లియందుంచు సహజమయిన విశ్వాసమువలె, ఎవరు భగవానునియందు నమ్మకముఁ జూపరో వారలు, భగవత్సామ్రాజ్యమున కనర్హులు.

ఒకసారి సాయి క్రిందివిధమున తనభక్తుల సమ్ముఖమున మాటలాడెను. ఈకథ వారివచోధోరణిని దెలుపుగాన నిందుఁబొందుపరుపఁబడినది. "నేనొకనాటి దినమున, మార్గమం దొక గర్భిణియగు స్త్రీని గాంచితిని. * ఆమెగర్భము లావుగానున్నయది. కరచరణములు కృశీభూతములై యున్నవి. ఒంటరిగానున్నది. బాధచే మూలుగుచున్నయది. ఆయమ సులభముగా నడువఁజాలక నొకకఱ్ఱనూతగొని యున్నది." అటులున్న యామెనుగాంచి నవ్వి నేనిటులఁబలికితిని. "నిన్ను నేనెఱుంగుదునని తలంచెదను. నేను నీకు గుర్తుంటినా? చాలసంవత్సరములనుండి నీవీగర్భమును మోయుచున్నావు. ఇంకను ప్రసవింపవైతివి?" ఆమె జవాబు చెప్పలేదు. మరల నేను, "సరియే; జరిగినదేదియో జరిగినది. ఉష్ణోదకముల మాత్రము గ్రోలుము. నీ వనాయాసముగాఁ బ్రసవింపఁగలవు." కాని నామాట నామె

* కాశీనాథునికీయవస్థ సంభవించిన నాటనుండి అతనికిఁ బొజ్జపెరిగినది.

సరకుఁగొనక, నీరుఁద్రాగ నొకప్రవాహముకడ కేగెను. పాపము! వృథాగా, నామెమరణించును. ఆమెతోఁబాటు గర్భాంతరమందలి, శిశుగణము సైతము జీవములఁబాసెదరు. అనితలంచి నేనచ్చటకరిగి, "అమ్మా! చలినీరుఁ ద్రాగవలదని నేను చెప్పలేదా? యీప్రవాహముకడ కేలవచ్చితివి? చేరువ జనపదములకరిగి, వేడినీరముఁగ్రోలుము." అనిమందలించి నేనామెను మనగ్రామమునకు దెచ్చితిని. ఆదినమునుండి యామె యుష్ణోదకములఁ ద్రాగనారంభించినది. ఇప్పుడామె చక్కఁగానున్నయది. ఇదేమియులేక. శ్వాసకోశావస్థ! (Wind - Vatha) ప్రేగులు ముడుతపడుటచే యిది సంభవించుచున్నది. ఈవిధముగా, సాయి బలికి పండితునివైపు వికాస నేత్రములతోఁ జూచెను. పండితుఁడుతప్ప సాయి వాక్యములయందర్థమెవ్వరు గ్రహింపలేరు. "ఓహో! శ్రీసాయీబాబా! ఆదినమున ముదుసలివోలె, రాహురికడ నాకుఁగానఁబడి, 'వేడినీరముఁ గ్రోలు'మని నాకుఁజెప్పినదీ సాయిబాబాయే! మరియు రాహురికి 156 మైళ్లదూరముననున్న ప్రవాహముగడఁ బ్రత్యక్షమయి, 'శీతలోదకములఁ ద్రాగవలదనిన దీమహానీయుఁడే!' అనేకమంది, డాక్టరులు, వైద్యులు యోగులు సైతము వారింపలేని, నా యనారోగ్యమును బాగుచేసిన, మహాత్మను యోగిసత్తముఁడీ 'సాయిబాబా'యే!" యని యనుకొని, యఖండకృతజ్ఞతాసాగరము హృదయమున నుప్పొంగ, "తనపై శ్రీసాయిబాబా కంతటి యవ్యాజప్రేమాతిశయము ఏలఁగలిగెను?" అని యాశ్చర్యమగ్నుఁడయ్యెను. ఈ సంశయమున కతఁ డడుగకపూర్వమే, బాబా యిటుల నొకపర్యాయము నుడివెను, "మనయిరువురకు

ఋణానుబంధము కలదు. అనేకవేల యుగములనుండి, మన యుభయుల కుటుంబముల యన్యోన్యబాంధవ్య మవిచ్ఛిన్నమై వచ్చుచున్నయది. కావున నీకు నాకు భేదమేమాత్రములేదు." ఇట్లాడిన శ్రీసాయి వాక్యముల నాకర్ణించి కాశీనాథుఁడు, తమ బాంధవ్య బంధములఁ దలంచి గాఢముగా చలించెను. అతని యనిర్వాచ్యసంతోషము బాష్పరూపముల నేత్రముల నుండి వెలువడెను. ఒకసారి సాయిబాబా తన పూర్వబాంధవ్యము నీవిధముగా సూచించెను.

"ఒకచోట నొక 'నూయి' (జలాశయము) గలదు. దానియొడ్డున నొక వృక్షముగలదు. ఆవృక్షశాఖపై రెండు పక్షులు కూరుచుండెను. ఆకస్మికముగా ఆపక్షులలో నొక్కటి నీటిలోనఁ జారిపడి మునుగనుండెను. దానిని రక్షింప వెంటనే క్రిందికిదుమికినది దానిప్రియస్నేహితుఁడయిన రెండవపక్షి మొదటిది రక్షింపఁబడినది. రెండవది తన ప్రాణములఁ గోలు పోయినది.'' కాశీనాథునియందు తనకుఁగల జాగరూకత కాదర్శమయిన యీ కథావిధానమునుగూర్చి నింక నేమియు నాతఁడు విశదీకరింపలేదు. పూర్వజన్మలో శ్రీసాయి (లేక ఆతనిచేరువ నున్న వారిలో నొకఁడు) యాకస్మికముగ బావిలోనికి జారి పడి మునుగుటకు సిద్ధముగానుండెను. అప్పుడాతనిని రక్షింప వెంటనే దుమికి తన ప్రాణములఁగూడఁ గోలుపోయిన యతఁడు కాశీనాథుఁడు లేక ఆతనిపూర్వీకులలో నొకఁడు ఒకప్పుడొకరెవరికైన సహాయమొనరించిన ఆసహాయ మెప్పటికైన నక్కరకు వచ్చునుగాన 'భూర్గాన్' గుహాంతరముననూ, సోమనాథాలయముననూ కాశీనాథుఁడు రక్షింపఁబడు టిందులకే కాబోలు.

ఈ విధముగా గురువు ఒకచేత తనను తన శిష్యుని 'పీపాలకినుపకట్లవలె' పట్టుకొనియుండగా దీనికి విరుద్ధముగా నున్నది శిష్యునిచర్య. ఆ 'షిర్డి' యందలి 'అన్నవిక్రయగృహాముస' భోజనము కాశీనాథుని కనుకూలము గాకుండుటే గాక, యింకను కొన్ని యిబ్బందులు కలిగినవి. పండితుడగు శ్రీ సాయిబాబాగారికిఁ గలిగిన యవ్యాజ వాత్సల్యమునకును పండితుఁడు వారలతోఁ గలిసి మెలసియుండక ఏకాంతవాసి యగుట వలన నంతకు పూర్వము నుండియున్న శిష్యులకేవ కలిగినది. తన యాధ్యాత్మిక బలమును క్రమమార్గమున వృద్ధిఁగావింప కాశీనాథుఁడు తన సంసార వ్యవహార బంధములఁ ద్రెంప నెంచెను. అనగా ఏకాంత వాసమునను, మితభాషణమునను, యీ ప్రాపంచకేచ్ఛలఁ ద్రెంపనెంచెను. గ్రామమునకుఁ గొలది దూరములోనున్న ఏకాంతప్రదేశమున 'ఖండోబా' దేవాలయమున (Khandoba) తన కాలము నాతఁడు గడుపసాగెను. అచ్చట నతఁడు సాయిబాబా విషయములఁ దెలిసికొన వచ్చిన వారలతోడను వారి ముఖ్య శిష్యులతోడ మాత్రము మితముగా నేదియో కొలదికాలము మాటలాడును. ఈ యేకాంత నివాసము మొదలగు విషయము లాగ్రామమందలి జనుల కనుమానముఁ గలిగించినందున వారలు మామ్లేట్దారును (Mamlatdar) రక్షకభటుల నాతని కడకుఁ బంపిరి. వారాతని 'నొక తిరుగుబాటుదారుఁడో లేక మహమ్మదీయ శాస్త్రజ్ఞ వేషముననున్న సి. ఐ. డి. ఉద్యోగస్థుఁడో యని' పొరపాటు పడి నీయుదంతము నంతయుఁ జెప్పుమని ఆతనిని బాధించిరి. ఈ యుపద్రవములవల్ల నతఁడు గృహమునకేగి, ఎట్టి బాధలు లేక

హాయిగా ఏకాంతారాధనముఁ జేసికొనఁగోరెను. అందువలననే నతఁడు తన మిత్రుఁడయిన మాధవరావు దేశపాండ్యా యను వానిని (రాజీనామా యిచ్చిన బడిపంతులు శ్రీ సాయిబాబా భక్తుఁడు.) తాను గృహమున కేగుటకు గురువుకడ నుండి యనుజ్ఞఁ దెమ్మని యడిగెను. కాని గురువు సెలవొసంగఁ డయ్యెను. అదియు గాక బాబా 'ఆ పోలీసులు–ఉద్యోగస్థులు తన విషయమై జోక్యముఁ గలిగించుకొనుచున్నప్పుడు లెక్క గొనక ధిక్కరించుమని కాశీనాథునకు ధైర్యముఁ జెప్పెను.' ఎందుకనగా నాతఁడు గురుదేవుని సహాయముఁ గల్గియుండ నాతని శివమండలి యొక రోమమైనను స్పృశింప వారలకు శక్తి లేదు. ఈ ధైర్యవాక్యము లాతని కొంత కష్టమును మాత్రము బాపెను. కాని యింకను ఆతఁడు సంసారిక జీవనమున సౌఖ్యముల కొఱకత్యాశఁజెంది తాను వెడలుటకు గురువు నింకను తొందరఁబెట్టసాగెను.

అప్పటికిని సాయిబాబా, పండితునకు వెడలుట కనుజ్ఞ నొసంగక "నీలెక్కలన్నియు సరిజేసిన పిదపఁ గాని వెడల గూడ"దని చెప్పెను. 'ఏమిలెక్కల'ని యాతఁ డడిగినందున 'తనవద్దకు వచ్చిన లెక్కలన్నియు సరిగావలె' నని బాబా యస్పష్టమయిన జవాబొసంగెను.

అనేక వారములయిన పిదప సాయి "అన్నిలెక్కలు సరిఅయినవి. రెండో నాలుగో బండ్లుమోయఁగల లెక్కలు తప్ప–" అని చెప్పి మరల కొన్నిదినములయిన పిదప శ్రావణ మాసమున అనగా జులై, అగస్టు **1911** న కాశీనాథుఁడు

షిర్డీయందు నాలుగువత్సరములవఱకు నిలువవలయు" నని నిర్ణయించెను.

ఈ నిర్ణయమునకు గృహత్యాగియై సంతోషరహితమయిన షిర్డీయందు నాలుగువత్సరములు గడుపవలయునను యీ భయంకర విషయమునకుఁ గాశీనాథుఁ డొక నిట్టూర్పు విడచెను. దుఃఖించెను. శ్రీ సాయిబాబా "ఈ నాలుగువత్సరములయిన పిదప 'ఖండోబా' దేవుని సంపూర్ణానుగ్రహమునకుఁ బాత్రుఁడ వయ్యెదవని" చెప్పి యాతని నోదార్చెను. "ఈ నాల్గు వత్సరముల పర్యంతము పండితు డిషిర్డీయందేమి చేయవలయు?" నని మాధవరా వడుగుటచే శ్రీసాయి *"విఠోబా దేవునాలయములో కూర్చుండుట మాత్రమే చాలును. ఏమియుఁ జేయనక్కరలేదు" అని వాక్రుచ్చి పండితునివైపు దిరిగి "ఎవరితో నీకేమియు నవసరములేదు. నీ భవిష్యజ్జీవితము మిక్కిలి బాగుగా నున్నయది. అట్టి గొప్పభవిష్యజ్జీవితమెవ్వరికి లేదు." అని యచ్చటనున్న వారల వైపు తిరిగి, "అటులనున్నది. ఈతని ఘనత! ప్రపంచమంతయు నొక్కసిబ్బిలోనను, రెండవసిబ్బిలో నీతఁడొక్కఁడుఁ దులతూగఁ"గలఁడు. హాయిగా భోజనమొనరించి, యూరకఁ గూర్చొనుటమాత్రమే

---

* శ్రీసాయి - ఖండోబా (శివావతారము) యును, విఠోబా (విష్ణవతారము) యును అభేదాభిప్రాయమున భగవన్నామములని చెప్పువాడు. వారికి సర్వదేవతలు ఒక్కదేవుఁడే. ప్రథమ వత్సరమునందు ఏకేశ్వరోపాసనా పరత్వమగు మహమ్మదీయ మతమందు బాగుగా తరిఫీదగుటచే వీరి కామహోన్నత గుణము అలవడినది.

యాతఁడు చేయవలసినపని. మిగిలినది నేను నిర్వర్తించు కొనియెదను.

చాలమంది, పూర్వము నుండియున్న భక్తులిచ్చట నుప విష్టులై యుండిరి. వారిదియంతయుఁ గాశీనాథుని మెప్పించు టకై చెప్పుచున్న మాటలని తలంచిరి. వారిలో ప్రభుకులుఁ డయిన బొంబే నివాసి యొకఁ డిటులఁ బ్రేలెను.

"మంచిది బాబా! మీ పాదముల నాశ్రయించుకొని చాలకాలము నుండి మే మున్నాము. మాకేమియుఁ జెప్ప వయితివి." ఎవరికిఁ దెలియని క్రొత్తగా వచ్చినవాఁ డితఁడు—కాని నీ వీతనికి నాల్గువత్సరములలో సంపూర్ణానుగ్రహ మొసంగెదనని వాగ్దాన మొనరించితివి. అదియుఁగాకఁ బ్రపంచ మంతటితో నితఁ డొక్కఁడే తులఁ దూఁగఁ గల సమర్థుఁడని వాక్రుచ్చితివి. మేమందర మిన్నినాళ్లు మీవద్ద వసించుట వృథాయేనా? మీ పూర్ణానుగ్రహమును, రాగిరేకు శాసన మున మీరాతనికి దాన మొసంగెదరా?

శ్రీసాయి యెవరికి భయపడఁడు. ఎవరిమాటల లెక్కఁ గొనువాఁడు కాఁడు! తీక్ష్ణ దృష్టితో నాతని వైపుఁదిరిగి, "నామాట లబద్ధములనియా నీతలంపు? అసత్యవంతు లుండు టకా - యీమసీదు? నేనేమి పలికితినో - పలికితిని. నాసర్వస్వ మాతని కొసంగితిని. రాగి రేకుశాసనపు దాన మొసంగుచుంటి నని, మాటలాడితివి. రాగి ఎందుకు? నేనాతనికి బంగరు రేకు శాసనపుదాన మొసంగితిని. ఇప్పుడేమి చెప్పెదవో చెప్పుము."

శ్రీసాయి పండితునివైపు దిరిగి యిట్లు లడిగెను:- "ఏది మంచిది? రాగిరేకా? బంగారపురేకా?" అంతఁ బండితుఁ డీప్రశ్నకు జవాబు చెప్పుటకు శక్తిహీనుఁడయి సుఖమున నిటులఁ బ్రత్యుత్తర మిచ్చెను. "అట్టి విషయములలో నాకు శక్తిలేదు." సాయిబాబా యిటులఁ జెప్పెను. "రాగి చిలుము పట్టును. బంగార మట్లు కాదు. ఎంత యుపయోగించినను అటులే యుండును." నీవు పరిశుభ్రమయిన బంగారముఁ బోలియున్నావు. నీ వెక్కడ నున్నను దేవుఁడవు. బంగారురేకు శాసనపు దానము నీచేతులయందుంచఁబడినదని నీవిప్పుడు గ్రహింపవలసినది. ఇక్కడనుండి మాటిమాటికి నీవు నాకడకు రానక్కరలేదు. ఎప్పుడో యొకపర్యాయము వచ్చుచుండుము. నాతో మాటలాడుటగూడ నక్కరలేదు. నేను నీతోఁగూడఁ బలుక నవసరములేదు. నాల్గువత్సరముల యనంతరము "ఖండోబా సంపూర్ణానుగ్రహమునకుఁ బాత్రుడ వయ్యెదవు. సర్వమును నీవే యెఱుంగఁగలవు. నీ కుటుంబము, నా కుటుంబము అనేక శతాబ్దములనుండి పరస్పర బాంధవ్య యుక్తములై కలిసిమెలిసి యున్నవి."

కాశీనాథుఁడు:- బాబా! నేను భరించుట కశక్తుడఁ నయి యున్నప్పు డీ బరువు లన్నియు నాపై నేల వైచెదవు? నా కవి యన్నియు నక్కరలేదు. నన్నింటికిఁ బోనిమ్ము. దయ యుంచి సెలవొసంగుము.

సాయి :- అటువంటి యాలోచనల నిప్పుడు తేకుము. నీ వెవరో నాకుఁ బాగుగాఁ దెలియును. నే నెవరినో నీవు తెలిసికొనఁగలవు. అనేక వత్సరములనుండియు, నేను నీ వెను

కనే యున్నాను. నీ వలన నేదిచేయఁబడినను మంచిగాని—చెడుగాని—అది నావలనఁ జరుగఁబడినదే. నీవు నన్ను గుర్తించుకొనలేదు. కాని నిన్ను నేను బాగుగా గుర్తించుకొని యుంటిని. అనేకవత్సరములనుండి నేను నిన్నుగురించి చింతించుచున్నాను. ఇప్పుడు నీ వెక్కడ నుంటివని—పోవుటకు వచ్చుటకు? నీవేపని చేయుట కశక్తుఁడవా? అయితే యూరకనే యుండుము. (అంతట సాయి యీ విషయమందు భారము నాది యని సూచించునట్లు, తన గుండెయుపై చేయిని కొట్టుకొనుచు) నేను స్వయముగా నిన్ను వెంబడించి నీ కొఱకు టిక్కెట్టు తెచ్చెదను. నీకు రైలులో ప్రత్యేకమైన 'సీటు' ఇచ్చెదను. మార్గమం దేయాటంకములు గాని, యాగుట గాని లేక, నీ గమ్యస్థానమును సక్రమముగాఁ జేరఁగలవు."

బొంబాయి ప్రభువు మరల నిటులఁ బలికెను. "ఇదేమి బాబా! యీ మానవునకు నీసర్వస్వ మొసంగితివి."

సాయిబాబా:— అవునవును. సర్వ మొసంగఁబడినది. ఆతఁడు చెడ్డవాడయినను, మంచివాఁడయినను, ఆతఁడు నా వాఁడు. ఆతనికి నాకు భేద మేమాత్రములేదు. ఆతని * భారమంతయు నాపైనఁ గలదు. ఇట్టి (శ్రీ) సాయి సత్యసంకల్పము వలన కాశీనాథుని స్థితి భద్రపరుపఁ బడినది. గృహస్థాశ్రమ

* ఒక సత్పురుషుఁడుగాని, సద్గురువుగాని యొక భక్తుని తన వానినిగా భద్రపఱచినట్లయితే, అప్పటినుండి, శిష్యుని విషయమై తీసికొన వలసిన భారమంతయు, సద్గురువు లేక సత్పురుషుని యందుపడును అను యర్థముఁ గలిగిన మహాప్రసిద్ధము అయిన "హారతిపద్య" పంక్తు లగును

మున మరల నాతఁడెప్పుడుఁ గాలిడలేదు. శ్రీ సాయిబాబా యొక్క వైహిక సుఖరాహిత్యమైన మహోన్నతాధ్యాత్మిక శక్తియను నుత్తరీయ మాతని భుజములపైఁ బడనుండెను. ఆతని పూర్వాధ్యాయమయిన యొక సామాన్య మానవ జీవితము ముగిసినది. అనేక వేల భక్తుల కిహాపర సుఖముల నొసంగి, వారి కోరికలఁ దీర్పఁగలిగిన పరమేశ్వరత్వ మొందుట కాతని జీవితమును నూతనాకృతిఁ దాల్చినది. సద్గురువులవారు కాశీనాథుని తన యనుగ్రహపాత్రునిఁ జేసి, సత్పురుషునిఁ (సద్గురు) జేసెదనని వాగ్దాన మొనరించి దీవించెను. ఈవాగ్దానము జరిగి తీరగలదు. కాని కొంతకాలము మాత్రము పట్టగలదు. తనుపరి వారాడిన విధమున జరిగితీరినది.

"నీవెక్కడ నున్నను నీవు భగవంతుఁడవు. నీవన్నియు తెలిసికొనెదవు." ఇవియే యద్భుత వాక్యములు. అద్వైత వేదాంతి. "కాశీనాథునకువలె 'సర్వమానవులయందును పరమేశ్వరుఁ డుండుట ప్రత్యక్షసిద్ధాంత మని' వాక్రుచ్చును." కాని శ్రీసాయివాక్యము లీయుద్దేశ్యమునకు సంబంధించక, నారాయణ మహారాజుయొక్క గూఢవాక్యములఁ దలపింపఁ జేయుచున్నవి. నారాయణమహారాజ్ వల్ల చెప్పఁబడిన 'లోపల రంగు వెలుపలరంగు' అనువ దీప్రసిద్ధ ప్రసిద్ధ ప్రకటన (శోక సమర్పణ) కాదా ? ఈ దేశమున జనులేదేని యుపయోగించని రాతివేరుకొని ( పెద్దప్రవాహములోనఁ గొట్టుకొనివచ్చి యొడ్డునఁ జేరిన సుందరమయిన శిల) శుభ్రపరచి సంపూర్ణముగా నెత్తిరంగుఁబూసి కొన్ని నియమితకార్యములయిన పిదప

(యంత్రములు మంత్రములచే) విగ్రహముగా నిలుపుకొని, అనేకవేలజనులు దేవునిగా భావించి, ఆరాధించి, దానివలన ననేకములయిన వరములఁ బొందుచుందురట మన పాఠకు లెఱింగి యుందురు. అటులనే శ్రీసాయి కాలప్రవాహమునఁ గడుగఁబడి, దుర్భరక్లేశములను తరంగములచే వెలుపలకుఁ గొట్టఁబడిన కాశీనాథుఁడను రాతి నేరుకొని పైసమర్పణమున బాహ్యాభాగమున దేవత్వమను పూతఁబూసి నాల్గువత్సరము లలో సంపూర్ణముగా నంతర్గత శుద్ధత్వమునకుఁ గడంగెను. ఇట్టి కార్యసమాప్తమునకు నాల్గు సంవత్సరములు పట్టును. శ్రీసాయి, నారాయణమహారాజు లిరువురు భంగముగాక సంపూర్ణత్వ మొందఁగల యాతని మహాత్తమ భవిష్య త్తును గూర్చి యీమాటల నుపయోగించిరి.

ఇంకొక మార్గమున నారాయణమహారాజు పలికిన యట్లు శ్రీసాయి పలికిన వాక్యములు యథార్థములగునా — విరుద్ధకార్యములచే భంగముగాక ? చదువరీ! ప్రథమాధ్యాయ మందలి మొదటి పరిచ్ఛేదమును గుర్తుంచుకొని ముందు జరుగ నున్న కథాక్రమమును గ్రహింతువుగాక ! మరియు నీవీ కథయందలి ముందు సమాచారమును తెలిసికొనుటకును శ్రీసాయిబాబా కాశీనాథునొక నారాధన పదార్థముగా నెట్లు ఎప్పటినుండి గావించునో యనియు ఆ యారాధనా పదార్థముగా నేయుటకు నేయే యంతర్గత మార్పులు జరుగఁ బడినవనియు, ఆ యారాధనమున నేమిలాభములు గలిగినవని నీవు తెలిసికొన, నువ్విళ్లూరుచుందువని నేను దలంచెదను.

శ్రీసాయి యిట్లు గాశీనాథునిగూర్చి, ప్రకటన సలిపి నందున, మననిటనుండి, పండితుండు - డాక్టరు అనుపదముల వదలి, అతని నూతన శిష్యత్వసూచకముగాన 'మహారాజు' అని పేర్కొనెదము.



# అధ్యాయము ౧౦

## సాయిబాబాగారివలనం, బట్టుదలచేం గాశీనాథుండు గొప్పవాండగుట

శ్రావణమాసమునం (జులై - ఆగష్టు **1911**) అతని మహోన్నత దశనుగుఱించి శ్రీసాయి చెప్పినప్పటికిని, కొంత కాలము వఱకు మహారాజు జీవితరీతిలో నేమియుం గ్రొత్త మార్పు కానంబడలేదు. సాధ్యమైనంత వఱకు కాతండు జనసంమర్దము లందునం దిరుగక, ఏకాంతనివాసమును గడుపసాగెను. అయినప్పటికిని, గ్రామములోనికి భోజనమునకు, (త్రానింటి నుండి తెచ్చిన ధనముం జెల్లించు తినుగృహమునకు) నుః అప్పుడప్పుడు 'హారతీ' సమయముల యందునను, జనవరి **1912**, **27-3-1912** వఱకు మతవిషయక సమావేశమునకుం జనుచుండవలసెను. ఈ సమావేశము మ.రా.రా.శ్రీ 'కఫర్డీ' గారు, ప్రతిదిన మారుగురుభక్తులకు 'పరమామృతము, పంచదశుల' కర్థము చెప్పుచుందురు. మహారా జనుదినము, తన కాలమును స్నానమునందును, నిత్యకర్మయందునను గడుపువాండు— అనగా మామూలుగాం బ్రతిదిన మొనరించు ప్రార్థన, జపము,

భగవద్గీతా విష్ణుసహస్ర నామ పారాయణము అప్పుడప్పు డతఁడు రామగీత - అష్టావక్రగీత - అధ్యాత్మరామాయణముల జరుపుచుండును. **1912** జనవరి మాసాంతమున మహారాజునకు భార్యావియోగము తప్ప, ఆతని బాహ్య పరిస్థితుల యందు వేరుమార్పులు గలుగలేదు. పాప మాతని కిది యొక యశనిపాతము! తన కనేక విధముల సంసార సౌఖ్యము లొనగూర్చి మహాసౌఖ్యాంబుధి నోలలాడించిన యీ మూడవ భార్యయం దాతని కెక్కువ మక్కువ. నిజముగా శ్రీ సాయి షిర్డీ యందాతఁడు నాల్గు వత్సరము లుండవలయునని విధించగనే, తన భార్యను తెచ్చుకొనవలయునని యాతఁడు ప్రయత్నించెను. కాని యాతఁ డీ విషయము నెత్తగనే, 'వానియంతనవియే సులభముగా వీడిపోవుచున్న సంసార శృంఖముల' మరలఁ దగిలించుకొనఁ బ్రయత్నించు నూతన శిష్యుని ప్రయత్నములకుఁ దన యయిష్టతను తెలిపి ఆ యుద్దేశ్యము నాపివైచెను. ఆమె మరణించుటకుఁ బూర్వ మొకవారము క్రిందనామె యస్వస్థతను గురించి, 'షిర్డీ' కొక లేఖవచ్చెను. అంతఁ గాశీనాథుఁ డాతురతతో, తన గురువు కడ కేగి, 'ధులియా' కేగ సెలవొసంగఁ బ్రార్థించెను. కాని గురువర్యుఁ డీయుద్యమమును గూడ మాన్పివైచెను.' **6-2-1912** వ తేదీన, తన భార్య మరణవార్త విని పాపము కాశీనాథుఁడు దందహ్యామాన మానసుఁడై, 'తన భార్య చనిపోయిన పిదప' నెప్పుడో నాల్గు వత్సరములకు ఆదేవుని (ఖాండోబా) కృపావృష్టి తనపై వర్షించుటవలన, తన కంతగా నుపయోగము లేదని తలంచి, తాను వెడలుట కనుజ్ఞనొసంగ గురుసన్నిధి కరిగెను. శ్రీసాయి

బాబా ఆమె ఆత్మ తనవద్దకు వచ్చుటచే, మహోన్నత స్థానమాక్రమించినదని, మహారాజు నోదార్చెను. ఈ దుఃఖభారమున గ్రుంగుచున్న కాశీనాథుఁ డిది లక్ష్యముసేయక, గురువుకడ కేగి, తనకడ నున్న పదిరూప్యము లొసంగి, 'ఆమెకు సద్గతి నొసంగుట కుపయోగింపు' మని ప్రార్థించెను. కాని గురువా రొక్కమును, తిరుగ నిచ్చివేసి, 'తన పూర్ణానుగ్రహ మామెపై నిదివఱకే ప్రసరింపఁ బడినదనియు, శిష్యున కవసరములేనిది తీసికొనఁబడినదనియు, శిష్యునకేది యవసరమో యది యొసంగ బడినదని' చెప్పి యాతని నోదార్చెను. శ్రీ సాయిబాబా మరల నాతనితో, "నాకు నీయందు సంపూర్ణమైన బాధ్యత కలదు. 'విఠోబాలయమున' కేగి ప్రశాంతముగఁ గూరుచోనుము. ఇదివఱకు నేను చెప్పినట్లు ప్రవర్తింపుము. మఱియు, తదుపరి శ్యాముఁడు మాధవరావు నిన్నుఁ బయటికి లాగును. నేను నిన్ను వెలుపలఁ గూరుచుండఁ జేసెదను. *ఏవిషయమై చింతింపకుము." అని పలికెను.

మరల తన వక్షస్థలమునఁ జేయినిపెట్టుకొని, శ్రీసాయి మహనీయుఁ డిటులవాక్రుచ్చెను. "ప్రపంచమంతయు నొక్క సిబ్బిలోనను రెండవదానిలో నీవు అది నీమహత్వము."

ఇదివఱకు చెప్పినట్లు బలిష్ఠములైన సంసారశృంఖలములు విడిపోవుట తప్ప బాహ్యముగా కాశీనాథ మహారాజు

* దేవతావిగ్రహములు విశేషముగా, బహిరంగ ప్రదేశమునందే, యుంచఁబడు చుండును. ఎందుకన నందువలన భగవంతునకును, తనకును గల సంబంధము జ్ఞాపకముఁ దెచ్చికొనుటకును, ఆ విగ్రహములద్వారా భగవంతునిఁ బూజించుటకును—

రొక్క పరిస్థితులలో విశేషమార్పులు కానవచ్చుటలేను. గొప్పమానసిక శాస్త్రవేత్తలు సైతము వర్ణింపఁ జాలని పద్ధతిన, (పైచెప్పిన క్రమతః జరుగుచున్న పవిత్రచర్యలుగాక) అంతరంగికముగా గొప్పమార్పులు జరుగుచున్నవి.



## అధ్యాయము ౧౧

## శ్రీ సాయిబాబా కార్యక్రమము

**1911** వ సంవత్సరమున ఆగష్టు మాసమందునను, **1912** వ సంవత్సరమున ఫిబ్రవరి మాసమందునను, మహారాజునకుఁ దన పూర్ణానుగ్రహ మొసంగినానని 'శ్రీసాయి' వాక్రుచ్చెను. ఏమిటా యగోచరమయిన రక్మ ప్రదానము? దాని వలనఁ గలుగు నిగూఢ ఫలమునకు బాహ్యసమాచారము లేమియు లేవా?

ఏకాంత నివాసమునకు, గీతాపారాయణ మునకును, యోగాభ్యాస మునకలవాటయిన మహారాజునకు "ప్రశాంతముగఁ గూరుచుండుము. (ఉగె-ముగె) ఎవరితోడ నేమియుఁ బనిలేదు." అను తనగురుదేవుల విచిత్రాజ్ఞా ఫలితమును తెలిసికొనుట కష్టముకాదు. ఆ యాజ్ఞకర్థము సోమరిగా కూరుచుండి గుఱ్ఱులుపెట్టి నిదురింపుమని కాదు, అది గభీరార్థ గర్భితమయిన నిశ్చేష్టతతో చరించుటకును, అనవసరములయిన యీబాహ్య విషయములను, * చింతనలను త్రోసిపైచి త్వరితకాలమున

* భగవద్గీత 12 వ అధ్యాయమున 13 మొదలు 20 శ్లోకముల నవలోకింపుము.

ఆధ్యాత్మిక తత్వపరిశ్రమను ప్రారంభించుట కాతని కొసంగఁ బడిన యాదేశము. సత్యాన్వేషణముఁ గలుగఁజేయుటకు ఆ యాదేశమునందు దశేంద్రియములను, వానిని నడుపు పదు నొకండవ ఇంద్రియమగు మనస్సును, నిగ్రహించుటయు, నిమిడి యున్నది. ఇటుల నిగ్రహించు పెట్టిన శమ (మనోనిగ్రహము) దమా(శారీరకనిగ్రహము) దుల ద్వారమునను, తితిక్ష (క్షమ) వలనను, ఉపరతి (మనస్సును ఆత్మచింతలకు మరల్చుట) తోడను పూర్తియగును. వీని ననుసరించిన పిదప సహజ ముగా, ధారణ, ధ్యాన, సమాధి నిష్ఠలు కలుగును. వీని నన్నిటిని కాశీనాథుఁడు చాలకాలము సాధన చేయుటయు, ఆ సాధన సంపత్తులన్నియు సంపూర్ణముగా యుత్తీర్ణత్వ మొందుటయుఁ గాననగును. 1924 జూన్‌లో 'జేజూరిలో' నాగ తాళి పాదవద్ద జరిగిన సంఘటనమే నిదర్శనము. సాయిబాబా గారి వద్ద కరుగుదెంచు వఱకుఁ గాశీనాథుని సమాధి నిష్ఠ పరి పూర్ణత్వదశకు రాలేదు. నిశ్చంచలానంద దశయందు పరిపూ ర్ణత్వ మొందలేదు. ఆ సమాధిదశ ప్రాపంచిక చింతనలను, బాధ్యతలను, తాత్కాలికముగా మాత్రము పోద్రోలఁ గలి గెను. కాని దానివలన మహదానందము కానుపించలేదు. శ్రీ సాయిబాబా శిక్షణలో కాశీనాథుని సమాధిచేష్ఠ క్రమ ముగా మార్పుఁజెందుచున్నది. కాని ముందుగనే మనమట్లూ హించఁ దగదు. కాశీనాథుఁడు పరిపక్వదశఁ జెందకపూర్వము ఆతని మనస్సులో అత్యావేదన మహదాందోళనలు కలిగెను. వీనిని ముందు తెలుపవలయును,

(ఉగె-ముగె) ప్రశాంతముగా కూరుచుండుట నిశ్చంచల స్వభావమును కలుగఁజేసినది. తన పూర్వచింతన లన్నియు వదలివైచి మహారాజు నిశ్చలాత్ముఁడయి ప్రశాంతముగఁ గూరుచుండవలయును. ఎందుకన? ఆతని చిత్తఫలకమున గురువు నూతన పాఠముల వ్రాయుటకు —! సద్గురుసేవచే సంపూర్ణ లాభములఁ బొందఁదలఁచు సతఁడు ప్రథమమున 'తాను గొప్ప తెలిసినవాఁడనని' యహంభావమును వదలుటే గాక, ఇదివఱకు నేర్చిన నిరుపయోగవిషయముల సైతము వదలవలయును. గురువునందలి సంపూర్ణ విశ్వాసము పూర్వ మనుకొనిన గొప్పవిషయముల తృణప్రాయ మొనరించును. గురువుచే పలుకఁబడిన ప్రతిచిన్న యాదేశముగాని, యుదాహరణము గాని యతినమ్రభావమున శిరసా వహింపఁజేసి ఆమార్గముననే యత్యాశక్తితో నడుపఁ జేయును. అప్పుడు శిష్యుఁడు తదితర కార్యలోలుఁడు గాక తన కాలమును, శక్తిని, దృష్టిని నిదురించుచున్నను, నడచుచున్నను గురుమూర్తియందే కేంద్రీకరింపఁ జేయును. అప్పుఁడాతని ప్రేమను శక్తిని వృద్ధిజేయుచు, ఆగురుదేవుని యాకార మాతని హృదయపత్రమున ముద్రితమగును. * ఇట్టి స్థితిలో మహారాజుండగా ఆగురువు పూర్వపుఁ జెత్తచెదారము నతిజాగరూకతఁ

---

* మచ్చింతా మద్గతప్రాణా, బోధయంతః పరస్పరం । కథయంతశ్చ మాం నిత్యం, తుష్యంతి చ రమంతి చ॥ తేషాం సంతత యుక్తానాం, భజతాం ప్రీతి పూర్వకం । దదామి బుద్ధియోగం తం, యేన మా ముపయాంతి తే॥ తేషా మేవానుకంపార్థ, మహ మజ్ఞానజం తమః । నాశయామ్యాత్మ భావస్థో, జ్ఞానదీపేన భాస్వతా॥ భగవద్గీత 10 అ. 9 మొ॥ 11 శ్లో॥ వరకు,

బూని దహీకృత మొనరించి, భూమిని సాంవంత మొనరించి, యప్పుడప్పుడు తెలిసికొనఁ జాలని యమూల్యములగు వి_త్తన ములనాట మొదలిడెను. అట్టి వి_త్తనములు నాటుటకు కొన్ని దృష్టాంతరము లిప్పుడు ప్రారంభింతము.

ప్రతి భగవద్గీతా పాఠకుని తెలుంగునను, ప్రతిమతస్థుని వలెను మహారాజునకు 'భగవంతుఁడు సర్వాంతర్యామి. అతఁడు సర్వజీవులయందును సర్వవస్తువుల యందును, నిబిడీకృతుఁడై యుండునని' తెలియును. తదితర యుపన్యాసకులవలె ఆతఁడు గూడ 'అమరావతి' యందీవిషయములఁ గూర్చి యుపన్యాసము లొసంగెను. కాని భగవదానుగ్రహపాత్రులు మామూలుగా 'భగవంతుఁడు ప్రతిజీవియందున్నాఁ'డని అందఱూహించి పలుకు వాక్యములకును యనుభవపూర్వకముగా సత్యము నన్వేషించి వారిపలుకులకును భేదమెఱుంగుదురు. మహారాజుయొక్క నూతన శిష్యత్వ ప్రారంభముననే శ్రీసాయి ప్రత్యక్షముగ సిద్ధాంతీకరించి షిర్డీయందు మహారాజు చి_త్తమునకును, తదితర ముఖ్యభక్తుల చి_త్తములకును, గురువునకును, భగవంతునకు భేదమేమాత్రము లేదని నమ్మకముఁగలుగఁజేసెను.

మహారాజు తనపాదము లాశ్రయించుటకుఁ బూర్వము పొగఁగొట్టముఁ ద్రాగుటయం దత్యంతాశక్తిగల ఆతని గురు వొక దినమున మహారాజునుగూడ ఆతఁడు వలదన్నను *త్రాగఁజేసి యిట్టు లనియెను.

---

* మహారాజు సనాతనుడగు బ్రాహ్మణుఁడౌటచే యాతఁడు పొగ ద్రాగ నిచ్చగించక, అప్పుడప్పుడు పొగద్రాగు ఇతరబ్రాహ్మణుల సైతము నిరసించువాఁడు—

సాయి:– నీవు వసించుచున్న దేవాలయములోని కెవరైనను, వచ్చెదరా?

మహా:– సాధారణముగా ఎవ్వరు రారు.

సాయి:– ఎప్పుడును నట్లనకుము. నేను వచ్చుచునే యుండెదను. నేనక్కడకు వచ్చిన, నన్ను గుర్తించుకొని, త్రాగుటకు 'ఛలిం' ఇచ్చెదవా?

మహా:– (ఆ 'ఛలిం' పదమును శబ్దార్థప్రకార మర్థము చేసికొని) బాబా! నాతో నీవేమి చెప్పుచుంటివో గ్రహింపఁజాలకయున్నాను. ఎప్పుడు తేవలెను 'ఛలిం' నీకొఱకు?

సాయి:– మంచిది. మంచిది.

రెండుమూడు మాసములయిన పిదప బహుశః అక్టోబరు 1911 న మహారాజు స్వయముగా, అన్నమువండుకొనుటకుఁ బ్రారంభించెను. తా మన్న మారగించుటకు ముందు, ఆపదార్థమునుగాని, దానిలో కొంత భాగమునుగాని, దేవాలయమందలి గాని, విశ్వమందలి గాని, గురునివాసమునఁ గాని పరమేశ్వరునకు నైవేద్య మొసగి భుజించుట భక్తులకు విధిగాన తాను భుజించుటకు మున్ను, కొంత పదార్థమును మశీదున శ్రీసాయికి నైవేద్య మొసగఁ గొని పోవుచుండెను. ఆతఁడు వంటఁజేయు చున్నప్పటినుండి మిక్కిలి యాసతో ఆతనిని చూచుచు కాచుకొని యుండిన యొక నల్లని కుక్క, నైవేద్యమునకై యేగుచున్నప్పు డాతఁ డేగు మార్గమున వెంబడించెను. గురువునకు నైవేద్య మిడి మరలఁ దిగిగివచ్చు నప్పు డాహారము నిడవచ్చునని యాతఁ డాకుక్క కేమియు బెట్టక, జనుచుండెను,

కాని కొంతదూర మేగగనే, అకస్మాత్తుగా, యాతని చిత్తము మాఱి, కుక్కకై వెనుకకుఁ దిరిగెను. కాని యాశునకము కానఁబడలేదు. తదనంతర మాతఁడు నైవేద్య మిడ గురువు కడ కేగెను.

సాయి:- ఈ నడియెండలో యిక్కడికి యాహారముఁ గొనివచ్చి ఎందుకు కష్టపడెదవు? నే నక్కడనే గూరుచుండి యుంటిని. (అనగా దేవాలయ ప్రాంతమున)

మహా:-(ఆశ్చర్యమున) అక్క డెక్కడున్నావు బాబా!

సాయి:- నీవంట యగుపఱకు నేను నిన్ను చూచుచు కూరుచుంటిని.

మహా:- బాబా, ఒక నల్లని కుక్క దక్క అక్కడింకెవ్వరు లేరు.

సాయి:- అవునవును. ఆ కుక్కను నేనే.

మహారాజు తన గురువర్యుని గుర్తించుకొన నందులకు కంట నీరుపెట్టుకొనెను. గురువర్యుఁ డాడిన "గుర్తించుకొనుట ఖిలిం" అను పదములు స్మృతిపదమునకుఁ దెచ్చుకొని, మరల నింకెప్పు డటుల పొరపాటు బడకుండు నటుల నిశ్చయించుకొనెను.

రెండవ దినమున, నా నల్లకుక్క వచ్చునేమో యని ఆతురతతో కనిపెట్టెను. అది ఎక్కడను కానబడనందున, దన మనమున వెనుకటి పొరబాటు బడలేదని తలంచెను. ఆతఁడు వంటఁజేయుచున్న సమయమున, ఒక దరిద్ర శూద్ర భిక్షుకుఁ డా గుడిగోడ కానుకొని చూచుచుండెను. సనాతనుఁడైన

మహారాజీయయుక్తత కేవగించుకొని వెంటనే వెళ్ళిపొమ్మని చెప్పెను.

ఈ రెండవ దినమున ఆహారముగొని పోబడు నప్పటికి గురు వాగ్రహాయత్త చిత్తుఁడై యుండెను.

సాయి:- ఎందుకు వచ్చితి విచ్చటికి? ఇక్కడకు రావల దని నేను చెప్పలేదా? నిన్న భోజనము పెట్టనేలేదు. ఈ రోజుగూడ నన్నక్కడ నిలువనీయక తరిమి వైచితివి. ఇక్కడి నుండి నాకు నీవు నైవేద్యము తేనక్కరలేదు.

మహా:- బాబా! ఎక్కడున్నావు నీవు?

సాయి:- ఆగోడ కానుకొని అక్కడనే నిలువఁబడి యున్నాను నేను. నీవక్కడ నన్ను నిలువవలదని పలికితివి.

మహా:- ఓహో! (దీర్ఘ నిశ్వాసము నిగిడ్చి) ఆనిలువఁ బడినది నీవా?

సాయి:- అవును. సర్వవస్తువులు నేనే. ఈ బ్రహ్మాండమంతయు నేనే. * నీవెక్కడ చూచెదవో నేనక్కడనే యున్నాను.

మహారాజు దుఃఖమునకును, పశ్చాత్తాపమునకును మేర లేదు. అప్పటినుండి యీవిషయ మాతని హృదయమం దగాధముగా సొచ్చినది. "శ్రీసాయి భగవంతుఁడు. నిజముగా అతఁడు ప్రతివస్తువునం దున్నాఁడు." అని ఆతఁడప్పటినుండి గురుతుంచుకొని తన దినచర్యయం దెన్నడు మఱచిపోవలేదు.

---

* 'సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాఙ్గులం' అనగా ఆతఁడీభూమినంతయు నిండి యున్నాఁడు. ఆతఁడు దీనిని మించి యున్నాఁడు. — పురుష సూక్తము.

భగవంతుని (గురువు) విషయమై ఆతఁ డాలోచించుటకు ప్రారంభించి నప్పుడెల్ల అతని బాహ్యప్రవర్తనలో నొక గొప్ప మార్పు కలిగినది. మరియు నాతఁడు తన గురుదేవునిగూర్చి యిటుల దలంచువాఁడు.

"ప్రాణవాయువులకన్న అతఁడు సమీపమున నున్నాఁడు.
ఈ కరచరణాదులకన్న సమీపమున నున్నాఁడు."

Closer is he than breathing
Nearer than hands or feet."



## అధ్యాయము ౧౩

### 'షిర్డీ' వస్త్రమందలి దారములు

శ్రీసాయి ఏమయినను వాగ్దత్త మొనరించినయెడల నదినెరవేర్చుట కతిబాధల నుపయోగింపడు. తన యసాధారణ ప్రజ్ఞ (Ritambhara prajna) చే (అనగా యెట్టి ప్రదేశముల యందైనను, ఎట్టి సందర్భముల యందైనను, ఏమి జరిగెనో? ఏమి జరుగుచున్నదో? ఏమి జరుగనున్నదో? మొదలగు భూత భవిష్య ద్వర్తమాన విషయములఁ దెలిసికొను శక్తి) యేవ్యక్తి హృదయమునైనఁ దెలిసికొని, ఆతఁ డెటులవృద్ధి యగునో? అట్లగుట కాతని కొనరింపవలసిన తదనంతర కార్యక్రమ మెట్టిదో? ఆమహానీయుఁడు గ్రహించును. తన నూతన శిష్యుని చిత్తమున నాతఁడు పై చెప్పిన తెఱంగున నుపదే

శము లోసంగుటచేతను నూతన విద్యలఁ గఱపుటవలనను, అభ్యాసములచేతనేగాక, ఆతని (శ్రీసాయి) ప్రవర్తనయందు బ్రజ్వరిల్లు యగణ్యములగు సద్గుణముల నైతము గఱపుట వలన, వివేకమను దారమునుఁ బేనెను. మఱియొకసారి దీని విషయమై మరల చెప్పవలయును. కాని ముందు యీ 'షిర్డీ' వస్త్రమందలి 'వైరాగ్యమను' మరియొక దారమును విడదీసి దానివిషయము గ్రహింతము.

తన బాల్యమునుండియు మహారాజు ప్రకృతిసిద్ధము గనో, లేక తానుపొందిన శోకక్లిష్ట పరంపరాభిఘాతములచేతనో తదితర బాలురు, వృద్ధులు తమజీవితములకు ముఖ్యాధారము లని యెంచు విషయములకు దూరముగా నుండుటేతని కలవా టయ్యెను. ఈప్రపంచ వ్యామోహమునకు దూరముగనుం డుటే 'వైరాగ్య' మనబడును.

సర్వమతముల కీ వైరాగ్యము ప్రధానమైనదేగాక, సర్వమోక్షసాధనలకు, పరిపక్వదశకు, సిద్ధి కియ్యది చివర మెట్టు. ఈ వైరాగ్యమురొయొక్క ప్రధాన పర్యవసాన ఫలిత ములు 'విజయబలము, శారీరకబలము, మనోబలము, స్వాతం త్ర్యత, ధైర్యము మొదలగునవి కలుగుటయే సర్వాధ్యాత్మిక సాధనలకు ప్రధానాశయమయిన బ్రహ్మచర్య' వ్రతము ఈ వైరాగ్యమునకు సంబంధించిన రూపమే.

మహారాజీశక్తిని, యీతపోబలమును, యీయింద్రియ నిగ్రహశక్తిని, స్వయముగాను. గురుశిక్షలోను తన జీవిత పర్యంతము వృద్ధిసేయ సాగెను. ఆతఁడు తన గురుదర్శనము

నకుఁ బూర్వము దీనివిషయమై నేర్చుకొనవలసిన విషయము లెన్నియో గలవు. అతని గురువర్యుఁడీపరిశ్రమయం దాతనిని సక్రమపథమున నడిపింపఁ గలిగెను. ఆ గొప్ప పై యధికారిచే విధింపఁబడిన కొన్ని క్లిష్ట కార్యములు ముందు తెలుప బడుచున్నవి.

(మహాభారతమందలి శాంతిపర్వమునఁ జెప్పినట్లుగా) నిరాహారదీక్ష యన్ని తపోదీక్షలయం దగ్రస్థానము వహించినది. భోజన మాచరింప మనస్సునఁ గొట్టుకొనుచు దానిని పొందుమార్గమును గానక, నిరశన వ్రతము బలవంతమున జేయుటంత యుత్తమముగాదు. అయినను అట్లు బలవంతముగ నిరశనవ్రతముఁ బూనినను, భయము విడిపోవును. ధైర్య మొనగూడును. (అనగా యనేకమాసములు దీర్ఘ సమాధియందుంచును.) ఇతరుల కీవిషయమందు ధైర్యము గూడ జెప్ప శక్తి యొనఁ గూడును. క్రమమున యిది నిజమైన వైరాగ్యమునకు ముఖ్య సోపానమగును. ఈ యుపవాసదీక్ష బలవంతముగనో, లేక యాధ్యాత్మిక ముగనో, భోజనము దొరకకయో, లేక తదితర కారణాంతరములచేతనో, మొదలు పెట్టి నప్పటికిని, క్రమముగా ముందుముం దాధ్యాత్మిక పదమునకు ముఖ్యసాధక మగును. గురురక్షణచే అనేకములగు యీవిధములైన దండయాత్రలు మహారాజునకు గమ్యస్థానమునకుఁజేర సహాయ మొనరించినవి.

తన బాల్యముననే మహారాజు సంసారమునకు మోయలేని బరువై సంపాదనారహితుఁడై, యింటికడఁ గూరుచుండుట మిగుల హీనముగాఁ దలంచెను. ఆహారమునకై కష్టించు

చున్న తదితరులకు 'షిర్డీ' యందలి యీతని పరిస్థితి మొదటి నుండియు అసహ్యాకరముగాఁ దోఁచెను. కొన్నిమాసముల వఱకాతఁడు షిర్డీయందలి అన్నవిక్రయ గృహమున డబ్బిచ్చి భుజించెను. ఒకానొక దివసమున గురువాతనిని దక్షిణ యడుగుటచే, మహారాజేమాత్రము సంకోచింపక, ఆ యాపరిచిత గ్రామమున దమ్మిడీ సైతములేని జీవితము నెట్లుఁగడుపవలయుననను భయమావంతయుఁ జెందక తన వద్దనున్న యావత్తు సొత్తును పైసతోసహా – గురూత్తమున కొసంగెను. *"ఈ భయంకరమయిన ప్రపంచ వ్యామోహమునుండి హృదయమును మరల్చి, తన యనుగ్రహ పాత్రునిఁ జేయఁ దలచినచో ఆతని కీ ప్రాపంచిక సౌఖ్యములను, పదవులను, యనురక్తిని తొలగించెదనని భగవానుఁడు వాక్రుచ్చియున్నవాఁడు." మహారాజు సర్వధనమును త్యజించినవాఁడయి, శుష్కించి, దానివలన మలబద్ధము, రక్తస్రావము గల్గుచున్న మూలవ్యాధికి లోనయ్యెను. మహారాజీ యాహార ప్రాముఖ్యతకు విసుగుఁజెంది ప్రతిదినము భిక్షాటనార్జితమగు కొలదిధాన్యముపై జీవింప ప్రయత్నించెను. కాని యర్చకుఁడయిన మేఘుఁడు (Megha) మరియు దాదాకెన్‌కార్ కాకా యను వారలవలన భోజన విక్రయశాలయందుచితముగా నీతఁడు భుజింప సమ్మతింపఁ బడెను. కొన్ని మాసములకు బిదప, ఆతనియందు గురువునకుఁ గలుగుచున్న మహానురాగమునకు (లేక యితరకారణముననో) దాదాకెల్‌కార్ ఆతని యుచితభోజనమునకు సమ్మతింపలేదు. ఒకానొకదినమున

* cf. Thomas A. Kempis, BK. 14, ch. 53 (1) (5) & (6)

1912 జూన్ మాసాంతమున మహారాజు విస్తరిముందునం గూరుచున్నతఱి 'రేపటినుండి యీ యుచిత భోజన మొసంగం బడ' దని సూచింపంబడెను. భోజనము గావించుచున్న యంత మంది యొకట గల్గిన దుస్సహావమానము 'మహారాజును' తొందరబెట్టినది. ఆ దినమునుండియు అయిష్టపూర్వకముగ వా రొసంగిన ఆభోజనమును రుచిచూచు నాశనికి వాంఛలేదు. అంత టతండు మహాగ్రహావేశమున తా నిదివఱకు భుజించు చున్న భిక్షాన్నమును వీడజేసినందులకు ఆతనిని నిందించి ఖండోబా దేవాలయమున కేగెను. ఈపొట్ట కూటికేగదా యొకరి దయాధర్మమునకై నీచముగా ప్రవర్తించునది? ఒకరికి లొంగజేయునది? ఒకని యాధారము నాశింపంజేయునది? అంచులకై యతండు ఆహారవిసర్జన మొనరించి (అప్రయత్నముగ లభించినను) స్వాతంత్ర్యము నొందందలంచెను. ఈయాగ్రహ మాతనియందు మహోన్నతమయిన మార్పుం గలిగించినది. ఈవిషయమును తలంచిన వెంటనే, 'మహోజ్వల తపోధనుం డయిన నొక బ్రాహ్మణునిచే నోడిపోవుటచే నొనర్పంబడిన క్షత్రియుండయిన విశ్వామిత్రుని ఘోరనిరశనవ్రత, తపోదీక్షలు' స్మృతిపథమునకు వచ్చును. ఆవారమంతయు మహారాజు తన మిత్రులవలనను భక్తులవలనను నొసంగంబడిన ఘనపదార్థ ములంగాని ద్రవపదార్థములంగాని స్పృసింపక నిరశించి పశువు లకుం బక్షులకుం గుక్కలకు వైచి మరల పూర్వస్థితికివచ్చెను. కాని ఎట్లయిననేమి తన గురూత్తముని యాజ్ఞచే యప్పు డప్పుడు స్వల్పాహారముల గొని, యుపవాసముల మాత్ర మెక్కువగం జేయసాగెను.

**1912** జులై మాసమునఁ జరిగిన పనివలన ఆతని యోర్పు, వైరాగ్యశక్తులు వృద్ధియగుటయేగాక యుత్తరోత్తర లాభప్రదమగు దైవబలముగూడ వృద్ధిగా సాగెను. తదనంతర మాతఁ డరుదుగా మనోదృశ్యములఁ గాంచెడివాఁడు. కాని వెంటనే స్వప్నావస్థలో మగ్నుఁడయ్యెడివాఁడు. ఆతఁడు సంపూర్ణముగా తానేది చేయుచున్నది, 'తానెక్కడ నున్నది? తన బాహ్యవృత్త విశేషము లేమిటియో మరచిపోయెను.' వానిని తా నారయు నప్పుడు ఆ వస్తువులన్నియు తారుమారుగాఁ గనుపించెడివి.— అనగా దూరపు వస్తువులు దగ్గరగను దగ్గర వస్తువులు దూరముగను గానబడసాగెను. మ్రింగిన ముద్దాతనికి నోటియందే యున్నటులఁ బొడకట్టెను. ఆహార మాతనికి విసర్జిత పదార్థముగాఁ దోచినది. సూక్ష్మపదార్థములు ఘనాకృతులఁ దాల్చినవి. రక్షకుఁడే లేకపోయిన యీ విషయము లాతనికి ముప్పు తెచ్చెడివే? కాని శ్రీ సాయిబాబా రక్షణ క్రింద నుండి ఆతఁడు తన * భ్రమిష్టావస్థను ఉన్మత్తావస్థను, దాటిన వాడయ్యెను.

ఇట్టి పరిస్థితులలో మహారాజు నీతిపూరితములును, ఆధ్యాత్మికసంబంధములగు అనేక మనోదృశ్యముల (Visions) గాంచెడివాఁడు. ఆ సందర్భముననో, తదితర సమయముల యందో మహారాజీవిషయముల తదితరులకు జెప్పెఁడువాఁడు.

---

* అనగా యీ యవస్థలయం దున్నవారు బాహ్య ప్రపంచమునకు చూచుటకుఁ వెఱ్ఱివారివలె గానుపించెదరు, కాని యిది పిచ్చి గాదు. ఈ యవస్థవలన యనుభవములను, దివ్యశక్తులను, ఆలోచనలను, ధర్మ నియమములను, మనోబలమును గడింతురు,

వారిని స్తుతించు వారలీ మహనీయుని విచిత్ర నిరాహార దీక్షను గాంచి, శ్రీ సాయిబాబా మహాత్మ్య ప్రదర్శనములలో నిది యొక నిదర్శనమని తలంచెడివారు. శ్రీ గురుదేవుని యను గ్రహబలమును సూచించు ననేకాత్యద్భుత విషయముల నిట్టి యస్వాభావిక పరిస్థితులలో సైతము ప్రదర్శించువాడు. దీనికి తార్కాణముగా, సంక్రాంతి 1913 జనవరి నుండి యొక వత్స రమువఱ కుపవాస దీక్షాధారియై, దానివలన కృశించి, అస్థి పంజరాకృతిఁ దాల్చెను. [అయినను అతఁడొక దినమున నొక యంత్రాగారమున, రోడ్డు (Road) పనికైయున్న పెద్ద రోలింగు రాతిని లాగెను.] డాక్టరు చిదంబరంగారు పరీక్షిం చినప్పుడతని నాడి నిమేషమునకు 40 పర్యాయములు కొట్టు కొనుచుండెను. మూడు నెలల పిదప మిక్కిలి క్షీణించి నిమే షమునకు 20 పర్యాయములు కొట్టుకొనసాగెను. కాని ప్రతి దిన మేదియో కష్టపుబనిని చేయుచుండువాఁడు. (సహాయా ర్థము) ఇట్టి మహత్వమంతయు తన గురుదేవుని యందలి భక్తి విశ్వాసముల కల్లనే గడించెను. ఆ షిర్డీ యందలి తదితరభక్తులు మహరాజు దైవబలముతో, 'కష్టపరంపరల దప్పించుకొని శ్రీ గురుదేవుని సంపూర్ణానుగ్రహ పాత్రుఁడు' కాబోవుచున్నా డని' తలంపసాగిరి.



# అధ్యాయము ౧౩

## పట్టాభిషేకము

**1913** వ సం॥ నకుఁ బూర్వమే అనగా **29-7-1912** న శ్రీసాయిబాబా 'మహారాజు'ను బాహ్యమునను, ఆంతరంగికముగను పరిశుద్ధుని గావించి, బహిరంగప్రదేశమున నుపవిష్టునిఁ జేసెను. శ్రీసాయి ఏవిధముగా నారాధింపఁ బనుచుండునో, ఆవిధముగా మహారాజును (ఆతనికిష్టమున్నను లేకపోయినను) పూజసేయుటకు గురుపూర్ణిమా దినమున, శారీరక మానసిక బలములఁ గలిగిన తన భక్తురాలయిన 'చంద్రబాయి' అను నామెను ఖండోబాలయమునకు శ్రీసాయిబాబా పంపెను. ఆ ధైర్యహృదయ యగు నాస్త్రీ, ఖండోబాలయముఁ బ్రవేశించెను. ఆస్థలము మురికిచే యసహ్యకరమై దుర్గంధకరముగా నుండెను. ఎందుకన ప్రతినిత్యము స్నానముసేయక తన స్వశరీరపు మురికినే పోగొట్టుకొనఁ బ్రయత్నింపని మహారాజు, జనుల నిచ్చట బాగుజేయుటకై వచ్చుట కాటంక పఱచెను. అందువలన ఆదేవాలయము ప్రతిదినము శుభ్రముసేయ బడకుండెను. మురికియుండినను, లేకపోయినను, దుర్గంధమయినను సుగంధమయినను, తన పనినిమిత్తము చంద్రబాయి లోబడవలసి వచ్చెను. ఆమె తనపూజా ద్రవ్యములతో మహారాజునకు ముందు గూరుచుండి ప్రతినిత్యము శ్రీసాయి పాదముల కొనరించు తెఱంగున, యాతని పాదములొత్త నారంభించినది. మహారాజాశ్చర్యపడి ఖండితముగా నిటులఁబలికెను— 'దయయుంచి నాపాదము లంటకుము. వెళ్లిపొమ్ము.' కాని చంద్ర

బాయి ఆతనిపలుకుల లెక్కింపక, తన సేవాకార్యమును సేయ సాగినది. ఇంతలో నిరువురు పెద్దమనుష్యు లచ్చటికి వచ్చుట తటస్థించుటచే చంద్రబాయి ధైర్యముఁ దెచ్చికొని 'సాయి బాబా యాజ్ఞానుసార మరుగుదెంచితి'నని వాక్రుచ్చెను.

మహా:- ఏమిటి వారియాజ్ఞ?

చంద్రా:- ఆజ్ఞా? నీకు పూజసేయుమని నాకాజ్ఞ యిడి నారు. అందుకనియే యీ వస్తువులన్నియు నేను తీసికొని వచ్చితిని. నీవు చాలకాలము నుండియు ఏమియు భుజింప నందున నీకునైవేద్యముగూడఁ దెచ్చితిని. ఈదినము గురు పౌర్ణమి. (గురువును సేవించుదినము) కావున నీపూజసలుపుటకు నాకనుజ్ఞ నీయవలయును.

అని పలుకుచు ఆమె ఆయన పాదముల నుదకము చేతను, పాలచేతను ప్రక్షాళనమొనరించి చందన గంధపుష్ప ములు, కుంకుమ మొదలగు పదార్థములచేపూజింప ముందుకు లాగినది. తనపాదముల వెనుకకు లాగుకొని మహారా జిటులఁ బలికెను. “నాపాదము లంటకుము. నేనిందుల కొప్పుకొనను. నీవేమి సేయుటకు నేను సమ్మతింపను, వెళ్లిపో.”

చంద్రా:- నీవు నన్ను కొట్టెదవు. కొట్టుము. లేక యింకేమయిన సలుపుము. బాబా యనుజ్ఞ నెరవేర్ప నిశ్చ యించుకొన్నాను.

అని పలుకుచు ఆమె కంబడిక్రిందికి లాగుకొనిన యాతని పాదముల ముందుకు లాగినది. ఆగ్రహాయత్తుఁడై మహారాజు తనపిడికిలిని ఆయమపై ఝళిపించి తన యం!ముల

మరల వెనుకకు లాగుకొనెను. కాని మరల నామె బిగ్గరగా నిట్లు బలికినది.

చంద్ర:- ఈ పాదములు నీవియా? ఇయ్యవి నీవిగావు. ఈ శరీరము నీది గాదు. ఈశరీరము నీయదియని ఎందుకు వాదించెదవు? నీపాదములు, నీశరీరము మాయాధీనము లైనవి. సర్వప్రపంచమునకు సంబంధించినవి. నీవేమి చేసినను నీమాటలు నేను పాటింపను.

మహారాజు కోపోద్రేకమున యీ లలనామణి ఒకని శరీరము ఆతని స్వసుఖార్థమయి జనింపలేదను మహోన్నత వైరాగ్యమును తనకు గఱపుట కీకార్యమునకు గడంగినదని తెలిసికొనఁ జాలక యింకను తనపాదముల వెనుకకులాగుకొన బ్రయత్నించు చుండెను. అంత టామె యక్కడ చూచుచున్న యిరువురు మగవారిని మహారాజును పట్టుకొనఁ బిలచినది. కోపావేశుఁ డయినప్పుడు ఆతని బలమును, జనులఁగొట్టుటకుఁ జేయు నుద్యుక్తతను తెలిసికొని మహారాజును సమీపింప వారలు సాహసింపలేదు. మహాబలవంతురాలగు నాకాంత తనకుఁ గావలసిన పాదమును ఒకచేత ముందుకులాగి, రెండవచేత ప్రక్షాళన మొనరించి గంధాక్షతలచేఁ బూజించి నది. తదుపరి పుష్పములు మొదలగున వాతని శిరమందునఁ బెట్టి నైవేద్య మొనరింప గిన్నెడు పాలాతని నోటికడకుఁ దెచ్చినది. మహారాజాపాలను క్రిందఁ బడద్రోసి లేచి నిలువఁ బడి యిట్లుఁ బలికెను.

మహా:- ఓచంద్రబాయి! ఇట్లు చేయుట నీకు న్యాయ మేనా? నన్ను బాధించుటకా యిచ్చట కరుగు దెంచితివి?

చంద్ర:- ఇప్పుడు నీవు మాటలాడుట కవసరములేదు. నీయిష్టములేకయే యీపూజ జరుగగలదు. ఈ గురుపూర్ణిమా దినమున సాయిబాబా నావలన యీపనిని నిర్వర్తింప జేసినాఁడు. దీని నాపుటకు శక్యమా?

మహా:- ఈ వ్యర్థవాక్యములు నాకు విసుగు గలుగఁ జేయుచున్నయవి. వెళ్లిపొమ్ము. ఇంకేమాత్రము కాలము వ్యర్థపరుపకు మిక్కడ.

ఈ విధముగా యీవిగ్రహమునకుఁ బ్రతిష్ఠయు,కుంభాభిషేకము జరుగఁబడినది.అప్పటినుండి యిప్పటి వఱకు శ్రీసాయి వలన విధింపఁబడిన పూజాకార్యము జరుగుచునే యున్నది. ఇట్లు బలవంతమున తన్నారాధించుటను గూర్చి యొకప్పుడు (1924) తినయంతట తానే యొక యుపన్యాసమున తనకిష్టము లేకపోయినను వైద్యునిగా నొనరింపఁబడిన మనుష్యుని కథకుఁ బోల్చి చెప్పెను. ఎవ్వరో యొక బ్రాహ్మణుఁడొకగ్రామమునఁ కేగుదెంచెను. ఆగ్రామస్థుఁడగు నొకజిత్తులమారి యీవచ్చిన బ్రాహ్మణుఁడొక డాక్టరుగావచ్చునని ఆతఁడు నేను గానని మొత్తుకొనుచున్నను వినిపించుకొనక "ఈతఁడొక గొప్ప డాక్టరు. సిగ్గుచే కారని చెప్పుచున్నారు!" అని యాబ్రాహ్మణుని నిర్బంధపఱచెను. ఈసంగతి యంతయు విని యనేకులరుదెంచి ఆనూతనమనుష్యు నావిధముగ నొత్తిడిచేయుటచే ఆబ్రాహ్మణుఁడు వేరుమార్గముఁ గానక యీశాస్త్రమునందు ప్రవేశించి కొన్నిభస్మము లొనరించి వానిలో శొంఠి, అల్లము మొదలగునవి పొడిచేసి కలిపి వానివలన యనేక రోగముల వారింపఁ

గలిగెను. అప్పటినుండి యాతఁడు నిజముగా నొక వైద్య విద్యాభ్యాసకుఁ డయ్యెను.

నిజముగా ఇక్కడసైతిత మటులనే పట్టుదలపై ఘనత (లేక దైవత్వము) పైనఁ బెట్టఁబడినది. కాని దాని కాతఁ డనర్హుఁడా? అట్లాతనికి సంపూర్ణార్హత నొసంగుటచే శ్రీసాయి బాబా యుద్దేశ్యము! ఎటుల శ్రీసాయిబాబా తదనంతర కార్య క్రమమును నిర్వర్తింపఁ గలిగెనో మనము కనుగొందము.



## అధ్యాయము ౧౪

### భ్రమిష్టావస్థ; స్వప్నములఁ బోలు దృశ్యములు

పరమేశ్వరుఁడు మంచిని కలుగఁజేయుటకు జెడుగును, పరిశుద్ధత్వమున కపరిశుద్ధత్వమును, మధురమునకుఁ జేదు పులుపులను, పవిత్రత్వమునకు, ఆధ్యాత్మిక బలమున కధమత్వము, జడత్వముల నుపయోగించును—మహారాజు తన శరీర మనో పరిస్థితులయందు, నిరాహారదీక్ష, బహిరంగస్థితులచేఁ గలిగిన యతికష్టప్రదములయిన దివ్యశక్తులయం దస్వాభావికస్థితికలిగిన వాఁడయ్యెను. కాని శ్రీసాయిబాబా, పైయెత్తునఁ గనిపెట్టుచు, యీ రాత్రిపై ఈ యమూల్యమగు భవిష్యచ్ఛుభ పూర్ణమయిన (కాశీనాథుఁడను) పాత్ర పగులకుండ, జాగరూకత బూని, సమయానుకూలముగా దురదృష్టములసైతము, సంతోష ప్రదములుగా మార్చివైచెను. ఎట్లు మహారాజు

యీ భ్రమిష్టావస్థయను తుపాను నెదుర్కొని సహించఁ గలిగెనో? ఆతఁడెట్లు తన యద్భుతానుభవములవలన, లాభముల గాంచఁ గలిగెనో? కనుగొందము.

పైఁజెప్పిన విధముగా, మహారాజు 1913 జనవరి నుండి సంపూర్ణముగా నన్న ద్వేషముఁ గలవాఁడయ్యెను. అన్నమును గాంచినంతనే, యాతనికి మిక్కిలి యసహ్యము దోఁపసాగెను. అది యాతని చూపులకు, నాసనకు, శరీర విసర్జితమయిన మల మూత్రాది పదార్థముగాఁ గానవచ్చెడిది. ఒక్క మెతుకు నోటిలో పెట్టుకొనఁగనే, అది యాతనికి సులభముగా మ్రింగుడుపడక—కుత్తుక కడ్డుపడియెడిది. అదియింకను నోటిలో నుండఁగనే, భోజనము పూర్తియయినదని తలంచెడి వాఁడు. ఎటులో నొక ముద్ద మ్రింగినట్లయిన, ఆతనికిఁ గడుపు నిండి నట్లు తోఁచెడిది. అయినప్పటికిని ప్రతిదినము భోజన పదార్థ మాతని ముందు పెట్టఁబడుచుండెను. కాని యాతఁడెప్పుడు, కుక్కలకుఁ బిల్లులకు, తదితర జంతుజాలముల కాయాహార మును పారవైచెడివాఁడు.

ఇదియంతయు నెవరికైనను, తీరని యాపదగాఁ గాన వచ్చును. కాని నిజముగా, నీ (కారు) గాఢాంధకార మేఘము లలో నొక విద్యుత్కాంతికలదు. శ్రీసాయిబాబా దీవనలచే నొక్కొక్కప్పు డాతఁడు కలవరపడినను, ఈ విపత్తులచేఁ గలుగు మహాలాభ యోగములఁ బొందఁగలిగెను. ముఖ్యముగ నాతఁ డీయనుభవములఁ బొందునప్పుడు భయము; ఒక్కొక్కప్పుడు కేవలము బాధయు, పొందెడి వాఁడు. అప్పుడతఁడు తల్లికడ కరుగు, శిశువు చందమున, శ్రీసాయికడ కరుగువాఁడు! అంతట

శ్రీసాయి, ఈక్రింది మాటలతో నోదార్చువాఁడు. "నేనెల్లప్పుడు నీతోడనే యుండెదను. నీవు భయపడవలసిన యవసరములేదు. నీవిప్పుడెంత బాధపడెదవో, అంతకన్న యధిక సౌఖ్యతరము, మహోత్తమదశ నందగలవు. నీభవిష్య జ్జీవితము! నీవొక్కఁడ వొక త్రాసు పళ్లెరమున, ... ... రెండవదానియం దీవిశ్వ మంతయు, నీవిప్పు డవధూత వైతివి. (కాఁబోవుచున్నావు) అనేకులు వేనవేలు, నీ దర్శనము కొఱకు నెట్టుకొని వచ్చుచున్నారు!"

కాశీనాథ మహారాజుయొక్క యోర్పు, దానితోపాటు దురదృష్టమున గుందుచున్న వారలపైన దయ, సద్గురువు కుండ వలసిన లక్షణములు, ఈయనుభవముల వలననే, యవి లభించుచున్నవి. ఇట్టి యత్యద్భుత పరిణామముల వలననే, పెక్కు మంది (సి.జి. వార్ధాలోని సివిల్ సర్జన్ మొదలగువారు) దేవాంశ భవుఁ డీతఁడని నిశ్చయించిరి. ఆతని శారీరక మానసిక పరిస్థితులలో, అష్టావక్రగీత, తదితర గ్రంథముల మహోన్నతాశయములు, (తనకు బాగుగా తీరికయున్నప్పుడు పఠించుచుండు గ్రంథములు) ఆతనిపైబడి, రోగిగా గృహమునకు మరలించి, యాతని స్వభావమును మార్చియుండెడివే. దాని కుదాహరణముగ, నాఁకలిగాని లేక యాహారమందలి కోరికగాని లేకపోవుట వలన, తాను భుజింపక, ప్రథమమునఁ గుక్కలకు, పిల్లులకు, గాడిదెలకు తదితర జంతుజాలములకుఁ, దాను డిను పదార్థములఁ బొఱవైచి, తా నీ జంతువుల రూపమున, 'ఆ యాహారము నారగించు చున్నా'నని తలంచుట సులభమే! అనగా "సర్వజంతువులను, నీ వలె చూచుకొమ్ము" అనుట సాధ్య

మయినదికాదు. కాని యాహారపానముల విసర్జించి, సర్వకామముల ద్యజించి స్వాతంత్ర్యము నొందిన మానవునకు సులభము. అతఁడు తన తొట్టిలోని 'డయాజనీస్' ( Diogenes ) కంటె తృప్తి, దయ, స్వాతంత్ర్యముఁ గల్గిన వాఁడగును. తన గురుదేవుని యనుగ్రహమున, మామూలుగాఁ జేయు నిరాహార దీక్షాఫలితములు, మిట్టమధ్యాహ్నమున సహస్రకిరణ ప్రభాసమానుఁడగు, సూర్యునివైపు చూచుటచేఁ గలిగిన యాతని తాత్కాలికమైన యంధత్వము, ఈరెండును అప్పుడు గాని, కొంతకాలమునకుగాని, ఆశ్చర్యకరములును యుక్తియుక్తములు నగు తత్త్వజ్ఞాన, యాధ్యాత్మిక విషయములఁ దెలియ పర్చినవి. అట్టి విషయముల మన మిచ్చట కొన్నిటి నుదాహరింతము.

ఒకానొక దినమున బహుశః 1913 న ఒకనాటి మధ్యాహ్నమున, సూర్యభగవానున కర్ఘ్యమిచ్చుటకై యాతఁడు తనదోసిట నుదకముల నుంచుకొని, ఆ నీటియందు, సూర్యుని ప్రతిబింబమును గాంచుచు, అట్టులే కన్నులు మిఱుమిట్లు గొలిపి, కానఁబడకుండఁ బోవువఱకు, నిలువఁబడెను. అప్పు డాతని కాసూర్యుఁడు దాని ప్రతిబింబము నల్లగాఁ గానవచ్చెను దేవాలయమందలి దీపమునుగూడఁ, గాంచలేకపోయిన వాఁడయి, గ్రుడ్డివారలరీతి, తడవికొనఁ జొచ్చెను. సూర్యుఁ డాతని తలలోనికిఁ జొచ్చినట్లు భ్రమఁజెంది, యాకస్మికముగ, సూర్యకిరణము లారాత్రి యాతని కన్నులఁ బొడకట్టెను. అతఁ డీ చేష్టలన్నియుఁ దన యవసానకాల చిహ్నములని భయపడి, గ్రామములోనికిఁ బని తన స్నేహితులఁ గొందరి నీ విష

యమైన, ఏదైన నివారణోపాయ మడిగెను. వారల దివఱకు వలెనే యిదిగూడ శ్రీ సాయి యనుగ్రహావశమున సంభవించి నది. కాన యణంగగలదని వాక్రుచ్చిరి. ఉపవాసమే యీ యాపదవచ్చుటకు మూలకారణము కావచ్చునని, వారలీతనికి వెచ్చవెచ్చని జావ, కొంచెమొసంగిరి. దాని నతఁడు మ్రింగఁ బ్రయత్నించెను. కాని యది మ్రింగుడు పడనందున యుమియ బడెను. ఆ రాత్రి, తోడుగా 'డెక్సిట్' (Dexit) తో దేవా లయమునకుఁ దిరిగివచ్చి, నిదురబోవఁ బ్రయత్నించెను. కాని నిదుర పట్టదయ్యెను. అతని యెదుట బరమాణువుల రూప మున కాంతిపుంజములు కానఁబడసాగెను. ఈ బాధవలన, అతఁడు పొందిన లాభమేమన కొన్ని కాంతి గోళము లాకస్మిక ముగఁ గ్రిందికిఁ బైకెగురుచు, రానురాను పెద్దవగుచు, అతని శరీరమును సమీపించుచు, అదృశ్యములగుట గానవచ్చెను. తదుపరి యెప్పుడాతఁ డిజ్ఞానవర్ధకములగు మనోదృశ్యములఁ (Visions) గాంచినను, సాధారణముగ నివి యిటువంటి పరిధితో గూడుకొని తెరపైన సినిమా బొమ్మలవలె వచ్చి, ఆ పరిధితోబాటు దృశ్యమగుచుండెడివి.

పైవిషయము ప్రకృతి సంబంధమయిన యెడల, అతని స్వభావమును, వేరుమార్పుఁజేయ వీలులేకుండు నంతటి, విభా గమునకుఁ దెచ్చెడివి. ఇంకొక దృశ్యమాతనిని, తత్త్వవిచార మునకుఁ దీసికొనిపోయి, తనకును (జీవునను) ఈ జగత్తునకును, గలసంబంధమును, పరీక్షించుటకును; తెలిసికొనుటకు సైత మశక్తునిఁ జేసివైచును.

ఒకనాటి మధ్యాహ్నమున 2 గంటలప్పుడు - దీర్ఘోపవాస దీక్షలఁజేసినపిదప, నాతఁడొక స్వప్నముఁబోలు దృశ్యమును గాంచెను. ఆకస్మికముగ భూ, వ్యాకాశ, సూర్యగోళములు వానిచుట్టియునవే తనకు పెక్కుమైళ్ళదూరమున పరిభ్రమించు చున్నటుల గానఁబడియెను. ఆతఁడు వీనికి దూరముగా, నిలుచఁబడి, యివి పరిభ్రమించురీతిని గాంచెను. ఆ తిరుగుచున్న ప్రపంచము, క్రమక్రమముగా, నాతని చేరువకు వచ్చినది. అట్టిసమయము నందది సూక్ష్మాకృతిఁ దాల్చుచు, చివర కదియొక సుడిగాలివలె, ఆతనిలోనికి (ప్రక్కన) యదృశ్యమయ్యెను. కాని నిజముగ నప్పుడచ్చట, సుడిగాలిగాని, పెద్దగాలిగాని లేదు. 'తానెచ్చట నున్నది? లేక యీ సూర్యాకాశ జగత్తు లాతనికి దూరముగా, పరిభ్రమించుటఁ జూచి, తాను, నమ్మినదేమియో- ఆతఁడు తెలిసికొనలేకపోయెను. అట్టి స్వప్నమును బోలిన దృశ్యావలోకనమునఁ గూడ నాతఁ డాశ్చర్యపడెను. ఆదృశ్యము (Vision) 15 లేక 30 నిముసముల కంత్యమై, యదృశ్యమయ్యెను. మహారాజద్దానిని "ప్రతిది కదలుచునేయుండు" నను భౌతిక శాస్త్రవిషయమును ఋజువు పలుచువిషయమనియు, ఈ ప్రాపంచిక భ్రమ (జగద్భ్రమ) నుండియు, యీప్రాపంచిక సౌఖ్యముల నుండియు దూరుఁడయి, తానీజగత్తునకుఁ జాల దూరుఁడనని తలంచు మానవుఁడే - నిజమయిన ఆధ్యాత్మికత్వమును తెలిసికొనిన వాఁడని తలంచెను. ఈదృశ్య మాతని హృదయమున, "ఈ భౌతిక ప్రపంచ పరిభ్రమణము, మార్పు లశాశ్వతములు. ఇవి నిజమయినవి కావనియు - (ఎందుకన,

కొంతకాల మగపడును, అకస్మాత్తుగా నదృశ్యమగును) అతని వలననే జనించి, యాతనివలననే అంత్యమయి, ఆతనిలోనికే జనుచున్నవనియు; అతఁడు నిజముగా నీ కానవచ్చు బాహ్య ప్రపంచమున కతీతుఁడనియు; ఆతఁడు చలనములేని వాఁడు; నిత్యుఁడనియు; మఱి-యీజగత్తు క్షణభంగురమయినదనియు; కావున ఈ బాహ్యప్రపంచమునకు సంబంధించిన యీశరీర మాతఁడు కాదనియు," తెలిసికొనఁ గలిగెను.

ఈ యవస్థలోననే యాతని మహోన్నతాధ్యాత్మిక ప్రభాస భాస్కరుఁ డుదయించుట కారంభమయ్యెను. అందు వలననే, ఉపాసన లీలామృతము; లేక ఉపాసన వృత్తాంతము (Upasani Lilamrita or Memories of Upasani Baba) ల యందాతని జ్ఞానోదయ ఘట్టముగా నీవిషయము పేర్కొనఁబడినది.

ఇఁకను, ఈసమయమున తనకుఁ గలిగిన యనుభవముల నాతఁడు, జగదతీత విషయములుగను; మఱికొన్ని 'మహా వాక్య' ముల కుదాహరణము లనియు. అందువల్ల నివి 'యద్వైత సత్యాన్వేషణ సాధములకుఁ ప్రధానద్వారములని నిశ్చయించుకొనెను. ఇట్టి మహోన్నత ములగు యుక్తి యుక్తములైన విషయములలో నేమివ్రాయుట కీవినమ్రుఁడయిన *రచయిత - మిక్కిలి యశక్తుఁడని తలఁచు చున్నాఁడు.

అందువలననే, యీచిన్నిపొత్తమున (ఉపాసన మహా రాజుయొక్క జ్ఞానోదయ ఘట్టమున) చిన్నచిన్న సూచనాంశ

---

* అష్టావక్ర గీతయొక్క అధ్యాయం XIV. 4 వ శ్లోకము ప్రకా రము స్వయముగా ననుభవ వంతుఁడే యితరులకుఁ జెప్పఁగలఁడు.

ముల మాత్రమే యొసంగి యున్నాడు. అవియిఁకముందు వచ్చు పుటలవలనఁ గ్రహింపఁగలరు. ఈ 'రచయిత'; "యీ యవస్థయందు సద్గురుత్వ సౌధమును నిర్మించుటకు, పునాది యగు" 'మహారాజు' యొక్క కొన్ని యనుభవములను, వ్రాయుటకు సాహసించినాఁడు.

---

## అధ్యాయము ౧౬

## తృష్ణా విజయము

జ్ఞానాజ్ఞానావస్థలలో నున్న మానవుఁ డిప్పుడు అనేక యుగయుగముల మార్పుల పిదప, ప్రస్తుతస్థితికి వచ్చిన వాఁ డయ్యెను. భౌతికకీర్తిని, బుద్ధిని, సంఘమును, నిర్వహించుటకును, వృద్ధిగావించుటకును, అతఁడు మిక్కిలి పట్టుదలతో మొఱటువానివలె పోరవలసి యున్నది. (మొట్టమొదట దుర్బలత్వము, భయము, స్వాభిమానములపై ఆధారపడినను) పరలోకేచ్ఛలవలన క్రమక్రమముగా వృద్ధిగావింపఁబడిన, దేవత్వమునకుఁ దీసుకొనుపోవు గొప్పబలిష్ఠములయిన ప్రత్యేక చిహ్నముల నిర్మాణము చేయుటకొఱకు మొఱటుగాఁ బోరవలసి యున్నది.

ప్రతి మతమందును, (లేక ముఖ్యములగు మతముల యందు) 'ఐహికేచ్ఛలు' మానవునకు, పరమేశ్వర దర్శన పథావరోధములని చెప్పఁబడి యున్నవి. ఈ తృష్ణా సముదాయము లన్నియు, నిష్పక్షము వివరింపఁ బడుటలేదు. మన

'ఇండియా' లో నందఱకుఁ దెలిసియున్న విషయములగు, "అహంభావము; పదవులపై ప్రేమ; కామము;" వీనివిషయము లారయుదము. ఎవ్వరైన నీప్రబల శాత్రవుల జయింపక, 'యోగియు, సత్పురుషుఁడు' కాలేడు. ఈ యధ్యాయమున భ్రమిష్ఠావస్థ సహాయమున మహారాజు తృష్ణాదుల నణఁచుట యందుఁ గలిగిన యనుభవములు తెలుపఁబడినవి.

ఒకనాటి సాయంసమయమున, మహారాజు తన దేవాలయమున, సాయంసంధ్య వార్చుకొనుచు (పదివత్సరముల నాడు మృతినొందిన) తన పితామహుఁడగు గోపాలశాస్త్రి, ఆదేవాలయోపరి భాగమున నిలువఁబడి, చేయూపుటఁ గాంచెను. అంతట శాస్త్రి నెమ్మదిగ, 'అహమ్మద్‌నగర్' అని యుచ్చరించెను. ఇట్టి విషయమున కాతఁ డాశ్చర్య మొంది, యీదేవాలయము, షిర్డీయు నిర్మింపఁబడిన యాజిల్లా నామ ముచ్చరించఁ బడినందుల కర్థముఁ గ్రహింప సమర్థుఁడు కాక పోయెను. మహారాజు, తన పరిశోధనా వీక్షణము, లావ్యక్తిపైఁ బ్రసరింపఁజేసెను. మరల రెండవ పర్యాయముగూడ, శాస్త్రి ఆమాటలనే పలికెను. కాని మూఁడు, మాటలుగా విభజించి, నెమ్మదిగా ఒక్కొక్క పదము నీవిధముగా ఒత్తి పలికెను. అహమ్ – మదర్ – నగర్. ఇంకను మహారాజామాటలయం దర్థమును గ్రహింపఁ జాలనందున, శాస్త్రి తనచేతిని ఝళిపించుచుఁబిగ్గరగ, నామూఁడు పదములయం దొక్కొక్క దానిని ఒత్తి, 'అహమ్, మదర్, నగర్' అని పలికి, యాతని దృక్పథమునుండి యదృశ్యుఁడయ్యెను. ఈవిచిత్రమయిన పిశాచ విషయమును, ఆతని బోధన విషయమై గాఢాలోచనఁ

జేయగా కొంతవఱ కామాటల యందర్థ మీవిధముగ స్ఫురించెను.

'అహమ్' అనగా అహంభావము. (తన్ను గుఱించి గర్వ పడుట). 'మదన్' అనగా కామము లేక మోహము. 'గర్' అనగా గరళము లేక విషము.

ఈమూఁడుపదములొకచోటఁజేర్చిన 'అహమ్','మదన్' 'గర్' అనగా అహంభావము, కామము, నిజముగా విషము. అనఁగా ఆరెండును సాధుజీవిత పథమున కవరోధములు.

మహారాజంతట, "నా పితామహుఁ డీరీతి, తన యపార కరుణాకటాక్షమున, తనమనుమనికిఁ గలిగిన యవరోధములఁ దొలఁగించి, స్వాభిమానమును దొలఁగించి, కోరికల నరికట్టఁ జేసి, సంయమీంద్రునిగాఁ జేయ నీవిధముగ జిల్లాపేరును పలికి, సత్యమును తెలిపినాఁడ"ని నిశ్చయించి, సంతుష్ట స్వాంతుఁ డయ్యెను. మహారాజుయొక్క నేత్రములనుండి, యానంద బాష్పములు ప్రవహించినవి. అంత టతఁడు, 'అహమ్మద్‌నగర్' పదమును, పైయర్థమును గుఱించి చింతించుచు, తనలోతాను, మననము సేయసాగెను. ఈ విషయమును, వినిన 'షిర్డీ'యందలి జనులు ఈతని పిచ్చి పిచ్చి యూహాలలో నిది యొక్కట'ని దలంచిరి.

'కామవిజయము' చాలమంది కిష్టమయిన విషయమే కాని, కొంతమందికి సాంఘిక విషయములలో నిష్టమయినది గాదు. వారివారి స్వపరిస్థితులలో, కామవిజయ మసాధ్య మనియు, అట్లద్దానిని నిర్వహించిన యెడల, అపాయకరమని

యొంచు ప్రత్యేకవ్యక్తులు కలరు. వారలీకామభూతము నావం గలరా? ఈ విషయమున (ఉపాసన లీలామృతము) 'ఉపాసన బాబాతోఁ గొన్ని మాటలు' అను వానిలో చెప్పఁబడినట్లు మహారాజున కేమి తటస్థించినదో, చింతించుట జ్ఞానబోధక మయిన విషయము! ఆతనికి కామవాంఛలు లేకుండనుండి ఆతని శారీరక మానసిక పరిస్థితుల కేమియు వ్యసనములు లేకుండ నున్నట్లయిన, అప్పుడు పైచెప్పఁబడిన విషయములగు వానిలో కొన్నియైనను 'కామతృష్ణకు దూరుఁడౌట యసాధ్యము. అనిర్వహణీయము' అను వాని యుద్దేశ్యముల విషయ వచ్చును. అనేక వృశ్చికముల కాటును గుదుర్చునట్లు, 'ఈ తృష్ణలలో నొకదానిని కుదుర్చుట' యని యనేకమంది శరీర సాధకులు వాక్రుచ్చి యున్నవారలు. ఇవి యొక్కొక్కప్పుడు నయమగుచుండును. ఒక్కొక్కప్పుడు కావు. ఈ కామరోగ మును సంపూర్ణముగా కుదుర్చుకొనుటకు, శారీరక చికిత్సలేవన ఆహార ప్రమాణమును తగ్గించుట; పథ్యముండుట (అనగా మాంసాది మలిన పదార్థ భోజనము సేయకుండుట, ఉల్లిగడ్డ తాంబూలచర్వణముల నిషేధించుట,— ఇవి పెద్దలచే సూచింపఁబడినవి. ఈ విషయముల మీదనే యాధారపడరాదు. మానసిక చికిత్స లీవిధముగఁ జెప్పఁబడినవి—ఎట్టి దుర్విషయముల యందునను బాల్గొనకుండుటకు, అనగా సినిమాలు నాటకములు, పాటలు, పుస్తకములు, సభలు, స్నేహితుల ద్వారా; చెడుదృశ్యముల గాంచకుండుట, దుశ్శబ్దముల విన కుండుట, దురభ్యాసముల లోఁబడకుండుట, దురాలోచనల చేయకుండుట—

సత్ప్రవర్తనము వలనను, సోమరితనము వీడుట వలనను ప్రార్థన వలనను, సత్సహవాసము వలనను, సత్క్రమములగు మంచి యలవాట్లవలనను, తామసత్వముఁ గలుగఁజేయని, యాహారభోజము వల్లను, చిత్తసాధనముచేసి కామతృష్ణా పిశాచము నణఁగఁ ద్రొక్కఁగలము.

మహారాజు సోమనాథాలయము చేరకపూర్వమే యిట్టు వంటి సోపాన పంక్తుల ననేకము దాటినవాఁ డయ్యెను. తృష్ణల హరించుటకు (ఎప్పుడు మరణభూతము తనపైఁబడి పీల్చి పిప్పి చేయునో యను భయముతోఁ గూడిన) యాతని పూర్వా నారోగ్యమే చాలి యుండెడిది! కాని, ఆతనిని భద్రపఱుచు టకయి శ్రీసాయిబాబా షిర్డీ శిక్షణలో దీర్ఘకాలము నుండి యున్న నాగిరుగుతుల మాస్తిపై చెను. అందుకనియే మహారాజు 'నాగుకు శేఖరుఁడు అప్పుడప్పుడు నాకు సద్విషయములబోధించి నన్నియాశాపాశములనుండి విముక్తునిఁ జేసినాఁ'డని నుడివెను. ఇచ్చట అనేకములగు నితరాధ్యాత్మిక విషయములలోవలె మహారాజువలన యీవిజయము జరుగఁబడక శ్రీసాయిబాబా వలన ఆతని (మహారాజు) శారీర మానసములద్వారా మహా రాజునకీవిజయము ప్రాప్తించినది. నిజముగా మహారాజు చేయవలసినపని షిర్డీలోని ఖండోబాలయముందు ప్రశాంత ముగా నుపవిష్ఠుఁ డగుటయే— తక్కిన పని సర్వకార్య నిర్వ హణము శ్రీసాయిబాబాయే. తన యతి నిగూఢ నిరాఘాట మహత్తర ప్రభావసంకల్పబలమున సమాప్తిసేయుచున్నాఁడు!

"నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అనఁగా "ఉత్తమజాతి తురంగమువలె నిలువఁబడుము. తక్కినపని నేను నిర్వహించెదను." అని శ్రీకృష్ణభగవానుఁడు తన శిష్యునకు సెలవిచ్చి యున్నవాఁడు! ఇప్పుడు మహారాజు స్త్రీపురుషులకు భేదమేమాత్రము లేదనియు, కనఁబడుభేద మీదేహమునకే గాని ఆత్మకుఁగాదని నేర్చుకొనవలయును. మనమిప్పుడీవిషయమున మహారాజున కేదృశ్యములు, ఏ పరిశ్రమలు సహాయమొనరించెనో తెలిసికొందము. ఒక దినమున మహారాజొక దృశ్యమును (Vision) గాంచెను. ఆకస్మికముగ పదునారేండ్ల ప్రాయముగల యిరువురు జవ్వనులచే స్త్రీలు, నొక విశాలపు మైదానము మధ్యమున నొక స్తంభమునకుఁ దన్నుఁగట్టియుంచుట మహారాజు గాంచినవాఁడయ్యెను. తన్ను వదలివేయుఁడని యనేకవిధములఁ బ్రార్థించెను. కాని ఆపచ్చిక బయలునందు నర్తనమొనరించుచున్న యాయిరువురు స్త్రీలు నింకొక సనేకులు యువతీసమూహముతో నతని వాక్యము లాలకింపరైరి. చివరకాతఁడా యిరువురుస్త్రీలచే, 'కామమున వీడి తమవలె నొకస్త్రీయగు షరతుపై' వదలిపెట్టఁబడెను అతఁడట్లు స్త్రీయగుట సాధ్యమా! యని శంకించెను. వా లన్నివిషయముల యందారి తేరినవారుగాన యాతని పై రెండు గాజులుంచి స్త్రీనిగావించిరి. అంత వారలాతని విడుదల గావించి చుట్టును గ్రమ్ముకొని ఒక్కొక్కరొక నీతిబోధ మగు కథను జెప్పిరి.

ఆదృశ్య మంతర్ధానమయినది. తనకీకథలు జ్ఞప్తికి వచ్చు నప్పుడెల్ల, ఒక్కొక్క సమయమందతఁడు, తనశరీరమునందు

మార్పులేకున్నను, స్త్రీ నని తలచుకొని, అందువలన తాను భగ వంతునిభార్యయగు, 'అఖండసౌభాగ్యవతి' నని చెప్పెడివాఁడు!

సంయమీంద్రుల కామ నిరోధ ప్రయత్నములలో నిది యొక సామాన్యవిషయము. శ్రీరామకృష్ణ పరమహంస యప్పు డప్పుడు స్త్రీవేషధారియై, వారివలె ప్రవర్తించి, యటులే సుగుణకాంక్షను స్త్రీలయందు చరించువాఁడని శ్రీవారి జీవిత చారిత్రమును చదివియున్న వారలు, చదువరీ! నీవు గ్రహింపఁ గలవు! అప్పుడప్పుడు శ్రీసాయికూడ, స్త్రీవేష ధారియై, స్త్రీ పాత్రను సంపూర్ణముగా నిర్వహింప, వారుమాటలాడు ఫణితి, ననుకరించు, గొంతుకతో మాటలాడువాఁడు! అతని శిష్యుఁ డగు కాశీనాథుఁడుకూడ, వింకకొన్ని మెట్టుల నెక్కవలయును. అతఁడు తనను తనసేవ్యా ప్రారంభమునందే, ఒక స్త్రీవిధముగ నటించెడివాఁడు. తన్ను దర్శింపవచ్చు స్త్రీలను, తనకుఁ బూసి కొనఁ బసుపు, ధరించుటకు గాజుల నడిగెడివాఁడు. "నాబిడ్డ యెచ్చట నున్నది?" అని యడిగెడివాఁడు. సాధారణముగా నిది ప్రజలకు హాస్యాస్పదమయి, వట్టి పిచ్చి (Midsummer madness) యని తలంపఁజేసెడిది. 'సకోరి' కి వెళ్లిన పిదప అప్పుడప్పుడతఁడు స్త్రీలు ధరించు సారీ (Saree) అను చీరెను ధరించువాఁడు! అతఁడెప్పుడు నిరాటంకముగా నిష్క ల్మషులును, పవిత్రురాండ్రయిన, స్త్రీభక్తురాండ్రతో చరించు వాఁడు! అతని వస్త్రధారణ యితర సన్యాసులవలెను, గృహ స్థులవలెనుగాక, కొలది భేదముగా నుండెడిది. కౌపీనము (Koupina) ధరించుటకు బదులుగా యీ పుస్తకములో నొక చిత్రములోని రీతి రెండు గజముల నారచీరెను చుట్టుకొనును.

చదువరీ! కాశినాథ మహారాజు ఈకామాది వ్యసనముల నుండి విముక్తుఁడయ్యెనా? అని నీ వడుగవచ్చును. నిజముగ నిది ముఖ్యమయిన విషయమే. ఈ విషయమయిన చర్చ కొందఱికి కమర్యాదకరముగాను కొందఱికి మొఱటుగాను దోఁచును. ఈ విషయమున కప్పటి బొంబే పూనా యందలి పత్రికల నవలోకించి యింకను శ్రీ వారికి కామవ్యసనములను దుష్క్రియల నారోపణ చేయుటెంతయు మౌఢ్యము! సత్యాసత్యము తెలిసికొనలేక యెవరైనను వారి మర్యాదను తీసివేయ నెంచి కువాదములకు దిగిన నెవరేమి సేయగలరు? ఈ చర్చయందు నిష్కపటముగా నెదుర్కొను టుచితమయిన కార్యము. మహారాజు స్త్రీ పురుషులయందు నిరాటంకముగా చరించుటను దిగంబరత్వమును గుఱించి యపోహలు పోయినయెడల వారి కామవిజయత్వమును తెలిసికొనుట కష్టము! కావున పై ప్రశ్న నవలోకింతము.

ఎవరైన నీవిషయము నపోహావశుఁడుగాక నిశ్శంకుఁడై యాలోచించిన యెడల ఆతని చిత్తమునకు—'వేనకువేలు మహాజనులు పెద్ద పెద్ద పదవులయందున్న వారలు స్త్రీపురుషాదులాబాలగోపాలము వారికడకు జనుదెంచి వారియందావ గింజంతయు దుర్నీతి, దుష్ప్రవర్తనముఁ గాంచఁజాలక మహర్షి పుంగవుఁడని తలంచుచున్న విషయము మనస్సునకుఁ దట్టక పోదు.' 20 సంవత్సరములనుండి వారి కిశేషములఁ గాంచుచున్న యీ జనసహస్ర నేత్రములమూసి చరించుట కెంతయు నమానుష మాయాపరతంత్రుఁడు గావలెను. ఉద్రేకము నాపుకొన జాలినవాఁడు కావలయును. ప్రమహనీయుని దివ్య

ప్రభావమున అనేక భక్తశిఖామణులు నిత్యానంద పరవశత్వమును పొందుచున్నారో ఆమహనీయుని హృదయపాత్రమున మధు రసముగాక విష రసమా ?) శ్రీబాబా స్త్రీ పురుషులకు బ్రహ్మచర్యము ప్రబోధించుటేగాక తానద్దాని కాదర్శప్రాయుఁ డగుటయేగాక నిజముగా వారికంతర్గత బలముసైతమొసఁగి వారిబ్రహ్మచర్యమును పాలించుటకుఁదగిన ధైర్యమొసంగునని చెప్పుచున్న శ్రీవారి భక్తసముదాయముల యనుభవములే నిరాఘాటకంఠమున హిమాలయములు మారుమ్రోగునట్లు సాక్ష్యము చెప్పుచున్నవి. అంతటితో నాగక వారిభక్తులను వారిస్వంత భార్యలయందు సైతము బ్రహ్మచర్యము నవలంబింపఁజేసి కామోప భోగతృష్ణల నణఁగఁద్రొక్కఁ జేసినాఁడు బాబా! ఇట్టి పైవిషయముల వ్రాయుటకు అనేక సాక్ష్యములుండుట వలననే యీగ్రంథకర్త పైవిషయముల వ్రాయఁగలిగినాఁడు. ఇంకను యీవిషయచర్చ యనావశ్యకము. ఈ అరువదివత్సరముల యోగీంద్రుని విషయమై యెవ్వరు శంకింతురు?

మహారాజు నిశ్చలచిత్తుఁడయినాఁడు! అతఁ డిప్పుడు బాహ్యకముగను, అంతర్గతముగను, దైవత్వమను రంగువేయఁబడి, సమ్పూర్ణముగా, నొక శిలావిగ్రహముగాఁబడి, తనపై శ్రీసాయిబాబా పెట్టిన పనిని నెరవేర్ప బహిరంగప్రదేశమునఁ బ్రతిష్ఠింపఁబడినాఁడు! స్త్రీలు, పురుషులు, వారిపై అఖండ విశ్వాస భక్తి గౌరవములుంచి, వారిని సేవించి, వారివారి యాధ్యాత్మిక ప్రభావబలముల వృద్ధిగావించు కొనుచుందురు.

—♦—

# అధ్యాయము ౧౬

## కాంచన విజయము

క్రిందటి యధ్యాయమున 'కామినీవిజయమును' గుఱించి తెలిసికొంటిమి. ఇప్పుడాతని గురువర్యునివలనఁ గలిగిన మహారాజుయొక్క 'కాంచన విజయము' లేక ధనమందునను, పదవులందునను గల తృష్ణను నాశనమొనరించు విషయమును గుఱించి కొలఁదిగాఁ జెప్పఁబడును.

తన యిరువదియాఱవ యేడువఱకు, ననుభవించిన దారిద్ర్యమువలన 'ధనమే జీవితమునకు ముఖ్యాధారము. అదియే సౌఖ్యములకు మూలకారణ' మను నుద్దేశ్యము తప్పక కలిగి యుండవచ్చును.— (ధనములేక పోయినను, జీవితమును గడుపుకొనఁ జాలు సామర్థ్యమున, ధనతృష్ణ నణచఁగల మహత్తర శక్తి కల్గియున్నను) ఆతనికిఁ గలిగిన అమరావతి, నాగపురముల యందలి విజయములు, తదుపరి గ్వాలియర్ కడ కలిగిన యపజయము లీయుద్దేశ్యమును దృఢపఱిచి యుండును. ఇట్టితృష్ణాగ్ని జ్వాలల నార్పివైచుట శ్రీసాయికి తప్ప ఇతరులకు చాల కష్టము.

"ప్రశాంతముగాఁ గూరుచుండుము. ఇతరులతో నేమియు పనిలేదు." అను శ్రీ సాయి యాజ్ఞ మహారాజునకు పరిపూర్ణముగా ధనవస్తు సాంప్రదాయములయందు విముఖత్వమును కలిగించినది. మహారాజున కిప్పుడు దాచి తాళము వేసుకొనుట కేమియులేదు. మిత్రుఁడగు మాధవరావు కడ

నుంచిన కొలది ధనము శ్రీసాయిబాబా దక్షిణల రూపముగా తీసుకొనసాగెను. మహారాజు పైగుడ్డ సైతము చినుగులువారి, దానియం దనేకరంధ్రము లేర్పడినవి. ఆతని సోదరుఁ డొకనాఁ డొక నూతనాంబరమును బంపెను. అది ఖండోబాలయము నకు జేఁబడెను. కాని సుఖప్రయోగించు కొనకమునుపే, అది దొంగిలింపఁబడెను. వస్త్రాలెందుకని పేలికల ధరించు పద విని దాచులకు, స్పష్టముగా సాయి, అనుజ్ఞ యియ్యఁడయ్యెను ఎందుకన? ఆతని చిత్తము నిశ్చలముగా భగవంతుని (గురువు) యందే మగ్నమగుట కొఱకు—ఈ కారణముల వలన, పూర్వ వాసనలగు ధనతృష్ణా బీజము లానూతన శిష్యుని హృదయ క్షేత్రమున నాటి యుండుట వలన, వానిని దగ్ధీభూత మొన రింప, కొన్ని విచిత్ర సంఘటనలఁ గలుగఁజేసెను. అట్టి ధన తృష్ణలవలన, ప్రాపంచకేచ్ఛలవలన, ఆ మానవునకుఁ బాప ప్రవర్తన మొనఁగూడును. అందువలననే ప్రతి బ్రాహ్మణుఁ డును, కనీసము దినమునకు రెండుపర్యాయములు, ఉదయ స్సాయంతన ప్రార్థనా సమయములయందు, దుష్ప్రవర్తనా నాశనమునకై ప్రార్థనసేయును. అందులకై యేర్పఱుపఁబడిన, మంత్రమును, 'పాపపురుష నిరసనము' లేక యఘమర్షణ మంత్ర మని పిలిచెదరు. అందువలన, పాపము బోగొట్టబడునని దాని యుద్దేశ్యము. కొందఱీమంత్ర పఠన మొనరించుచు, వెళ్ళగొట్ట బడు పాపపురుషునిఁ గూడఁ గాంచెదరు. ఒకసారి శ్రీరామ కృష్ణ పరమహంస, తన దేహముతోఁ గూడియున్న యొక నల్లని వ్యక్తినిఁగాంచెను. ఇంతలో తన శరీరమునుండి, దేదీప్య మానమైన నొక దివ్యాకారము, దేవతా శరీర ధారిణియై,

బయలుదేరి, ఆ నల్లని వ్యక్తి నెదురించి (పాపపురుషుని) మట్టు పెట్టెను. ఈ విధముగ నాతఁడు పాపమునుండి వేఱయ్యెను. ఆ విధముగనే మహారాజునకుఁ గూడ యీ క్రిందఁ జెప్పఁబడిన విషయము జరిగినది.

అతఁడొక దినమున బాబాకై తిరిగి, సాయిబాబా కూర్చుండియున్న యొకపురాతన భవనములోన ప్రవేశించెను. సాయిబాబా మహారాజుచెవిలో, నుపదేశము చేయుటకై, చేరువకు రమ్మని సంజ్ఞచేసెను. మహారాజటులనే, గురువు చేరువకరిగి, గురువు వారివాక్యముల నాకర్ణింప నున్నతఱి, సరిగా, తనవలెనే యున్న యొకనల్లని యాకార మాతని వెనుక భాగమున నిలువఁబడి, "సాయిబాబా మాటలు వినకుము. నామాటలు వినుము." అని చెప్పుచు, వెనుకకు లాగెను. గురువర్యుని హెచ్చరికను లక్ష్యముసేయకుండ నిటుల జరుగుట మొదటిపర్యాయముకాదు. ఈజరుగుచున్నవిషయమును గాంచి, సాయిబాబా తన యున్నతాసనము నుండి క్రిందికిఁదిగి, ఆనల్లని వ్యక్తియొక్క శిరోజములఁ బట్టుకొని, క్రిందికి నెట్టి దేహ మెల్లఁ జినుఁగఁగొట్టి, యాకట్టడమునుండి వెలుపలకు నెట్టి, చేరువనున్న యొక ముఱికికాలువకడకు మూనుకొనిపోయి, అచ్చటొక చితిపైనఁ బరుండఁబెట్టి, ఆవ్యక్తిని తగులఁబెట్టెను. ఇట్లు జరుగుచున్న సమయమున, మహారాజు ఆనల్లని శరీరము తాను ఏకాకారులగు టొక్కటియే యనుకొనుచు, దాని విషయమై తాను బ్రతిమాలుచు బాబాతో నిటులనియెను —

మహా— ఇదేమిటి! నీవు పట్టుకొనిన మనుష్యుఁడను నేనే నన్ను మీరేల బాధించితిరి బాబా ?

సాయి- ఆ వ్యక్తివి నీవే సంశయములేదు. ఎవరు కాదన్నారు? కాని నీవా పాపరూపములో నున్నావు. నే నాతనిని సంహరించితిని. నీవు - ఇప్పుడు పాపమునుండి విడుదల కాఁబడితివి. మన యేకీభావ ప్రయత్నములవలన సాధింపవలసిన కార్యములు చాలగలవు. పాపపురుషుని వెడలఁగొట్టక పోయిన మన పనులన్నియు నెటుల జరుగును?

మహా- నా చెవిలో రహస్యముగా చెప్పిన దేమిటి?

సాయి- ఇప్పుడు నీకు చెప్పవలసిన దేమియు లేదు. నీ మార్గమునకు నిరోధకమయినది వదలింపఁబడినది. నేను చెప్పకుండగనే సర్వవిషయముల నీవే తెలుసుకొనఁగలవు.

అంతట 'సాయి' అదృశ్యుఁడయ్యెను. ఇది జరిగిన వెంటనే, సాయిబాబా కొంక్కు గురువు వందన మొనరించి తన శిరమును మహారాజుయొక్క చరణములయుం దుంచెను. ఇట్టి తన గురువుయొక్క గురువొనరించు యనుచిత మర్యాద కాశ్చర్య పడుచున్న మహారాజీదృశ్యమంతయుఁ గాంచుచున్న మఱియొకవ్యక్తిని గాంచెను. ఈ దృశ్యమంతర్ధానమయ్యెను.

ఈ పాపపురుషునుండియు నరకమునుండియు తప్పించుకొనుటయు, దివ్యప్రకాశమాన మగు దీపికను బొందుటను గుఱించిన విషయములు మహారాజుగాంచిన రెండవ దృశ్యము (Vision) శ్రీ సాయి యితనిని గొనిపోయి, ఒకచో మహోన్నతములగు సౌధపంక్తులవద్ద వదలిపెట్టెను. అప్పుడాతఁడా ప్రాంత ప్రదేశముల వీక్షించుచు ఒక యంధకారావృతాగాధ బిలప్రదేశమున నిలువఁబడినవాఁడయ్యెను. అప్పుడందుండి

వెనుక నల్లని హస్తమొకటి బయటికివచ్చి యాతని పాదములఁ గట్టిగఁ బట్టుకొని లోపలికి గుంజుచుండుట యాతఁడు గాంచెను. 'వదలుము చేయి' అని మహారా జఱచెను.

'ఎవఁడవు నీవు? ఎందుకు నన్ను లాగెదవు? నన్ను వదలక పోయిన యెడల మా సాయిబాబాకుఁ జెప్పెదను.' ఇట్లు సాయిబాబా నామము నుచ్చరింపఁగనే ఆతని పాదములు వదల బడెను. ఆతఁ డీ దృశ్యమందలి 'అంధకారాగాధ ప్రదేశము, హస్తము, నరకమనియు తన కడ కెవ్వరైన యజాగ్రత్తగా వచ్చినయెడల లోపలకు లాగుకొనుననియు, అట్లు దానిచేరువ కరుగుట తనదే లోపమనియుఁ' దెలిసికొనెను. తదనంతర మాతఁ డా యంధకారమున నొక లాంతరు గావలయు ననుకొని తన కది లభించునో లేదో యని సంశయించెను. అట్టి సమయముననే, ఆశ్చర్యకరముగ బ్రహ్మాండమున వెలుంగుచున్న సూర్యచంద్రాదులను గాంచెను. అప్పుడు శ్రీసాయి సాక్షాత్కరించి, 'ఆ సూర్యచంద్రాదుల ప్రకాశము వాని కనవసరము. వారి ప్రకాశము చాల గొప్పది.' సర్వస్థలములను వెలుగు నిచ్చి కాపాడు (రక్షణగాని, నూనెగాని యక్కఱలేకయే) లాంతరును దీసుకొనుమని యడిగెను. 'నీ కా లాంతరున్నట్లయి తేనా? నీ కెచ్చటను ప్రతిబంధక ముండదు. సర్వ ప్రతిబంధకములఁ దొలగించుకొనియెదవు. మఱియు నీవు ముందనేకులకు వెలుఁగు జూపించెదవు.' అటులనే మహారాజు దీపికను బొందెను.

పాఠక మహాశయా! ఈ దృశ్యములలో చాలవఱకు ప్రత్యక్షముగా జరిగిన విషయములని గ్రహింతువుగాక! ఎవ రైన భ్రమిష్టావస్థలోనఁ బ్రవేశించు అప్పు డీ విషయము లారసి

నట్లైన, ఇవన్నియు నశీవిషయములయి, నిజము గాని యాతని యంత
టతండే యనుభవములవలనం దెలిసికొనవలెను. ఒకప్పుడు
సాయి మహారాజుతో నిట్లు చెప్పెను. 'నీ తలలో నేను
సగము తీసుకొని నా శిరమున సగము నీ కొసంగెదను.' తదు
పరి మహారాజు, ఎవరో క్రూరాత్ములు వచ్చి, తన శిరమును
గోసి దానిలోని పదార్థమంతయు దీసి పరుగెత్తిపోవుట కను
గొనెను. నిజమైన జ్ఞానమును కనుగొనుట కేవలము కన్నులతోఁ
గాక, యంతర్గత జ్ఞాననేత్రములతోడ మాత్రమే, గాంచ
వలయునని, నిస్సంశయముగా మహారాజునకుఁ జెప్పఁబడెను.
తదనంతరము నొకనాడాతని కేదో తమాషా చూపించుటకయి,
తన్నొకచోటికి తీసికొనిపోయి యాకస్మికముగ నొక స్త్రీ
యాతని కన్నులు మూసినట్లు మహారాజొక దృశ్యమును
గాంచెను. (Vision) ఆ స్త్రీ యాతని రెండు కన్నులు మూసి
వైచి, యిట్లుఁ బలికినది. "నీ కనులకొరకు జాగ్రత్తపడె
దవా? యీ నేత్రములతో నీ వేమి చేసెదవు? వీనితో జూడ
కుండయుండుట చాల మంచిది. కొంతకాలమునకు నీవు
బాగుగా కనుగొనెదవు—సర్వము."

సర్వదుఃఖములకు మూలమయిన ధనకాంక్షా నాశనమున
కొక దృశ్యమిచ్చుట క్రిందివిధముగా జరిగినది:-

సాయిబాబా, మహారాజునొక నిగూఢ ప్రదేశమునకుఁ
దీసికొనిపోయి, దాదాపు 150 మూరల పొడవును, 80 మూరల
వెడల్పును, 4 అంగుళాల యెత్తునుగల రూపాయలకుప్పను
జూపించెను. దానిపై నొక యమూల్యమయిన జల్తారుగుడ్డపై

పెద్దదిండు గలిగిన నొక సుందరశయ్య యొకటి యమర్పఁబడి యుండెను. దానిపై, విలువగల వస్త్రులధరించి యనేక భూషణ ములచే నలరారుచున్న నొక వ్యక్తి కూర్చుండి యుండెను. అతనిఁ గాంచుకొని శ్రీసాయి, మహారాజునడిగెను.

మహా— ఎవ రతఁడు ?

సాయి— నీ వాతనిని గుర్తించలేదా ? ఆవ్యక్తివి నీవే. నీపాపశరీరము పోయినది. ఇది నీపుణ్యశరీరము !

అంతట సాయి, ఆరూపాయలవైపు చూపించుచు, నిటుల బలికెను. "ఈరూపాయలన్నియు మనవి." తదనంతరము 'సాయి' మరియొక రూపాయలతో నిండినగదిని చూపించి యిటులనెను.

"ఇటుల రూపాయలతో నిండియున్న గదులు వందల కొలది యున్నవి. అవన్నియు మనవే! న్యాయముగ నీవే, వీనిని తెలిసికొనావు."

తదనంతరము 'సాయి' మహారాజు లాగృహమును వీడి వచ్చిరి. ఆదృశ్య మంతర్ధానమయ్యెను. సాయిబాబా స్పష్టముగా మహారాజున కగణ్య ధనరాసులను జూపి, యాతని చిత్తమును, బ్రాపంచికేచ్ఛలనుండి తొలగించినాఁడు !



# అధ్యాయము ౧౭

## ఆత్మజ్ఞానము

ఆత్మజ్ఞానము, తన్ను తాను దెలిసికొనుట, జ్ఞానము అనునవి యొకే యర్థమునకుఁ జెందిన పర్యాయపదములైనను, వారి వారి మతములఁ బట్టియు, వారి వారి దేవభావనలఁ బట్టియు, అనేకుల కనేక విధములగు భేదార్థములుగఁ దోఁచును. ఉద్ధవతత్వము (మతము) నకుఁ జెందిన, ఉపాసని మహారాజు ఆదిశంకరాచార్యుల వారి, యద్వైతమును, దాని వేదాంత తత్వమం దనుకరించుచు, మతారాధనా పరత్వమున శ్రీరామానుజాచార్యులవారి విశిష్టాద్వైతమును కొలది భేదముతో ననుకరించును. ఈ మతమునందున్న వారలు, స్వేచ్ఛగా శివుని విఘ్నేశ్వరుని, దత్తాత్రేయుని, మాసోబాదేవుని, శని, తుకారాం మొదలగు విష్ణురూపముల నారాధించెదరు. కాని శ్రీరామానుజాచార్యుల వారి మతస్వీకార మొనరించిన దాక్షిణాత్యులు, యీ పైవానిని నిరసించి విష్ణువునే యారాధించెదరు. ఏది యెటులున్నను, వారివారి యిష్టదైవాను సారముగ భగవంతుని యర్చించెదరు. సర్వ మతములును చివర కొకే గమ్యస్థానమునకుఁ బోవు వివిధపథములు! ఎవ్వ దేరూపమున భగవంతు నర్చించినను ఆతనిఁ జేరఁగలఁడు. ఈవిషయమును గురించియే సంధ్యావన్దనమున,

"ఆకాశాత్పతితం తోయం-యథాగచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"

'అనగా– ఏవిధమున ఆకాశమునుండి, వర్షరూపమున బడినజలము నానావిధములఁ జివరకు సముద్రమును జేరుచున్నవో, అవిధముగా, సర్వదేవనమస్కారములు శ్రీపరమేశ్వరునకే చెందును. ప్రతిమతోద్దేశము గూడ చివరకిదియే. ఎటులనిన, పిపాసాపరుఁడైన ఆంగ్లేయుఁ డొకఁడు, త్రాగుటకు 'ఫ్రెష్‌వాటర్' (fresh water) అని యడుగును. మహమ్మదీయుడు వానినే 'పానీ' యని యర్థించును. మనము 'మంచినీరమని' వాక్రుచ్చెదము. తదితరులు వారివారి భాషలఁ బలికెదరు. అటులనే, వీరర్థించున దేకపదార్థమయినను, పలుకులు వేరుగానున్నవి. అటులనే ప్రతిమతమును, శ్రీపరమేశ్వరునిఁ జేరుటకు వేరువేరు మార్గములు. మతవాదనలతో భ్రష్టత్వమొందక, యిష్టదైవమందు చిత్తమును కేంద్రీకరింపఁజేసి ఆతనిఁ గాంచుట ముఖ్యోద్దేశ్యము. భగవంతు నేపేరుతో బిలచిననేమి. ప్రతిపద మాతనికే జెందుచున్నది. మనకుఁ దోచిన భగవత్తత్త్వములబట్టి, పరమేశ్వరున కాయాపేరులు వచ్చినవి. ఎటులన, 'హరి' యనగా పాపముల హరించువాఁడు!–కేశవుఁడనగా స్వర్గమున కీశుఁడనియు విష్ణువనఁగా, సర్వవ్యాపి యనియు, ఈవిధముగా పరమేశ్వరునకు ఆయాగుణములబట్టి ఆయాపేరులు వచ్చినవి. ఏపేరునఁ బిలచినను–ఆతనికే చెందఁగలవు!

ప్రతి మత మందునఁగూడ, యీప్రాపంచిక మోహబంధములద్రెంపివైచి యీచిత్తమును పరమేశ్వరునిపైకి జొనిపి, మానవసేవయే మాధవు సేవ యని నమ్మి, సర్వజీవరాసులను, సమభావమునఁ బరికించి, న్యాయమార్గానువర్తియై, సమా

ధ్యవస్థయందు లీనమగుట (లేక భగవంతునిఁ జేరుట) జ్ఞాన లక్షణములనియు, యివి జ్ఞానసాధనకు ముఖ్యపథము లనియు వాక్రుచ్చబడియున్నవి.

మహారాజు తన చిన్నతనముననే, గృహానుకడ, మత విషయ కార్యముల ననేకములఁ గలిగి యుండెను. తనబాల్యమునందే యాతఁడు, స్వయముగ ఆత్మ శరీరభేదన విమర్శనా శక్తిఁ గలిగి యుండుట మనమెఱింగియుంటిమి. మొట్టమొదటాతఁడు యీవిధముగాఁ బహుకుల్య జీవనముఁ గడిపి జీవచ్ఛవత్వముఁ దాల్చుటకన్నఁ బ్రాహ్మోపదేశ మొనరించి, జీవములఁ బాయుటత్యుత్తమమని తలంచెను. కొన్నికొన్ని దినముల యనంతరము, యీప్రాపంచకేచ్ఛలగు ధనము, శరీరారోగ్యముల కొఱకుఁ బాటుపడఁ దలంచెను. ఆ యుద్దేశ్యముననే ఆతఁడు ప్రథమమున యోగి పరాన్వేషణమునకుఁ బయలు దేరినది. ఇటువంటి వానిని, మన శ్రీసాయిబాబా పట్టుకొని తనమహానురాగముచే, శరీరారోగ్యమును దయచేయుటేగాక అగణ్యధనరాసులని చూపించినాఁడు. అంతట నూరుకొనక సర్వ సమర్థుఁడగు శ్రీసాయి, తన ప్రియశిష్యునకు మహోత్తమమగు దివ్యజ్ఞానజ్యోతి నొసంగి, శాశ్వతోత్తమ జీవిని గావించినాఁడు !

'ధనకాంతాభూతము' హృదయపీఠమం దెక్కినదా? ఆతఁడు బ్రతుకుట దుర్లభము! సర్వదుఃఖముల కిదియే మూల కారణము. కాని మనమే ధనదాసులముగాక, మనమే యద్దానిని సేవకునిగాఁ గొనిన, మనకెంతో యుపకరింపఁగలదు. శ్రీసాయి యీవిషయము లన్నియు తన నిత్యజీవిత చర్య

యందునఁ బ్రదర్శించినాఁడు! ప్రతిదినము వందలకొలది జనసమూహము లరుదెంచి, శ్రీసాయిబాబాల అతని పాదారవిందములకడ, ధనమును బోసెడివారు. కాని యాతఁడెది తృణప్రాయముగాఁ జూచెడివాఁడు! శ్రీరామకృష్ణ పరమహంస ఒకచేతఁ బిడికెడుమట్టిఁ బట్టుకొని, మరియొకచేత ధనముఁబట్టుకొని, గంగానదియొడ్డున కరిగి, 'యీధనము–యీమట్టి రెండు నొకటియే యనియు' గంగానదిలో విసరి వైచువాఁడని వారిజీవితమునఁ జెప్పఁబడినది. ఈ శరీరమువలె యీధన మొక బాహ్యోపకరణము. ఈ ధనధాన్యాదులపై నున్న తృష్ణను, శ్రీ పరమేశ్వరునిపై నుంచినట్లయితే, తీరని లాభముగలదు– ఈ విషయము లన్నియు, మహారాజు తనకెడఁగా కాలమందు సంపూర్ణోత్తీర్ణుఁడై, తన పాదము లాశ్రయించుచున్న వారలకుఁ గూడ ప్రబోధించినాఁడు!

"జను లనుకొనుచున్నటుల యీసాయి – యీరక్తమాంసాస్థికల్పితవిగ్రహముగాదు. ఇటువంటి వనేకశరీరములఁ దాల్చి, యనేకదేహముల ధరించియున్నాను" అని శ్రీసాయి మహాఋషి తనశిష్యునకుఁ దనపూర్వజన్మల నన్నిటినిఁ దెలిపినాఁడు! *ఇటులనే, శ్రీకృష్ణపరమాత్మ యర్జునునితో నిటుల వాక్రుచ్చి యున్నాఁడు.

"బహూని మే వ్యతీతాని జన్మాని, తవచార్జున
తా న్యహం వేద సర్వాణి, న త్వం వేత్థ పరంతప."

— భగవద్గీత.

*ఇటువంటి పూర్వజన్మలలో నొకదానియందు, శ్రీ సాయి మహారాజునకు శిష్యుఁడయినాఁడు.

అనగా, "ఓ అర్జునా! నీకునాకును యిదియే మొదటి పుట్టుకగాదు. ఇదివఱకు - అనేక జన్మము లతిక్రమించినవి. నేనాజన్మంబుల నన్నింటిని యెఱుంగుదును - కాని నీవెఱుంగవు."

శ్రీసాయి ధరించిన ప్రతిజన్మయందును, ఆతఁడు తన్ను రెండుభాగములుగ నొనరించినాఁడు. తన రెండుభాగములను, మహారాజునకు, 'ఒకటి పుణ్యము - రెండవది పాపము' అని చెప్పి మొదట తనశిష్యుని వలన గ్రహించిన ఘోరపాప పురుషుని ఖండించి, "ఈ పాపశరీరమే నీవని తలంచినావు. కాని నీవు కావు" అని పలికెను. తదుపరి శ్రీసాయి, తనశిష్యునకుఁ బుణ్యపురుషుని చూపించినాఁడు.

మహా:- బాబా! మొదట నాపాపశరీరము చూపించితిరి. ఇపుడు నాపుణ్యశరీరము చూపించితిరి. అయితే నేనెవరను."

సాయి:- నీ వీరెండిటికి అతీతముగా నున్నావు. నీవు-నేనే! నీకు - నాకు భేద మేమాత్రము లేదు.

ఇదియొక మహావాక్యము. ఇట్టి నిగూఢ తత్త్వము, శ్రీసాయి మహానుగ్రహమున శిష్యునకుఁ దెలిపెను.

అనేకవేల సంవత్సరములనుండి తమకుఁ గలిగియున్న బాహ్యసంబంధములఁ దెలుపుటేగాక, శ్రీ సాయిభగవానుఁడు, యిప్పుడు హృదయమందలి అవనికను (తెర) పైకెత్తి యీవిధముగ నక్రమమగు సత్యమును దెలపియున్నాఁడు! - నీకు నాకు భేద మేమాత్రము లేదు" ఇట్టి మహా గురువాక్యమునకు శిష్యుని చిత్తాకాశమున, సత్యము మెరుపు మెరసినట్లు గానఁ

బడి, "లోకములు శేవముతేగాని ఆత్మ యొక్కటియే" యని దిక్కులు పిక్కటిల్ల, కులగిరి గంహ్వరములు మారుమ్రోయు నట్లు ప్రవచన సత్యమయ్యెను. అచిత్తాకాశమున తళుక్కున మెఱసిన యీ విద్యుల్లత మాయమైనది. తెరజారినది. శ్రీకృష్ణుఁ డొకపిల్లవాఁడై, అమాయ కాకృతిగనుండి, తన నోరుఁదెఱచి, తల్లి నంచునఁ బరికింపుమని, 'అండ బ్రహ్మాండ గోళములు తన చుట్టు పరిభ్రమించుచున్న దివ్యవిశ్వరూపమును చూపించి' యామెను విభ్రమాయత్తను గావించినాఁడు. అట్లనే శ్రీ సాయిగూడ గావించి 'ఆత్మ యొక్కటియే' యని నిరూపించెను. మహరాజు అజ్ఞానావస్థకు నిలువలేదని వెంటనే ప్రాపంచిక దృష్టికి మార్చుకొంచి యిట్లుఁ బలికినాఁడు. "ఈరూపాయలన్నియు (పుణ్యపురుషులచే గూర్చుచున్న అగణ్య ధనరాసులన్నియు) మనవి".



# అధ్యాయము ౧౭

## యోగశక్తులు

ఈ ప్రాపంచకేచ్ఛల మీఁదికి చిత్తమును పరుగెత్త నివ్వక, అమనస్సునను, యిష్టదేవతలపైఁ జొనిపి, మంత్రోచ్చారణాది క్రియలచే ననేకసిద్ధులఁ (శక్తుల) బొందుదు రనునది, అందరకుఁ దెలిసిన సామాన్య విషయము. పతంజలి యోగ సూత్రముల యందలి మూడవ యధ్యాయమున 16 మొదలు

56 సూత్రములు ఏవిధముగ యోగియైనవాఁడు, మానవుల చిత్తములలోని విషయముల సైతముఁ దెలుసుకొనుట మొదలు కైవల్యాగమ ప్రాప్తివరకు జరుగుట కనుకూలించు సిద్ధులఁ (Powen) బొందునో చూపఁబడి యున్నది.' ఎన్నడును, వాని నొనర్ప యత్నించని వారలును, వాని విషయ మాలోచించని వారలైనను సరియే, సులభముగ సాధనచే, యిట్టి సిద్ధులఁ బడయఁగలరు. అసలు ముఖ్యవిషయమైన, భగవంతుని దెలిసికొను విషయమును మఱచిపోయి, కృత్రిమ లాభములచే మోహింపఁజేయు మంత్రోచ్చారణలకు దిగకుండ, గురువులు తమశిష్యుల కెప్పుడును హెచ్చరిక సేయుచుందురు. కొన్ని సందర్భములందు గురు, శిష్యులిరువురును, తమ కేయే సందర్భములయం దవసరమో కనిపెట్టి యాశ్రై మంత్రశక్తుల భద్రపఱచి, వృద్ధిగాంచింతురు. ఈగ్రంథమున, శ్రీసాయి అప్పుడప్పుడీశక్తుల సైతము పరిశ్రమ మొనరించి తన స్వాధీనమునందుంచుకొని యుండుట విషయమును పాఠకు లెఱుంగుదురు. అందువలననే, శ్రీ వారి శిష్యులు వీరిశిక్షణయందే యిటువంటి శక్తుల వృద్ధిపఱచుకొని, యుందురని మనము గ్రహింపవచ్చును. ఇనుము - ఉక్కు మంచి సూదంటురాతి (అయస్కాంతము) కడనుండి, కొంతకాలమునకు దానిశక్తుల గ్రహింపకమానవు.

మహారా జంతర్గతముగ, శమదమాది షట్కమునందు గొప్ప శిక్షణఁబొందుచు, ఖండోబా దేవళాంతరమునఁ బ్రశాంతముగఁ గూరుచుండి, మానసమున కేకాగ్రత నలవరచుచున్నాఁడు. ఆతఁ డచ్చటఁ జేరిన 1, 2 సంవత్సరములలో, యోగదృష్టిని (జ్ఞానదృష్టి) భవిష్య ద్విషయ గ్రహణ

శక్తుల వృద్ధిఁగావింపఁ దొడఁగెను. ఆవిషయముల కుదాహరణముగఁ గొన్నిచ్చట వ్రాయఁబడుచున్నవి.

బంగారపు పళ్లెర బహుమానానంతరము, మహారాజప్పుడప్పుడు మసీదు కేగుచుండెడి వాఁడు. డాక్టరు చిదంబరం, తదితరులు మసీదుకడ (శ్రీ)సాయి దర్శనానంతరము ఖండోబాలయమున మహారాజునుఁ గాంచవచ్చెడి వారు. అట్టి సందర్భములయందతఁడు, తనతో నెవ్వరు చెప్పకఁ బోయినను, ఏమైనఁ గానవచ్చుటకైనగాని, వినుటకైనగాని, మసీదునకు దేవాలయమునకుఁ జాలదవ్వున్నను, మసీదుకడ నేమి జరుగుచున్నదో, విచిత్రముగఁ జెప్పెడివాఁడు.

అప్పుడప్పుడు అనేకమంది జనులచ్చటికేగుచుండెడి వారు. ఆ సందర్భములయందతఁడు వారివారి విషయముల సూచనగఁ బలుకువాఁడు. ఆజనులు మహారాజుయొక్క విచిత్ర శక్తులకు యోగమహిమకు నబ్బురపడెడివారు.

ఈ విషయములలోఁ గొన్నిచ్చటఁ జేర్కొనఁబడుచున్నవి.

సకోరీకి 40 మైళ్ళ దూరమందున్న నేవాస్ (Nevas) నివాసియు, మంచి మర్యాద గడించిన గృహస్థుఁడు నగు నరహరిలోండా (Narahari Londa)యను నతఁడు, మహారాజుయొక్కయు, (శ్రీ) సాయియొక్కయు, నత్యద్భుత శక్తుల తనకుఁ దెలియఁజేసిన విషయము నొకటి విధముగఁ జెప్పెను.

ఈ నరహరి ఒక వృద్ధునితోడను ఇంకను మరికొందరతోఁగూడి, (శ్రీ) సాయిబాబాను దర్శింప షిర్డీకిఁ బయన

మయ్యెను. మార్గమునందాతఁడు, 'బ్రాహ్మణుఁడనగు నేను మహమ్మదీయ ఫకీర్ అగు శ్రీ సాయి కెట్లు ప్రణమిల్లుదు' నని ఆలోచింపఁ దొడఁగెను. వీర లందరు షిర్డీకిఁ జేరినపిదప, ఆ వృద్ధుఁడు, తదితరులు శ్రీ సాయికడకేగి ప్రణమిల్లి దక్షిణల నొసంగి దీవింపఁబడిరి. కాని నరహరి, శ్రీ సాయి చేరువ కరుగ నున్న తరి, ప్రకోపదావానల జ్వాలాభీల, కరాళ, రక్తాక్షులతో తనవైపు శ్రీ సాయి జూచినట్లుగానఁబడ, నాతఁడు చేరువ కరుగ సాహసింపఁ జాలక నిలువఁబడియెను. అంత నాతఁడు 'తన యపరాధముల' మానసికముగ క్షమింపఁగోరెను. కాని శ్రీ సాయి ముఖముఁగాంచినప్పుడెల్ల, అంతకంతకెక్కువగ భీతి గొడమసాగెను. అందుచే నతఁడు శ్రీ వారినిఁ జేరుకొనక విరమింపుకొనవలసి వచ్చెను. అంతట నరహరి, మహారాజును గాంచి, నమస్కరించి దీవనలఁబొంద, ఖండోబాగుడి కేగెను. నరహరి సమీపింపఁగనే కాలు జాపుకొనియున్న మహారాజు కాలు ముడుచుకొనెను. నరహరి 100 లేక $15^{0}$ డిగ్రీల కోణ మేర్పడునట్లు వంగి, నమస్కరింప నున్నతరి, యింకను మహారాజు, కాళ్లుముడుచుకొని, యిట్లని పలికెను. 'నీవు బ్రాహ్మణుడవు. శ్రీసాయి దర్శనము నీవు చేసుకొనఁ జాలవు. నాతో నీకేమి పనియున్నది?' ఆతఁడు వినమ్రుఁడై తనతప్పును క్షమింప గోరెను. కాని మహారాజు, 'నాతో నీ కేమి పని?' యనియెను. ఈ విషయమువలన మహారాజు యోగదృష్టి స్పష్టీకరింపఁబడు చున్నది.

ఒకప్పు డొకయంధుఁడు, తనగ్రుడ్డితనముఁ బోగొట్టు కొన శ్రీసాయి బాబాకడ కేగుదెంచెను. శ్రీసాయిబాబా,

యాతని కేవిధమగు నుత్సాహముగాని, జవాబుగాని, యొసంగ లేదు. అందుచే నాతఁడు మహారాజు కడకేగి, తనకుఁ జూపు నిమ్మని ప్రార్థించెను. మహారాజాతనివైపుఁ జూచి, బిగ్గరగ దుఃఖించి, యిటులనియెను. "నీవు వివేకముఁగల వాఁడవు. నీవు ఇట్టి సాయిబాబా వంటి సమర్థుని (అనగా మహోత్తరప్రభావ సంకల్పుఁడై, తన భక్తులను మహోన్నత పదవికిఁ గొనిపోవు నట్టి ప్రభావముగల వాఁడు) కడ కేతెంచి, యింకనూ, నిన్ను పాపపథమునకుఁ గొనిపోవు, ఈ తోలుకన్నులఁ (బాహ్యనేత్రములు) నర్థించెదవేల? మహోత్తర ప్రభావుఁడయిన శ్రీసాయి నీకీ చూపు దప్పక నొసంగఁ గలఁడు. కాని వానినిఁ బొందెదవు. తరువాత? నీవు చనిపోవుచో, యీచర్మచక్షువులచే నేమిలాభము? కావున యీచూపుకై శ్రీసాయినర్థింపకుము. జ్ఞానచక్షువులఁ దయచేయఁ బ్రార్థింపుము. నీవు దానినిఁ గోరఁ దగిన వాఁడవు." ఈ ప్రేమమిళిత ప్రబోధనల, నాకర్ణించి, యాతఁడు, మరల శ్రీసాయి కడకేగి, యీపర్యాయము, ఆధ్యాత్మిక తెజము నర్థించి, శ్రీవారి పాదారవింద సన్నిధిని వసింప, షిర్డీయందే నిలచిన వాఁడయ్యెను. కొన్నివారములలో, ఆతని హృదయ మందిరమున జ్ఞానజ్యోతి ప్రజ్వరిల్ల సాగినది. ఒక మాసములో నాతఁడు, జ్ఞానానంద పారవశ్య మధురవాక్యములతో, యీపాంచభౌతికాంగమును త్యజించినాఁడు. ఆ మృతుని విషయమై శ్రీసాయి యిటులఁబలికెను.— "ఈతఁడు మరణింపలేదు. ఈతఁడు బ్రహ్మానంద మగ్నుఁడై, యున్నవాఁడు. ఈతఁడు శాశ్వతుఁడు. కాని యీతని భార్యమాత్రము చనిపోయినది." ఈపైవిధముగ, ప్రథమ సందర్శనముననే, మహా

రాజువలన, యీమానవుని, మరణము, ఆతనికి జ్ఞానముగలుగుటయు, భవిష్యత్తు చెప్పఁబడినది.

'జావార్ స్టేట్' రాజాయును, ఆతని కుటుంబము, పరిజనులు కొందరొకసారి, శ్రీసాయిని దర్శింప, షిర్డీకేగుదెంచిరి. ఆతఁడు మహారాజునకు, వెండిపళ్లెరములలో ఫలములు, రూపాయలు బోసి, తనసేవకుఁడగు నొకని కొసంగి, ఖండోబాలయమునకుఁ బంపెను. మహారాజాతనిఁ జూడఁగనే, యెలుగెత్తి నేడువ నారంభించి, తిట్టసాగెను. అదియేగాక, ఆపళ్లెరములను నజరానాలను లాగుకొని, దేవలాయోపరి భాగమునఁగల, కందకమునఁ బాఱవైచెను. మఱలనింకను, దుఃఖమున యాశ్చర్యపడుచున్న మర్యాదగల నాతనితో మహారాజు "ఇక వెళ్లిపొమ్ము. నీవు శ్రీసాయి మహానురాగమునకుఁ బాత్రుఁడవైతివి. నిన్నాతఁడే శాశ్వతముగఁ దనపాద సన్నిధియం దుంచుకొని దీవించఁగలఁడు." ఆవచ్చిన యతఁడు, దేవాలయమునుండి చనెను. ఎవ్వరును, మహారాజుయొక్క నిగూఢ వాక్యములను ఆతని నడవడినిఁ దేల్చలేక పోయిరి. కాని, నాల్గుదినములలో, నా మనుష్యుఁడు కలరాదగిలి, తగిలిన 4 గంటలలోఁ బరలోకగతుఁడయ్యెను. శ్రీసాయిబాబా సన్నిధియందు విగతజీవుఁడౌట బాబా తప్పకాతనిఁ దన, చరణసమ్ముఖమున శాశ్వతముగ నుంచుకొని యుండును!

మహారాజు జీవితఘట్టములలో నిటువంటి విషయములనేకములు గలవు. కాని వీనివల్లనే మహారాజు పూజింపబడుచున్నాడని చెప్పుటలేదు. ఇట్టి మహోత్తర శక్తులనేకములు శ్రీవారియం దిమిడీకృతములయి యున్నవి. నిజముగ మహా

రాజే శక్తులనన్నిటి గడించకమునుపే, యాతని గుర్వాజ్ఞా ప్రకారం మారాధింపఁబడనారంభ! ఆనాని గురుదేవుని మహా త్త్వర తపోప్రభావమే, యీవిధముగా మన కాశీనాథుని, ఒక ఆరాధనా పదార్థముగా నొనరించినది.

మహారాజ్ విషయముల గురించి, తన యుపన్యాస ములలో, నిటులఁ జెప్పెను. "విగ్రహములు, మొదటఁ బ్రతి ష్ఠింప బడునప్పుడు, ఏవిధములగు లాభములు, విచిత్రములఁ గాంచరు. కాని భక్తులు వానిని, తదేకధ్యానమునఁ బూజల సలిపి, లాభములగాంచి, యనేక చమత్కారములఁ గాంచెదరు."

ఇట్టి తపోనిలయుఁ డిప్పటికిని సజీవులయి యున్నారు. శ్రీవారినిఁ గాంచి ధన్యులుగండు!



## అధ్యాయము ౧౯

## షిర్డీ యందలి కష్టములు

చదువరీ! గడచిన అధ్యాయములయందు, పైనఁ బొందుపఱచిన యవస్థలయం దేయవస్థలైనను, ప్రత్యేకముగ ఫలాని తేదీయందున యనిగాని, షిర్డీయం దాతని నూతన శిష్యత్వ ఘట్టమున ఫలాని సమయమందనిగాని, సంపూర్ణీ కరింపఁబడినవని నిర్ణయింపఁ బడియుండలేదు. అని నీవు గ్రహింపవలసినది. ఇట్టి, క్రమక్రమముగా, వానియంత యవియే (స్వాయముగ) సక్రమముగ నొక మెట్టునుండి, యింకొక మెట్టున

కవరోహించు చున్న యంతర్గత మార్పు లెప్పుడును, సరిగ, ఫలాని సమయమున, సంపూర్ణాకృతిఁ దాల్చినదని నిర్ణయించుట దుస్సాధ్యము.

సాధారణముగ, నెక్కువమంది మహర్షుల విషయములలో, వారిజీవితకాలములో నెప్పుడు వారికాశక్తి, శీలములు, ప్రజ్వరిల్లినది తెలియక పోయినను, కొందరు పట్టుదల గలవారి భక్తులు, న్యాయముగ వారలే, ఆమహాత్ములకు దైవత్వ మలవడిన తేదీని నిర్ణయింతురు. ఇప్పుడు మనమాలోచించు విషయమున, శ్రీసాయిబాబా, యీనాల్గు వత్సరములను కోశమునందు, భవిష్యత్ మహోన్నత దశను భద్రపఱచి, వారిభక్తులను, ఆత్మీయ మహోన్నత దివ్య ప్రభావసంకల్ప బలమున శాశ్వతోత్తమోత్తమ దేవత్వమునకుఁ బట్టభద్రుల నొనరించి, ఆరాధనా పదార్థములుగా నొనరించినాడు! సాధారణ ప్రజలకీ, భవిష్యత్తు, ప్రస్తుతస్థితులు, చాలభేధ విషయములుగా, గానుపించినను, ముందు రానున్న భవిష్యత్సుభము, ప్రస్తుత స్థితియు నొక్కటని యు, అవి రెండును మహోత్తరాజ్ఞా బద్ధమై యున్నదని తలంచు దీర్ఘాలోచనాపరులకు, యీరెండు భేదములొక్కటియే. మహారాజునకు శ్రీసాయి, * పూర్వవృత్తాంతముఁ జెప్పినపిదప, భవిష్యద్విషయమైగూడ సూచనగ వాక్రుచ్చెను.

ఒక్కప్పుడు శ్రీసాయి, మహారాజుతో నిటు లనియెను.

---

* శ్రీ మహారాజుచే బహిరంగ [illegible]పఁబడిన యీ విషయమును గురించి విశదవృత్తాంతము [illegible] సారయుతయు శ్రీ[illegible] ఉపన్యాసములను లీలామృతమను గాంచుము.

సాయి:- 'నీవు చాల మొక్కలు' (లేక వృక్షములు) నాటవలసి యున్నది.

మహా:- 'అటులనే.' ఖండోబాలయమునకుఁ బ్రక్కనే చాల విడిస్థలము గలదు. తులసి మొక్కలు నాటమంటారా?

సాయి:- ఏమిటి? తులసి మొక్కలు నాటెదవా నీవు? అవి యెల్లకాలము నిలువవు. అనేక శతాబ్దములవఱకు జీవించి ప్రజలకు లాభప్రదములగు చెట్లను నాటవలె నీవు. పదునాల్గు పిప్పలవృక్షముల (అశ్వత్థవృక్షముల) నాటవలసి యున్నది. కావునఁ బిప్పల తరువుల నాటుము.

మహా:- (శ్రీ)గురువాక్యముల బాహ్యముగాఁ దలంచి ఆ దేవాలయ ప్రాంతమునకట్టి వృక్షములు పదునాల్గింటికిఁ స్థలము లేనందున) మీరేమి సూచువుచుంటిరో నేను గ్రహింపఁ జాలకయున్నాను.

(శ్రీ) సాయి:- నేను చెప్పకుండగనే, ముందుముందీవే గ్రహింపఁగలవు.

అంతట 'సాయి' శంకాయత్తుఁడయిన తన శిష్యునకు త్రాగుటకుఁ దన స్వంత 'ఛిలిం' (పొగఁద్రాగు మట్టిగొట్టము) నొసంగి, త్రాగునట్లొనరించి, ఆ విషయమం దాతని యయిష్టతను గాంచి, యిటులఁ బలికెను.

'నే నెప్పుడు నీ వద్దకు వచ్చినప్పటికిని పొగాకు ఛిలిం' నాకు నొసంగెదవా? నీవు పొగాకును తప్పకఁ గాల్చవలెను. ఎంత నీ వద్దానినిఁ గాల్చెదవో అంతకుఁ రెట్టింపు ప్రజల పాప

ములు దగ్ధీభూతములగును. వెళ్ళి ఆ దేవాలయములోఁ గూరు చుండుము. నీవు భగవద్దాసుఁడవు.'

మహారాజ్ పిప్పల వృక్షములు నాటుటయు, హోగాకుఁ గాల్చుటయు నను వీని యర్థముల కెంతయు నిదివఱకు తాఁ నెన్నఁడుఁ బొందని యనుభవాన్వేషణ మొందెను. ఇది జరిగినది 1918 ప్రారంభదినములలో నగుగా, ఆసంవత్సరమందలి గురు పూర్ణిమా దివసమున జరిగినఁ బిట్టాభిషేకమునకుఁ జాలముందు శ్రీ సాయి, పన్నుహనుమ తన ముఖ్య శిష్యునకుఁగూడ, తన వాక్యములయం దర్థమును సులభముగా స్ఫురించునటుల మాటలాడెను. అట్లనే యొక్కఁడుగూడ పిప్పలవృక్షముల నాటుట కధ్యాత్మిక శక్తివృక్షముల నాటుటనియు, హోగాకును గాల్చుట ప్రజల పాపముల దగ్ధీభూతి మొనరించుటనియు శ్రీ సాయివారి యుద్దేశ్యము!'

నిజముగ దేవతల యొక్కయు, సిద్ధుల యొక్కయు, (మహాత్ములు) సాధువులయొక్కయు (Sadhus) వాక్యములు బాహ్యమునకు విపరీతముగను, యస్పష్టముగ నుండును. శ్రీసాయి, నీ గూఢవాక్యములవలన, స్పష్టముగఁ దెలియుచున్న దేమన, కాశీనాథ మహారాజు, కొంతకాలమునకు అనేక ప్రజాసముదాయ దుఃఖనివారణ మహోజ్వల దివ్యప్రభావ కవిత భవిష్యత్తునుఁ బొందనున్నాఁడు!"

ఈ నూతన శిష్యుఁడు, అట్టిమహోత్తమ దివ్యభవిష్యత్తును పొందుటకు, శారీరకముగను, మానసికముగను, మహోగ్రాపదలతోఁగూడిన, గొప్ప పరిశ్రమ సేయవలసి

యున్నది. ఉపవాసములతోఁ బాటు, అనేకములగు, బాధల నాతఁడు భరింప వలసియున్నది. అతని శరీర మనేక వేదనానల జ్వాలల గ్రసించుచున్నది! గోడలతో మాత్రము పరివేష్టింపఁ బడిన, కఠినతరముగు నామురికి నేలపై, యాతఁడు పండుకొన వలసివచ్చెను. అందులో, వృశ్చికాదులు శాశ్వత నివాస మొనర్చుచు, పాపమప్పుడప్పు డాతనికి కొండితో, బహుమానము లొసఁగుచుండెడివి. అదియుఁగాక, ఖండోబాలయము, ఊరిబయట పొలములలోనున్న, యేకాంత కట్టడము. అచ్చటెన్న డేరాత్రియు దీపము ముట్టింపఁబడదు. పాము లెప్పుడక్కడ నిరాటంకముగఁ దిరుగుచుండును. ఒక్కొక్కప్పుడు పాములు గొంగళిపైఁ బ్రాకుచుండుటయు, ఒక్కొక్కప్పుడు, కిటికీనుండి, తనవైపు వ్రేలాడుచుండుటయు, మరియొకప్పు డాతని కాలికి విచిత్రముగఁ జుట్టుకొనుటయు, మహారాజనేక పర్యాయములు, చూచుట తటస్థించినది. కాని భగవదనుగ్రహమున వానిచే గరువఁబడక తప్పించుకొనుచుండెను.

ఇంకను, అనేకములగు ప్రాపంచిక కష్టముల మహారాజు భరింపవలసెను. ఆ దేవాలయమునొక్క స్మశానభూమి కానుకొనియున్నది. ఆ ప్రదేశమునం దప్పుడప్పుడు రాత్రుల యందుగాని పగళ్లయందుగాని మృతకళేబరములు దహింపఁ బడుచుండును. దానితోపా టచ్చొక నూయి గలదు. అందులో పీరుల పండగ యయిన పిదప, మహమ్మదీయులు తమ తబూత్ ను (Taboot) త్రోయుచుందురు. మామూలుగా నచ్చట భూతము లుండునని జనుల (కాశీనాథునకు గూడ) యభిప్రాయము. మహారా జొక్కొక్కప్పుడు విచిత్రములగు

శబ్దముల వినెడివాఁడు! విచిత్ర దృశ్యములఁ గాంచెడివాఁడు! వింతవింత యనుభవములఁ బొందెడివాఁడు! అట్టి బాధల బొందిన పిదప నతఁడు శ్రీసాయి కడ కరిగెడివాఁడు, కాని శ్రీసాయి యెప్పుడిట్లులఁ బలుకువాఁడు. 'భయ మొందకుము. ఎల్లప్పుడు నేను నీ తోడనే యున్నాను. ఇప్పుడెంత కష్ట పడెదవో, నీ భవిష్యత్తంత శుభావహమగును. ప్రపంచమంతయు నొక్క పళ్లెరమున, నీ వొక్కడవు రెండవ పళ్లెరమున.'

కాని మహారాజు కష్టపరంపరలలో దుర్భరములగు విషయము లింకను పేర్కొనఁబడుచున్నవి.

ఏ విధమున మహారాజు శ్రీసాయిబాబాను దర్శింప వచ్చిన వారలవలన పూజింపఁబడుచున్నది, వారి వలన బహూకరింపఁబడుచున్నది, తెలిసికొన్న వారలు అతని జీవితము శుభప్రదమయినదని తలంపవచ్చును. శ్రీసాయిని దర్శింప వచ్చిన యనేక ధనిక సముదాయము లిచ్చుటకుఁ జనుదెంచెడి వారు. వారిలో నొకరు కూరుచుండుటకు జింకచర్మము, త్రాగుటకు తేనియ నంపెడివారు. మహారాజు వాని నితరుల కొసఁగెడివాఁడు. కొందరు 'టీ' తెచ్చెడివారు. మహారాజు వానిని విసరి పారవైచి ఆ తెచ్చిన వారిని నిందించి, వెడలఁ గొట్టెడి వాఁడు. కాని నార్సోబాడీయును ( Narasobodi ) హస్తసాముద్రికుఁడును, డాక్టర్ పిళ్లె ( Doctor Pillai ) వంటి వారి యుద్దేశ్యముల గ్రహించువారు మాత్రమే యతని ఆదరింపఁగలరు. వీరలతో మహారాజు తన మనోవ్యాకులతను విశదపఱచెడివాఁడు. 'కొంతకాలము వఱకు, నా కష్టములు

వాని యుద్దేశ్యములు వర్ణనాతీతములుఁగా నుండును. నేనొక మొద్దుబారిన మాంద్యబుద్ధి వలె ననేక బాధలఁబడి సహించుచున్నాను. నేనే నా బాధల విశదపరుపఁ జాలను.' అని మహారాజు డాక్టరుతో చెప్పెడివాఁడు. ఆ హస్త సాముద్రికునితో 1912 నవంబరున నాతఁడిటులఁబలికెను. 'ఈరోజువరకు దుఃఖాగ్ని జ్వాలలో మ్రగ్గి వగ్గగుచున్నాను. ఇది నా భవిష్యద్దుఃఖమును తెలుపుచున్నది. నేను ఇల్లు వాకిండ్ల వదలివైచితిని. నాకు భార్యలేదు. తుచ్ఛప్రాపంచిక బంధములులేవు. నా కొక దమ్మిడీ లేదు. నా దేహము ముక్కలు ముక్కలు చేయబడినది. ధరించుట కొక శుభ్రమయిన గుడ్డపీలికయైనను లేదు. నాకు వెనుక నేను చాలకష్టపడినాను. ముందు నాకేమైనా సౌఖ్యముకూడఁ బెట్టఁబడి యున్నదా? లేక అప్పుడు గూడా శోకోపహతుఁడ నేనా!'

1912 లో నీతనిస్థితి యీవిధముగా నున్నది. 1913, 1914 లోగూడ నాతని స్థితిమారి యుండలేదు. ఆ గ్రామస్థులాతనిఁ బిచ్చివానిగ నెంచి, ఆతనిపై నిర్దాక్షిణ్యము చూపసాగిరి. కొందరాతనికిని, శ్రీసాయినికిని గల యనురాగ బంధమున కసూయాపరులైరి. ఆతఁడు వసించిన మూడవవత్సరమున, ఇంకను, కొన్ని విషయములు జరిగినవి. ఆగ్రామమందలి బాలకులు ముఖ్యముగా మహమ్మదీయ బాలకు లాతనిని పిచ్చివానిగనెంచి, పాపము! ఆతనిపై రాలు రువ్వి మురికి పదార్థముల జల్లెడివారు. పెద్దలును, భక్తులు నగు మహమ్మదీయులు సామాన్యముగా పిచ్చివారినేమియు సేయరు. కాని యువకులగు మహమ్మదీయ పిల్లవాండ్రు 'మహారాజుయొక్క ఆపదల

నెమరించని పద్ధతి' వలన ప్రోత్సాహ చిత్తులై, నిర్దాక్షిణ్యా ద్యప్రవర్తనులై, అప్పుడప్పుడచ్చట కరుగుదెంచి, మహా రాజును కఠినముగ బాధించెడివారు. వారిబుద్ధిని మాన్పుటకై పాప మాత్రము కథలఁ జెప్పెడివాడు. ఈ క్రిందివిషయ మీ పిల్లలు జేయుపనులు జూపుచున్నది.

ఒకనాఁడు 10 నుండి 20 సంవత్సరములు లోపుగల కొంటెపిల్లలు, కొన్నికుండలు నిండ, మనుష్యులు, పశువులు, విసర్జించిన మలపదార్థములఁగొని, మహారాజు కడ కరుగుదెంచిరి. ఆదుర్మార్గులలో నొకఁడాతనితో నిట్లనియె— "సంగ్ ఆడ మనిషీ, ఎందుకీవేళ మూగతనం దాల్చావు?" అని యాకుండలవైపు చూపుచు, "సంయ్ బాబా! ఇదిగో మిఠాయి నీ కొఱకు." ఇంకొకఁడు పరిహాసముతో, "అవి కొంచె మాతని నోటిలోఁబెట్టు, అప్పుడు మాట్లాడుతాడు!" అంతటా రాక్షస బాలకు లాతని నేత్రములనుండి నిశ్శబ్దముగాఁ జారుచున్న బాష్పకణముల యందర్థమును గ్రహింపక, ఆబాలకులు మొదట కొంచె మామలపదార్థము నాతనిపై వేసి, మరికొంత నోటియందుంచిరి. పాపము! కాశీనాథమహాసీయుఁ డద్దాని నుమియలేదు మ్రింగలేదు. కొంతవఱ కాతఁడామలపదార్థము నోటిలో నుంచుకొనియు, నేత్రములనుండి, యశ్రువులఁ గార్చుటఁగని ఆదుర్మార్గ బాలు రాతని చుట్టు గంతులువైచి, పరిహాసములాడి, తమాషాలొనరించి, ఎగతాళిఁ జేసిరి. ఇట్టి పరిహాసము లొకయర్ధగంటతడ వొనరించి, గుడి ప్రతిధ్వనించునటుల కేకలు వేసి, వెడలిపోయిరి. వారలాతనిని వదలినపిదప, మహారాజా పదార్థము నుమిసివేసెనేగాని, ఆదుర్మార్గుల శిక్షించు

టకు గాని, వారివిషయ మెవరితోనైనఁ జెప్పుటకుగాని ప్రయత్నించలేదు. 'కష్ట అపదలయందు స్థైర్యము' మహారాజు యొక్క నడతయందలి గొప్పపద్ధతులు.

ఆ యర్భకులు మరల వచ్చుటకు ప్రారంభించిరి. మహారాజు వీరి బాధలను తప్పించుకొనుటకై సరిగ శవములఁబూడ్చు గోతివలె నొక గుంటఁ ద్రవ్వి (నిజముగా నాస్థలము సైతము స్మశాన స్థలమే) అందులోఁ దాను పరుండి దానిపై తనంతట తానే కొన్ని కంపముండలఁ గప్పుకొనియెను. పిల్లలద్దానిని దాటి యాతనిఁ జేరఁజాలక వెడలిపోయిరి. తదనంతరము కొందరు శ్రీసాయిని దర్శింపవచ్చిన వారలు ఇచ్చట కరుదెంచి ఆ గోతిలోఁ గంప కప్పుకొని పరుండియున్న మహారాజును గాంచి యాశ్చర్యపడిరి. వా రాతనినిఁ బిలచిరి. కాని పలుక లేదు. ఆతని మాహాత్మ్యమునకుఁ భీతిఁజెంది మొదటి దిన మాతని యుద్యమమున కడ్డురాలేదు. మరునాటి దినమున నిర్దాక్షిణ్యత్వము సూపఁజాలక యెవ్వరో కొందరు మహనీయులు లేక (సజ్జనులు) ముండ్లమండలఁ దొలగించిరి. అంతట మహారాజు తన గోతినుండి లేచినవాఁడయ్యెను. మంచి యుద్దేశ్యముల తోడనే కొందరు జను లప్పుడప్పు డచ్చోటికి కరుదెంచి ఆతనిని తొందర పెట్టెడివారు. **1913** నవంబరు మాసమున బాబు సాహెబు జోగ్ (Babu Sahab Jog) అను నతఁడు (పదవిని చాలించుకొనిన లేక పింఛను పుచ్చుకొనిన యింజనీయరు) మహారాజు యొక్క దీర్ఘోపవాసమునకు జాలిఁజెంది

ఆతని కొఱకు ఆహారముఁగొని (శ్రీ సాయిబాబాగారి యొప్పుదలతో) ఖండోబాలయ కవాటములఁ దట్టెను.

మహా– ఎవరు ?

బా–జా:– నేనే! సఖారాంను. ( Sakharam ) బాబాగారి యనుజ్ఞానుసారముగ నీ కాహారము దెచ్చితిని.

మహా:– (విసుగుతోఁ గూడిన కోపముతో) వెళ్ళిపో.

భీమాబాయి:– తలుపుఁ దెరువు, బాపూసాహెబ్ జోగ్ నీ కాహారముఁ దెచ్చియున్నాఁడు. లేచి యీ యాహారముఁ గొనుము, అని ఆమె తలుపు నెట్టినది.

మహా: రాజాగ్రహముతో నామెను కొట్టెను. బాపు తొందరపాటుతో సహాయముగా నుంచుకొనంత దవ్వుల నిలువఁబడి యిట్లనియెను.

బాపు:– శ్రీ సాయిగారి ఆజ్ఞానుసారముగ మేము నీకు నైవేద్యముఁ గొని తెచ్చితిమి. దీనిని నీవు తప్పకఁ దినవలయును.

మహా:– అందువలె నీవు కూడ నక్కలకుఁ గాకులకుఁ బెట్టుము.

బాపు:– నీ కొఱకు తెచ్చినది కాకులకుఁ గాదు.

మహా:– ఆ కాకాదులకు నాకు భేదములేదు. వానికిఁ బెట్టితే నాకుఁ బెట్టినట్లు–

బాపు:– ఈ వేదాంతము నాకుఁ దెలియదు. నీవు తినెదవా తిను. లేకపోయిన తీసుక పోయెదను.

మహా:- (కోపముతో) వెళ్లిపొమ్ము. కుక్కలకుఁ గాకులకుఁ బెట్టుటకు నీకిష్టము లేకపోతే వెళ్లిపో.

బాపు:- నీకొఱకే మేము తెచ్చినది నైవేద్యము.

మహారాజాగ్రహోద్యత్త చిత్తుఁడై ఆతనిపై నొకచిన్న యిటుక రాతి ముక్కను విసరి ఆతని భుజమునకు గాయమొనరించెను.

అంతట బాపు చేరువనున్న జను లీ మహారాజును లాగి త్రాళ్లతోఁ గట్టి మసీదు కడనున్న శ్రీసాయి వద్దకుఁ దీసుకొని పొండని చెప్పెను. మహారాజు త్రాళ్లతోఁ గట్టఁబడియెను. బాపూ గృహముకడ కొంత తడవు నిలువఁబెట్టిన పిదప మహారాజు శ్రీసాయికడకుఁ గొనిపోవఁబడెను. శ్రీసాయి వారలతో "ఆతఁడు దైవాంశసంభూతుఁడు! ఆతని నెవ్వరు బాధింపకుఁడు" అని యాతనికట్లు విప్పుట కాజ్ఞాపించెను. మహారాజుతో "నీవు ప్రశాంతముగఁ గూర్చుండవలయును. నీగుడి కేగుము" అని వాక్రుచ్చెను.

షిర్డీలో నానావాలీ (Nanawali) యను నొక స్థూలకాయుఁడును, పొడగరి యగు బ్రాహ్మణుఁడు మహారాజును బాధించుటకు బయలుదేరెను. ఆతఁడు పిచ్చివానివలె నుండువాఁడు. ఆతని బాహ్యచేష్టలు పిచ్చివానిని పోలియుండును. అనేకోపాయములఁ బన్ని మహారాజును బాధించెడివాఁడు. ఖండోబాలయమున కరిగి, రాత్రులయందుగాని పగలుగాని ఎప్పుడైనను సరియే తలుపుదట్టి పాపము మహారాజును నిద్రపోవు నప్పుడుగూడ భంగపఱచెడి వాఁడు. అతఁడు సంపూర్ణముగ కాశీనాథుని పూజసలుపుటకు వచ్చినవారలనుగూడ

చెడగొట్టెడి వాఁడు. బురద, మురికి మొదలగు మలినపదార్థ ములఁదెచ్చి మహారాజుపైననో, గుడిలోని నేలపైననో చల్లెడి వాఁడు. ఒకప్పు డతఁడు మహారాజు ధరించిన ఏకవస్త్రమును లాగి, అనేకమంది సముఖముననేగాక శ్రీసాయి సమక్షమునఁ గూడ దిగంబరిగా నిలువఁబెట్టి ఆతనిచుట్టు గంతులువైచెను. ఒక్కొక్కప్పు డతఁడు మహారాజును అనేక పర్యాయములు 'కూర్చొనుము, లెమ్ము' అని ఆతని మోకాళ్లు కలకలు పుట్టు నంతవఱకు బాధించెడువాఁడు. ఒకప్పు డాతఁడు మహారాజు నొకత్రాటితోఁ గట్టివైచెను. అప్పుడప్పు డతఁడు కాశీనాథు నితో నమర్యాదగను, పరిహాసముగను మాటలాడెడివాఁడు! మహారాజు వీనినన్నిటి నోర్పుతో ప్రశాంతముగ భరించెడి వాఁడు. అతఁడుగూడ నొక బ్రహ్మనిష్ఠుఁడు. పరుల నిర్దాక్షి ణ్యతవలన మహారాజు కష్టములు మరింత దుర్భరములయినవి. అతఁడు వానవాలిచేతను, బాహ్య జనులచేతను బంధింపబడి నప్పుడు ఒక్కఁడుగూడ వలదని చేయడ్డు పెట్టిన పుణ్యమున బోవలేదు. శ్రీసాయి కొందరు భక్తులుతప్ప తదితరులెల్ల రసూయావేశులై యుండిరి. ఒక్కొక్క సమయముల యం దాతఁడు "ఈప్రపంచములో ఘోరనరకమయిన యీప్రదేశ మున శ్రీసాయి నన్నుంచి ఏమిచేయనున్నాఁడని" యూహింపఁ జాలక పోయెడివాఁడు. ఒకప్పుడు (జూలై **1913**) గొప్ప నవలాకారుఁడయిన హెచ్. యన్. ఆప్టే (H. N. Apte) అచ్చటి కరుగుదెంచెను. అప్పుడు మహారా జాతనితో తనహృదయ భారమును నివేదించి 'నేనింక చాలకాలము జీవింపఁ జాల ననియు నాబంధువుల నొకపర్యాయము కడసారిచూపు జూచి

పోఁగొట్టఁ గలుగనియు’ చెప్పెను. ఆనవలాకారకుఁడు పునహాలో నున్న యూతని సోదరుఁడైన బాలకృష్ణశాస్త్రి కొక లేఖను వ్రాసెను. ఆయుత్తరముపై వాఁడరుదెంచి మహారాజు నోదార్చి యరిగెను. తదనంతరము కొన్నాళ్లకు మహారాజు జనని తనకుమారునిఁ గాంచ షిర్డీ కేతెంచినది. షిర్డీయందామె నెవ్వరి నెఱుంగదు. ఎవ్వరామె నెఱుంగరు. అప్రయత్నముగ శ్రీసాయిబాబా కడకరుదెంచినది. వెంటనే శ్రీసాయి తనచేరువఁ గూరుచుండఁ బెట్టుకొని స్వహస్తమున ఆమె నొసటియందు పవిత్రమగు విభూదినలది తనచేరువనున్న జనులతో "ఈమె యొక మహోత్తమ పుణ్యాత్మురాలు." అని యస్పష్టముగఁ దెలియఁజెప్పె నొక్క వాక్యముగూడ నామెవచ్చిన విషయమై యడుగక ఆమహాతల్లిని ఖండోబాలయమునకుఁ బంపినవాఁ డయ్యెను.

మార్గమున జనులామెను "ఆగుడిలో నొక పిచ్చివాఁ డున్నాఁడు. ఆతఁడు తనచెంతకు వచ్చినవారిని పైనఁబడి కొట్టు"నని ఖండోబాలయమునకుఁ బోవలదని చెప్పిరి. తన మాతృవాత్సల్యమున యవి లెక్కఁగొనక ఖండోబాలయ ద్వారముకడ కేగి, తలుపుఁ దట్టినది. "ఎవరు?" అని లోపల నుండి కరఘట్టనధ్వని వినఁబడినది. "నేనే తండ్రీ!" అని జవాబు చెప్పినది జనని. ఒక్కత్రుటిలో మహారాజు తలుపుఁ దెఱచి తన ప్రేమనిలయమగు వృద్ధజనని హృదయమునకు హత్తుకొని కౌగలించి ఆనంద బాష్పముల విడచెను. ఆమహాతల్లి వెడలి పోయినది. మరల మహారాజు కమములు "నీటిపెగల పాచి

చేతితో నెట్టినప్పుడు ప్రక్కకుఁ బోయి వెంటనే మరల క్రమ్ము కొను" నట్లుయథాస్థితి క్రమ్ముకొనినవి.



## అధ్యాయము ౨౧

### అజ్ఞాతవాసము

1914 జూలై నాటికి మహారాజునకు షిర్డీ అజ్ఞాతవాసము యందు కష్టము లధికమయ్యెను. అదే సమయమునను నా. షిర్డీ గారి స్నేహితుడగు గణపతిరావు మహారాజును తనవద్ద కొంత కాలము సింధీలో నుండవలసినదిగా కోరెను. గురుని యాదేశము ననుసరించి మహారాజును గుప్తవాస మొనరింప దలచియుండెను. అందుచే నాయన గణపతిరావు వెంట నగుటకు నియ్యకొనెను. 1914 సం॥ జూలై 15 వ తేదీన యర్ధరాత్రము దాయన మనసు నందే గురువగు సాయివద్ద సెలవుతీసుకొని షిర్డీవీడి సింధీకి జనెను.

చిరకాల ముపవసించియుండి ఒక్కుమ్మడి యాహారము మార్పుకాగానే యాయనకుఁ 'శూలవ్యాధి, మూలవ్యాధియు' జనించెను. నివారణకు శస్త్రచికిత్స యావసర మయ్యెను. వార్ధా నుండి యొక శస్త్రచికిత్సకుడు డరుదెంచి 'మత్తు మందిచ్చినగాని చికిత్స చేయుటకు వీలులే' దనెను. కాని మహారాజు మానసిక శక్తి కసాధ్యము లేదని నుడివి చికిత్స చేయుమనెను. ఆశస్త్ర చికిత్స సుమారు 30 నిముషములు పట్టెను. ఈ దీర్ఘసమయ

నం దాయన ఈషన్మాత్రమైనను బాధను వ్యక్తమొనర్పక చికిత్సకునకు ధైర్యము చెప్పుచుండెను. చికిత్స సమాప్తమయిన పిదప నాచికిత్సకునకును, మహారాజునకుగల శారీరక విజయమును వేనోళ్ల బొగడుచు సాగిలి మ్రొక్కెను.

సింధియందు కొలది వారములుండి మహారాజు నాగపురము డా॥ పిళ్లేగారి యింటి కరుదెంచెను. అచ్చట మహారాజు బ్రాహ్మణుల యిండ్లలో మధుకర మొనర్చెడివాడు. నాగపుర వాసుల కితడు పూర్వము పురోహితుడై యుండినను ప్రస్తుత మాతనియందు గలిగిన మార్పుచే నెవ్వరును యాతని గుర్తింపజాలరైరి.

ఒకరోజున రాత్రి 8 గం॥ లకు మహారాజు చేత నొక కుండ నిడుకొని చింపిరి గుడ్డల ధరించి ఒక బ్రాహ్మణుని యింట భిక్షమడుగ నేగెను. ఆ బ్రాహ్మణుడీతని నొక దొంగగ నెంచి భిక్షకు బదులు ప్రహారణము లొసంగి పంపెను. ప్రతి దినము మహారాజు భైక్ష్యమందు గొంత ప్రసాదరూపముగ పిళ్లే పరివారము గ్రహించుట యలవాటు. నాడు ప్రసాదము నొసంగి మహారాజు "తనకు నేడు ప్రహారప్రసాదము లభించె" నని నుడివెను. వారలాయన భావమును గ్రహింపజాలరైరి. అంతమునకు మహారాజు సవిస్తరముగ నంతయు దెలిపెను. మహారాజు మాటలు వినినంతనే వారా బ్రాహ్మణ గృహస్థుని శిక్షింప నుద్యమించి, యాతని నామధేయ మడిగిరి. కాని మహారాజు నాటిసంఘటనను కేవలము వినోదముగ భావించి, యాబ్రాహ్మణుని నామధేయము తెలుపలేదు.

**1914** వ సంవత్సరము అక్టోబరు **2** వ తేదీన ఆయన నాగపురమునుండి ఖర్గపురమునకు రైలులో బయలుదేరెను. నాగపురమునుండి ఖర్గపురము జేరుటకు **40** గం॥ ల కాలము బట్టును. ఈ సుదీర్ఘ సమయమంతయు మహారాజు కూర్చున్న ప్రదేశము నుండి కదలక ఒక్కమారైనను మలమూత్ర విసర్జనకైన లేవక మాట్లాడక ప్రయాణమంతయు జేసెను. మహారాజునకుగల ఇంద్రియ విజయమునకిది యొక ప్రమాణము.

ఖర్గపురమున డా. పిళ్లై సోదరుడు 'చినపిళ్లైస్వామి' మహారాజును తనయింట గుప్తాతిథిగా నుంచెను. ఎవరైన ప్రశ్నించిన మతిభ్రష్టుడగు రోగియనియు డా. పిళ్లై యాతని నిచ్చటకు బంపెననియు, దెల్పుచుండెను. రెండు నెలలవరకు మహారాజు నెవ్వరును గురుతించలేదు.

మహారాజునకొక పదియేండ్ల మహారాష్ట్ర బాలికపై ననురాగము మెండయ్యెను. ఆయన ఆమెను పుత్రికాభావమున దరిజేర్చి సమయసమయములందామెకు చిన్నిచిన్ని చక్కని కథలను చెప్పదొడగెను. ప్రజలకీవిషయము తెలిసి మహారాజు చుట్టు మూగసాగిరి. **1914** వ సంవత్సరమున షిర్డీయందు కూడ నిటులే జరిగెను. మహారాజు "మీరందరిటుల మూగుట యప్రశస్తమని" వారలకు దెలిపెను. కాని జనులుమాత్ర మాయన నొక యసాధారణ పురుషునిగ భావించి, గుమిగూడుచునే యుండిరి. మహారాజు తానొక "యున్మత్తుడ ననియు, యోగికాని మహాత్ముడుకాని గాననియు" నెంత చెప్పినను వినక పగలు స్త్రీలు రాత్రిపురుషులు మహారాజునకు సాధన కాటంకము కలిగించుచునే యుండిరి. మహారాజు ప్రజ్ఞ యంద

రకు వెల్లడియయి జనులందరాతని దైవమువలె బూజింప సాగిరి.

మహారాజును సాయియు తాము జీవించి యుండునంత వరకు తమ్మెవ్వ రారాధించ కూడదని తలంచిరి. కాని వారెంత యాటంక పరచినను వారియారాధన జను లధిక భక్తిప్రపత్తు లతో చేయుచునే యుండిరి.



# అధ్యాయము ౨౧

## ఖర్గపురమున బాబా ఖ్యాతి

ఖర్గపురమునం దుండినపుడు మహారాజు తన గది నతి మురికిగ నుంచుచు మురికిగనుండు నొక పనస చెట్టుక్రింద కూర్చుండెడివాఁడు. స్త్రీలందరాయన కభ్యంగనస్నాన మొసర్ప నాయన రొమ్ముపలినిండ బూడిద రాసుకొనియు నారోసంగు నై వేద్యాదుల నిరాకరించియు వారికెంతయు విసుగుపుట్టించెడి వాఁడు. ఒక్కొక్కప్పు డాయన మరుగుదొడ్ల నూడ్చుటకు బోయెడివాఁడు. ఆయన ఎట్టిపను లాచరించుచున్నను ఆ భక్త స్త్రీ బృంద మాయన నారాధించుచునే యుండెను. ఒకప్పు డాయన స్త్రీలతో "తనదేహమునగూడ నొకమరుగుదొడ్డి గలదనియు నారాధించునది యొక మరుగుదొడ్డి యనియు తెలిపెను." నేటినుండి మరుగు దొడ్లనుగూడ నారాధింపుడన వారును అంపుల కియ్యకొని యటులే యొనర్చిరి. ఇదియేకాక ఆయన పిల్లెగృహమును వీడి తరచు 'భగ్గను' పేరుగల నొక

కూలివాని యింటను పాకీవారల యిండ్లయందును వసింప జొచ్చెను. కాని యాయన నారాధింప బ్రాహ్మణాది అగ్రిమ కులజులు వెంటాడుచునే యుండిరి. ఇతర జాతి బాలికలను అలంకరించి ఆయన కుమారీపూజ సల్పుచుండెను. అతని మాట లతని శిష్యులకు వేదములు.

కుత్సిత సందేహముల గూర్చి యాతని సిద్ధాంతము లతి విచిత్రములు. నిమ్నజాతుల సాన్నిధ్య మపవిత్రమనియే అతని భావన. కాని సత్పురుష సాన్నిధ్యమందు వారి నైచ్యత యంతరించి అగ్రిమ జాతులతో సమానత్వ మందెదరని యాతఁడు తరచు తెల్పుచుండువాఁడు. సత్పురుషసాంగత్య మొనర్చుచు స్వకులాచార ధర్మములను నిర్వర్తించిన హరిజను లీజన్మమందే యుత్కృష్టస్థితి నందఁగలరు. ఖర్గపురమందలి హరిజనులకు మహారాజువలన ననేక సౌకర్యములు చేకూరెను. మహారాజు భక్తులు వారిని మిగుల నాదరించసాగిరి. మహారాజున కస్పృశ్యులతోఁగల సంబంధము సీమితము. ప్రస్తుత దేవాలయ ప్రవేశాదుల నాయన యంగీకరించలేదు. మహారాజు వలన తమకుగలిగిన సాంఘికోత్కృష్టతను గాంచి హరిజను లందరు మహారాజుయెడ నతిగౌరవభక్తుల ప్రకటింపఁ జొచ్చిరి.

ఖర్గపురమునందు మహారాజు తన్ను బూజింపవచ్చిన భక్తుల ననేకుల కొట్టియు తిట్టియు విసుగుకొనుచుండెను. అయినను భక్తులందరిది యాతని యనుగ్రహమనియే భావించుచు బలిని దండించు త్రివిక్రమునితో ప్రహ్లాదుడుకూడ "తత్త్వజ్ఞునకు మహేంద్రత్వమేల?" యని పలికె వామనకృతమగు బలి

దండనను శ్లాఘించెను. మహారాజు భక్తులుకూడ మహారాజు దండించిన, అనుగ్రహమనియే భావించెడివారు.

ఇట్టి యభిప్రాయము లీ దేశమున ననేకములు "ఒక రాతిపై కూర్చుండియున్న యతి ననేకులర్చింప యాతడు రాలు తప్ప వేరొండు తనవద్ద లేదని తెల్పుచు వారలమీద రాలు రువ్వి ఇదియే ప్రసాదము గ్రహింపు"డని చెప్పెను. భక్తిహీనులు వాని నచట బారవైచిరి. "భక్తులు మహాప్రసాదమని స్వీకరించి గృహమునకు గొంపోవ" నవి స్వర్ణమయములై యుండెను. యతుల, సంన్యాసుల క్రోధమునుకూడ ననుగ్రహమేనని తెల్పుట కిట్టి గాథ లనేకములు గలవు.

మహారాజు చరిత్రమునగూడ నిట్టివనేకములుగా గలవు. ఆయన తనచే గొట్టఁబడిన తరువాత సాకోరిలో పురోహితుడుగ నున్న 'బపూసాహెబ్ జోగ్'న కొక గొప్ప సమాధిని గట్టించి దానిపై నొక దేవాలయమునుగూడ కట్టించి, పూజాదికముల నప్పుడప్పుడు సల్పుట కేర్పాటు గావించెను. ఇంతియ గాక ఆయన తనచే గొట్టబడిన వారలకు వృత్తులను గల్పించి సంపదల నొసంగుచుండెడివాడు.

మహారాజు తన శిక్షాకాలమందలి నాల్గవ సంవత్సరము జనుల గౌరవా గౌరవముల నంతక ఉదాసీనముగ గడుపనెంచెను. కాని ప్రజ లతని యారాధన విడువలేదు. స్త్రీలు "సూర్యు నరచేత మూయు టశక్యమని" చెప్పుచుండెడివారు. అందుచే శిక్షాకాలము ముగియకుండగనే ఆయన యొక సద్గురువు వలె చరింపజొచ్చెను.

మహారాజు నమ్రతచేఁ గలుగు లాభములను ప్రజలకు సప్రమాణముగ జూపి సదా నమ్రులై యుండుడని యుపదేశించెడివాఁడు. ఒకప్పు డాయనచెంతకు విద్యాగర్వితుఁడగు "దామోదరపంతు మరికొంద రుద్యోగులతో నేతెంచి" తనకు భగవద్గీత నుపదేశించుమని ప్రార్థించెను. అందులకు మహారాజు "తా నొక నచ్చటి బాలికవద్ద భగవద్గీత నుపదేశ మందితి ననియు, ఆమె గీతను శిరస్సునందుంచుకొని నీటమునుగుమని యాదేశించె ననియు, తానట్లొనర్చితి ననియు, ఇంతకు మిక్కిలి వేరేమియు తనకు తెలియదనియు" నుడివెను. అందులకు పంతియ్యకొనక "తామట్లు తప్పించుకొనఁ జాలరు గీతనుబోధింపక తప్పద"ని బలవంతముచేయ మహారాజు "గీత నెవరికెవ రుపదేశించిరో తెలుపు" మని ప్రశ్నించెను. పంతు "కృష్ణుఁడర్జునున కుపదేశించె" నని సమాధానము చెప్పగా మహారాజిట్లు చెప్పెను. "మంచిది. గీతోపదేశ మందవలెనన్న యుపదేశకుఁడు కృష్ణుఁడుగను, శిష్యుఁ డర్జునుఁడుగ నుండవలెను. నేను కృష్ణుఁడనని యనుకొనను. అర్జునుఁడన వ్యర్థుఁడు. మొదట నీవర్జునుఁ డవయిన పిదప నేను కృష్ణుఁడ నగుదును. నీవర్జునుఁడవు కాక యహంకార మమకారములను త్యజింపకున్నంత వరకు గీతోపదేశకుఁడగు కృష్ణుఁడు నీకు లభింపఁజాలఁడు.

తనభక్తులకు మహారాజు ఓరిమి, సంతుష్టి, విరక్తి కలిగి యుండుమని యుపదేశించుచు యమునాబాయియం దీగుణము లధికముగ కలవని తెలుపుచుండెను.

యమునాబాయియు నామె భర్త వినాయకరావును మహారాజు నధికభక్తి ప్రపత్తులతోఁ బూజింపుచు నిత్యము నైవేద్యాదుల నర్పించెడివారు. తొలిదినమున యమునాబాయి నైవేద్యము నర్పించుటకు మహారాజు వద్దకురాగా మహారాజు "మనకున్నదానితో తృప్తి నొందవలె"నని చెప్పి ఏడ్వ మొదలిడెను. ప్రతిదిన మిటులే జరుగుచుండెను. మహారాజు యొక్క ఈకృత్య మెవ్వారికిని బోధపడలేదు. ఇట్లు జరిగిన యొకనెల లోపలనే యామె భర్త మరణించెను. యమునా బాయి భర్తయొక్క మృత్యుసమయమున మహారాజు తనకు నసము నొప్పిగ నున్నదని బాధపడుచు భగ్గు (కూలివాఁడు) గృహమున నుండెను. యమునాబాయియు దనకు మనశ్శాంతి జేకూర్చుమని బాబాపాదముల చెంత కరుదెంచి యాతని పదముల వీడకుండెను. అప్పుడు మహారాజు "పరమేశ్వర సంకల్పమునకు తిరుగులేదు. దానిని మనము మార్పజాలము" అని సమాధానమిచ్చెను. అనంతరము కొలదిరోజుల కామె కుపదేశ మిచ్చి మహారాజామెకు మనశ్శాంతిని కలుగజేసెను. యమున మహారాజు నర్చించుటకు వచ్చుసమయమున కామె భర్తకెట్టి దుగ్నతయు లేకుండెను. బాబా త్రికాలవేది గనుకనే యామృత్యు విషయమును గురితించి యటుల దుఃఖించెను. ఈ సంఘటన జరిగిన మీాదట స్త్రీబృందమునకు బాబా యెడ గల భక్తి యినుమడించెను.

శిక్షాసమయమున మహారాజు తనభక్తుల ముక్తుల కొనగూర్చు బాధ్యత తనయందిడుకొని—

"అంత్య కాలేచ మా మేవ, స్మర న్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావం, యాతినా స్త్యత్ర సంశయః॥
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్య త్యసంశయః"
—శ్రీమద్భగవద్గీత

(మరణకాలమున నన్ను చింతించువారలు నన్ను చేరు దురు. ఇందుకు సందియు మావంతయులేదు. మదర్పిత మనస్కుడును, మద్గతచిత్తుడును నన్నే పొందగలరు.)

అనుశ్లోకార్థము ననుసరించి చరించెడివాడు.

శ్రీధరపంతుసింగవేకారను నాతడు బాబా భక్తులయం దతి విశ్వసనీయుడు. ఆత డొకప్పుడు జబ్బుపడెను. అంత నాతడు తనబంధువులతో "దన్నెట్టులైన మహారాజు వద్దకు గొనిపొమ్మనియు, అటుల గానియెడల బాబాను తనవద్దకు బిలువవలె ననియు తెల్పెను." తాను వచ్చుచుంటినని నిత్యము బాబా కబురంపుచుండెను. ఒకనాడు బాబా "తాను రోగి గదిలో నుంటిననియు తన్నుచూడ వచ్చుననియు" కబురంపెను. ఈవిషయము తెలిసినంతనే సింగవేకారు మాత్రము బాబాను గాంచగలిగెను. ఆతఁడనన్యచింతతో ప్రాణములవిడెను. అనం తరము భక్తులందరు "మహారాజుగూడ శ్రీసాయి యు శమని" వేనోళ్ల చెప్పుకొనదొడఁగిరి.

బాబా గురుపదవిని స్వీకరించినది మొదలుగ నాయన తనభక్తుల కనేకనీతుల దెలుపుటయేగాక హిందువులకు వారి వారి కులాచార ధర్మములను దెల్పుచు నందలి గూఢభావము లను చమత్కారముగ వ్యక్తీకరించి హెచ్చరించు చుండెను.

ప్రపంచము పరస్పర విరుద్ధవస్తు సముదయాన్వితము. బాబా విషయమునగూడ నాతనిభక్తు లుండుచోట నాతని విరోధులకును గొదువలేకుండెను. ఖర్గపురమున స్త్రీలాదరించిదిగంబర సంన్యాసిని బూజించుటయు యభ్యంగన స్నానము నొనర్చుటయు గని కొందరాతని బాధింప సమకట్టిరి.

**1915** వ సం॥న ఆషాఢ శుద్ధ విదియనాడు రాత్రి కొందరు దుండగులు చేతదివ్వెలబూని బాబా నవమానింప నరుదెంచిరి. అప్పుడు బాబా తనవసారాయందు స్త్రీలందరు చుట్టువారుకొనియుండ వారలకు నీతులను ధర్మములను నుపదేశించుచుండెను. దుండగులరాక గాంచి లక్ష్మిబాయి ఖాన్వీస్ సందేహించి బాబాకీవిషయము దెల్పెను. అంత బాబా స్త్రీలతో “మీరెవ్వరును భయపడవల”దనెను.

దుండగులు బాబానుగూర్చి ప్రశ్నించ, బయటగలభక్తులు ‘వారు లోన గలరు’ అని చెప్పిరి. వారు లోనికేతెంచి నల్గడల గాలించిరి. కాని వారి కందేమియు గాన్పింపలేదు. ‘మేమిప్పుడే బాబాను దర్శించితిమి. ఇంతవర కాయన మాతో ముచ్చటలాడుచు నుండెను. ఆయన ఆవసారాయం దుండిరి. మీామనములు బరిశుద్ధములైన బాబాగన్పింప కుండుటకు గారణము గాన్పింపదు. మరల పోయి చూడు’డనిరి. వారు లోనికిబోయి జూడ బాబా ఎందును గాన్పింపలేదు. వారు నిరాశులై తమ నివాసములకు మరలి చనిరి.

ఇటస్త్రీలీచోద్యముఁ గాంచి ‘ఇదేమి మాయ! అందర మదృశ్యులమైతిమే!’ యని పలుకదొడఁగిరి.

1915 శ్రావణమాసమున కూర్వమే బాబాభక్తు లనేకులు విరోధులు కొలదిమందియు గలరు. ఉత్కృష్టత నొందుట కీయిరు తెగ లవసరమని బాబా భావన. తన్నుబాధించు వృశ్చికాది విషజంతువులు, దుష్టబాలురు, వీరిని గూర్చి యీయన ఎన్నఁడూ నోరిని పిడతేడు. ఆయన తరచు "సాధ్యమగు నంత వరకోర్పు వహింపుము. సాధ్యము కానియెడల నాచోటు విడుము," అని చెప్పుచుండువాడు.

1915 ఆగష్టు నాటికి ఖర్గపురమందలి దుండగుల దుండగము లధికమై పోలీసుల కక్షిల నాపఁదొడఁగిరి. దిగంబరియై స్త్రీల సేవల గొనుటయు నతని మూలమున ప్రజలిరుతెగలై శాంతి భంగమగుటయు గాంచి, బాబాను ఖడ్గపురమునుండి దూర మొనర్ప నొక రక్షకశాఖాధికారి యొకనాఁడాయన చెంతకరుదెంచెను. అప్పు డాతనివెంట నాతని కుక్కగూడ కలదు. అప్పుడు మహారాజును బరివేష్టించి యనేకులు స్త్రీలు పేదల కన్నదాన మొనర్చుట కధికముగ పచన మొనర్చుచుండిరి. అందరును శాంతిగ తమతమ పనుల జేయుచుండిరి. ఇదిగాంచి యాకర్మచారి అర్జినంపినవాఁడు దెల్పిన కారణములిందేవియు గోచరింపవని తలంచి నిజనివాసమునకు మరలెను. పోవునపు డాతఁడు కుక్కసంగతి మరచెను. కొంతదూర మరుదెంచగనే యాతనికి కుక్క జ్ఞప్తికి వచ్చెను. అతడు బాబాతో సంభాషించునపు డాశ్వానము మహారాజు పాదములచెంత నుండెను. కర్మచారి మరల బాబాచెంత కేగుదెంచి "నాకుక్క ఏది?" యని ప్రశ్నింప బాబా "అది ఇంటికి పోయెను." అని చెప్పెను. అతఁ డిదేమి చిత్ర మనుకొనుచు గృహాభిముఖుఁ

డయ్యెను. కాని కుక్క యింతదనుక బాబావద్దనే గలదు. మహారాజాతఁ డరుగగనే యాకుక్కను తట్టి "నీయజమాని గృహము జేరుటకు బూర్వమే నీవింటికి బొమ్మని" చెప్పెను. అది పరుగెత్తెను.

మహారాజున కజ్ఞాతవాసము, నాలుగు సంవత్సరములు పూర్తియయ్యెను. ఖర్గపుర విరోధులు బాబాను అచట నుండి బొమ్మని యాదేశించిరి. డా. పిళ్లేకూడ తనసోదరునకు "అజ్ఞాతవాసము పూర్తియయ్యెనుగనుక నిక మహారాజు దన్ను దన పరివారమును జూడ నగుదెంచు" నని లేఖ వ్రాసెను. పరిస్థితులను జూచి మహారాజొకనాటి రాత్రి యదృశ్యుడయ్యెను. ఆ మరునా డతడు డా. పిళ్లెగృహమున నాగపురమున నుండెను. బాబా గాన్పింపకుండుటచే భక్తు లతి విషాదము నొంది నాగపురమున బాబాను దర్శింప నేగిరి.

నాగపురమున వారలకు బాబా దర్శనమయ్యెను. అట మరల భజనలు, ఉత్సవములు, సంతర్పణలు, జరుగసాగెను. ఒకదినము బాబా తనశిష్యురాలగు మీరాయింటనుండు నపుడు 'ఘాండీబాయి' యను స్త్రీ, నామె యత్తగారును నరుదెంచిరి. ఘాండీబాయి అత్త మహారాజునకు నమస్కరించి "తనకోడలును గట్టిగా గొట్టి శిష్యులందుత్కృష్ట స్థితినంద జేయుమని" ప్రార్థించెను. మరియు నామె తన కోడలుతో "మహారాజు నిన్ను గొట్టు దనుక నిటనుండి కదలకుమ" ని యాదేశించి వెడలెను. ఘాండీ బాబాకు బరిచర్య జేయుచు గొలదిదినము లుండెను, కాని మహారాజామెను గొట్టలేదు.

ఇంతలోనే ఖాండీబాయి మామగా రొకనాటిరాత్రి తలుపులుమూసి పరుండగా దీవ్రముగా నడుము నొప్పిజనించెను. ఎవరనేని పిలుచుటకుగూడ శక్తిలేదయ్యెను. అంతలోనే గోనెధరించిన సంన్యాసియొకం డతనిగదిలోని కేతెంచి యాతని లేవదీసి నడుముమర్దించి, స్వస్థతచేకూర్చి యదృశ్యుడయ్యెను. కొలది దినముల కాతడు మహారాజును జూడనేతెంచి యాతనిజూచి, నాటిరాత్రి సంన్యాసియు, బాబాయు నొక్కరూపున నుండుట గాంచి, మిగుల నచ్చెరువందెను. ఈ విషయ మాతడు మహారాజునకు దెల్ప నాతడు "నే నశక్తుడననియు, నావద్ద నట్టిశక్తిలేమి లేవనియు చెప్పుచు, దనకు సపర్య లొనర్చినందులకు సంతుష్టుడై భగవంతుడే యటుల జేసియుండ నోపు"నని చెప్పెను.



## అధ్యాయము ౨౨

### పూర్వస్థలముల జూడనేగుట

నాగపురమున బాబా ఖ్యాతి మిక్కుటమయ్యెను. శతసంఖ్యాకు లనేకు లాతని బూజించుటకు రాదొడంగిరి. వారందరితో నాతం డాధ్యాత్మిక విషయముల జర్చించుచుండెడివాడు. ఖర్గపురభక్తులుకూడ నిటకేతెంచి బాబా సేవయొనర్చి ఖర్గపురమందలి బాబాఖ్యాతిని వెల్లడించుచుండిరి.

బాబా మరం సింధీ (గణపతిఘాట్ ప్రాంత ప్రదేశము)న కేగెను. అప్పుడుగూడ బాబా యనేకుల నార్వదించెను. ఒకో

క్కుపు డాయన రైలుబండ్ల సమయములందు గలిగిన మార్పులను తన నివాసమందుండియే తెలుపుచు అగంతుకుల నాశ్చర్యాన్వితుల గావించు చుండెను. వారును ప్రేమనుకువచ్చి బాబాచెప్పినదెల్ల నిజమై యుండుట గని యాతనిశక్తికచ్చెరువందుచుండిరి.

సింధీనుండి బాబా నాగపురమునకు మరలెను. అందుచే మరల నచ్చట సంతర్పణలు, బూజలు మిక్కుటమయ్యెను. అట బాబా యసంఖ్యాకుల బూజల నందుకొని బ్రహ్మర్షి స్థానోచిత గౌరవముల నందెను.

మహారాజున కజ్ఞాతవాసము బూర్తియయ్యెను గనుక నాతడు తన బంధుగుల నెయ్యుల గలసి యానందింపఁ బూనా సతానాలకు బయన మయ్యెను. 1916 సం॥ రారంభమున నాతడు దనసోదరుని పూనాలో గాంచి, స్వీయ నివాసము సతానాకు తరలెను. అట నాత డొకటిన్నర మాసముండెను. మరల గురువగు శ్రీసాయిని జూచుటకు షిర్డీకి బయనమయి, తన పూర్వనివాసమగు ఖండోబా యాలయమున బసజేసెను. అతని పెంపుడు కుక్కయు, పూర్వపరిచితులు నాతని మరల బరివేష్టింప సాగిరి. అతని విరోధులతో నానా వాలీ గూడ నచ్చట నుండెను. నానావాలీ బాధలవలననే బాబామరల షిర్డీ వీడి, రహాతావద్ద నున్న దేలూనేట్ తోటయందు నివసింప జొచ్చెను. బాబా భక్తులచటి కనేకులు జేరి సప్తాహంభజనలు, సంతర్పణలు, గావింప మొదలిడిరి.

అచ్చట నుండగనే యొక నా డొక స్త్రీ బాబా కొక నారింజ పండు నొసంగెను. ఆసమయమున నచ్చట సుమా



శ్రీ దత్త మందిరము

(శ్రీ ఉపాసని బాబా ప్రతిష్ఠితము.)

రిరువదిమంది భక్తులుండిరి. సాధారణముగ నారింజపండునందు పదిపండ్రెండు తొనలకంటె నధికముగ నుండవు. కాని బాబా యాపండు నొలచి ఒక్కొకతొన చొప్పున యందరకు బంచి యీయసాగెను. డొలూనేట్ యిది గాంచి తొనలందరకు జాలవేమో యని భయమంద సాగెను. కాని మరి పదిపదు నైదుగు రాగంతుకు లరుదెంచినను బాబా తొనల నందరకు బంచుచునే యుండెను. డొలూనేట్ ఈవిచిత్రము గాంచి బాబాను బ్రశ్నింప యది యొక జీవసత్త్వమని యాయన సమాధానించెను. ఇట్టి సత్త్వమునేగదా కృష్ణుండు వనవాస సమయమున ద్రౌపది కనుగ్రహించెను. బైబిలునం దుదహరింపఁబడిన రొట్టెలు, చేపలుగూడ నట్టి విచిత్రశక్తి జనితము లేగదా!

అనంతరము డొలూనేట్ బాబాను అహమద్‌నగర మందలి తన ఖిల్లులకు గొంపోయెను. పిదప బాబా తుదిసారి షిర్డీ గురుసన్నిధికేగి రెండుమూడు నెలలుండి మీరాజ్‌నకు బోయెను. కాని సాకోరీయందలి వ్యవసాయదారు లతనిని తమ గ్రామమున కాహ్వానింప నాయన సాకోరీ కరిగెను. అట నాతఁ డొక శ్మశానమం దొక కుటీరమును నిర్మించుకొని యందు వసింప సాగెను. అట గూడ బాబాను భక్తబృందము వీడక యాతని నారాధింప నరుదెంచుచునే యుండెను. అచ్చటి కనేకు లాధివ్యాధి పీడితులును, దారిద్ర్య బాధితులు, సంతత విఘ్న బాధాపీడితుల ననేకు లేతెంచి తమ బాధలనుండి విముక్తి గాంచిరి.

**1921, 22** సం॥ ములందు బాబాచరిత మామండల మండలి పత్రికలందు బ్రకటితము కాజొచ్చెను. అంత బాబా ఖ్యాతి దిగంత వ్యాప్తమయ్యెను. మహారాష్ట్రభాషయం దాతని చరితము నొకప్రసిద్ధ లేఖకుడు వ్రాసెను.

**1923, 24** సం॥ ములందు బాబా మతవిషయికము లగు నావేశ పూర్ణ భాషణల నొసంగ మొదలిడెను. అవియే "సాయివాక్సుధ" యను పేర మహారాష్ట్రపత్రికలందు బ్రకటితము గాజొచ్చెను. ఇందువలన బాబాఖ్యాతి మరింత విస్తృతమయ్యెను. అందుచే భక్తు లనేకు లరుదెంచి, బాబాను దర్శించి గానుకల నొసంగి పోదొడగిరి. ఈ యుపహారద్రవ్యము తోనే బాబా తానుండుట కొక యంతస్థును, దత్తాలయ మును, మహమ్మదీయుల కొక చిన్నమసీదును, ఆగంతుకులు విడియుటకు రెండు, మూడు ధర్మశాలలను గట్టించెను. ఈ యిండ్లవలనను నాగంతుకుల రాకపోకలవలనను, 'సాకోరీ' యితర గ్రామములకన్న నెక్కుడు నాగరికత నొందెను.



## అధ్యాయము ౨౩

### బాబా జన్మోద్దేశ్యము, శ్రీవారి ప్రబోధనలు

ఈ విశ్వమున నెవరేని మహాత్ముఁడు జనించుట - ఏదియో నొక మహత్తర కార్యనిర్వాహణమునకై యుండును. ఏవియో మహాశయములతో ప్రత్యేక వ్యక్తిగతముగఁ బరమే

శ్వరు నర్పించు మార్గమున నున్నవారలు, సహజముగ, భగవ త్కారుణ కర్షూలై, అప్పుడు ప్రాపంచమున కేదియో మేలొన రింపఁ గలనుద్దేశ్యముఁ గలిగిన వారలయ్యెదరు. ఈవిధముగనే, శ్రీరాముఁడు, శ్రీకృష్ణుఁడు, మొదలగు నవతారములు సైత ముద్భవ మొందఁగల నవకాశము గలిగినది. ఈవిషయమునే శ్రీకృష్ణ భగవానుఁడు తనగీతలయం దీవిధముగ, స్పష్టీకరించి యున్నాఁడు.

"యదా యదా హి ధర్మస్య, గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్॥
పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగేయుగే॥"

అనగా, నేను ప్రతియుగమునను, దుర్మార్గుల సంహరించి ధర్మసంస్థాపన మొనరింప జనించుచుందును.

అజ్ఞానాంధకారము దశ దిశలఁ గ్రమ్మి, భారతాకాశ మండలము, గాఢాంధకార బంధురమై, దిశలు మారుమ్రోయు నట్లు, దుర్మార్గుల కంఠహుంకృతు లను మేఘగర్జనా రావము లుప్పతిల్లు నప్పుడు, శ్రీ విజ్ఞానఘనులును, దేవాంశభవులును, మహత్తర ప్రభావ పూర్ణులు నగు మహాత్ము లను విద్యుల్లతలు, కన్నులు మిఱుమిట్లు గొలుప జన్మించి, యదృశ్యము లగు చుందురు.

పాషండమతములు ప్రబలి, భారతావని, యజ్ఞానాంధ కార బంధుర మయిన సమయంబున శ్రీ శంకర భగవత్పా దులవారు జన్మించి, దుర్మతముల నిర్మూలించి, అవతార

సమాప్తినొందిరి. అటులనే శ్రీరామానుజాదులును, శ్రీరామ కృష్ణ పరమహంసయును, తన వేదాంత గర్జనారావములచే, ప్రాచ్యపాశ్చాత్య ఖండముల నుత్తూతలూగించి, భారతవర్ష మునకు, మాసిపోవని కీర్తి నార్జించిన, భారతపుత్రరత్నము స్వామి వివేకానందుఁడును, స్వామి రామతీర్థ ప్రముఖులు, ఎందరు మహనీయులు ఈ విశ్వమున జనింపలేదు.

అటులనే శ్రీ యుపాసనీమహారాజు, తన గురుదేవునిచే నాజ్ఞాపింపఁబడి, అనేకవేల జనుల నాధ్యాత్మిక మార్గమునకు ద్రిప్పి వారలకు మహాత్మ పదవి గల్పింప నియమింపఁ బడి యున్నానని శ్రీవారే తెలిపి యున్నారు! అందుకనియే, ఆతనియందలి పాపపురుషుఁడు వెడలఁగొట్టఁ బడినాఁడు. కామము ధ్వంసీభూతము సేయఁబడినది! ధనతృష్ణ యణగఁ ద్రొక్కఁబడినది. దుర్భర క్లేశాగ్నిజ్వాల లుపశమింపఁ బడిన వని పై పుటలయందు వ్రాసియున్నాను. కావున శ్రీ ఉపాసనీ బాబా జన్మావశ్యకత ఏమన ? శ్రీ గురుభగవానుఁడగు 'సాయి బాబా' కార్యభారమును నిర్వహించుటయే. అందుకనియే వారిశిష్యు లీయిరువురను, 'ఆనాఁడు, దీనుల రక్షింప నవతరించిన శ్రీరామచంద్రుఁడు, శ్రీకృష్ణుఁడు, దత్తాత్రేయాది' అవతారములఁ దాల్చిన పరమేశ్వరుఁడే యిప్పుడు, ప్రస్తుత హిందువుల దురవస్థను బాప, నవతరించినారని వర్ణింతురు.

నవీనపాఠకులు శ్రీయుపాసనీబాబా మొదలగు వారు ధర్మసంస్థాపన మొనరించి చెడుగు నణఁగఁద్రొక్క జనించి నారని చదివి యంతటితోఁ దృప్తిఁబొందక ఆయన కావించిన

ఘనకార్య మేమి? వారి ముఖ్యోద్దేశ్యము లేమి? అని ప్రశ్నిం తురు. వారియుద్దేశ్యముల సరిగా గ్రహించుట ఎవరికిని సాధ్యము గానిపని. అయినను భక్తిభావమున శ్రీబాబాగారి నిజోద్దేశ్య మారయుటకు ఒక మద్రాసీయునకును శ్రీవారికిని జరిగిన సంభాషణ, ఈక్రింద నుదహరింపబడు చున్నది.

శంకరుని యద్వైత మతావలంబియగు నొక మద్రాసు నివాసస్థుడు 1932 సంవత్సరమున శ్రీయుపాసనీబాబా సన్నిధి కేగినాడు. మహారాజు ఆతనిని 'నీయుద్దేశ్యము, పరిశ్రమ యేమి?' యని ప్రశ్నించినాడు. ఆమద్రాసీయుడు తనకుఁ దెలిసిన విషయము, కూర్చుండి శ్రీశంకరులవారి నీతివాక్య మగు *'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' యనువాక్యమును స్వాను భవపరచుకొనుట- అనగా మానసవీథిలోఁ దిరుగుచున్న ప్రతి వస్తువును పరీక్షించి యిది మిథ్యము, యిది మిథ్యము అని తలచుచుఁ బోయినఁ జివరకు సత్యము స్ఫురింపఁ గలదు. అప్పుడా "సత్యమునందు చిత్తమును కేంద్రీకరింపఁ జేయ వలయును." అంతట బాబా వెంటనే యిటులఁ బలికినాడు. "అవును ! అదియే పర్యవసాన గమ్యస్థానము. నీచిత్తమటుల ఆసత్యమునందు నిలువఁబెట్టఁ బ్రయత్నించి నప్పుడు నిలు చునా?" "ఊహు. నిలువదు. వాసన లతిబలిష్ఠములైనవి. ఈ చిత్తము నచ్చోట నిలువనీయక అల్లకల్లోలముఁ జేయుచున్నవి. ఆవాసనా పరంపరల నణగఁ ద్రొక్కుటకే యీ సకోరీ కరుగు దెంచితిని."

---

* అనఁగా యీకానఁబడెడు జగమంతయు మాయా కల్పితమైనది. అసత్యమయినది. బ్రహ్మము (భగవంతుఁడు) ఒక్కఁడే సత్యము. స్థిరుఁడు.

అంతట బాబా "ప్రాథమికపాఠములఁ జదువుచున్న వాని నొక్కసారిగాఁ గొనిపోయి పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సు (Post graduate) నందుఁ గూర్చుండఁ బెట్టుట తప్పు." అని వాక్రుచ్చినారు. అనగా బాబాయొక్క యుద్దేశ్యమేమన. ఆ వ్యక్తికిఁ దగిన పదవియం దధిష్ఠింపఁజేసి క్రమముగ ఉత్తమ స్థానమునకుఁ గొనిపోవ వలయునని.

ప్రథమముననే గమ్యస్థానముఁ గోరువారలకు 'బాబా' మిక్కిలి వ్యతిరేకముగ నుందురు. కాని, యావిషయమును, మనస్సునందొక మూలనుంచుకొన వలయును. అందుకనియే, శ్రీవారి యాజ్ఞానుసారులయి, వారశిష్య సముదాయము, ప్రతి దినము 'హారతీసందర్భమున భగవద్గీత అస్టావక్రగీతలఁ బఠింతురు. వానియం దర్థవిషయము నాలోచింపకయే, నూరకఁ బారాయణ మాత్రముననే వచ్చు మహత్తరశక్తిని 'శ్రీబాబా' వర్ణింతురు. అట్లువారలు, సత్కార్మాచరణతోఁ బారాయణ చేయుచుండఁగా, నొక్కసారి, యాకస్మికముగ, నావాక్యముల యందున్న యంతరార్థము సంపూర్ణముగ స్ఫురించి, మహానంద యుతులై, మహత్తరశక్తినిఁ బడయుచుందురు. అప్పుడు వారలు తర్క, వ్యాఖ్యానములకును, తదితర సాధనలకుఁ గడంగవలసిన యావశ్యకత కలుగదు. ఆపరిస్థితులు కల్గినదాక ఆగ్రంథపఠనములు, మంత్రపారాయణములు, శ్లోకపారాయణ ములు, హారతీ సమయమున, తమకు మహోన్నతపదవిఁ గల్పింప బద్ధకంకణుఁడైన గురుదేవునియందు, శ్రద్ధానమ్మక ముతో నిర్వర్తింప వలసినదే,

గ్రుడ్డినమ్మకము బాబాగారి సిద్ధాంతములలో నగ్ర స్థానము వహించినది. ఇచ్చట మామూలుగాఁ జరుగు విశేష మేమన, యిచ్చట వారెల్లరు శ్రీ బాబాపై మూఢభక్తితో పనిచేయుచుందురు. వీరలకు శ్రీ బాబా భగవంతుఁడు. ఆతఁడు చేయు ప్రతికార్యము సక్రమమయినది. ఎవ్వరును ప్రశ్నింప రానిది శ్రీవారు చేయు సర్వక్రియలు మంచికే. భూతభవిష్య ద్వర్తమానముల శ్రీవారికిఁ దెలియని సమాచారములేదు. వారి శక్తికి మించినది లేదు.

పై జెప్పిన విషయముగా, బాబా ఎవరికిఁ దగినపనిని వారికి నిర్వర్తింప నొసగుచుండును. ఒకసారి మహారాజు 'నేను ఒకసంవత్సర మీడుగల పసిపిల్ల మొదలుకొని, కాటికిఁగాలుఁ జాపుకొన్న వృద్ధులకుఁగూడ వారి వారికిఁ దగినకార్యముల నిర్వహింపఁజేసి, యుత్తమపదవి గిల్పింప, నిటఁగూరుచుండి యున్నానని నాక్రుచ్చియున్నాడు! కాయధవుఁడను (Kaaya Dhava) నొకభక్తుఁ డిటులఁ జెప్పుచున్నాఁడు. ఆతఁడు తన సంవత్సరవు యీడుగల శిశువును, బాబాకడకుఁ గొనిపోయి, వారియొడిలో నొక నిమేషకాలముంచినాఁడు. ఆ పిల్ల 'ఆరు నెలలపిదప, ఆకస్మికముగ, తనమెడయందు వ్రేలాడుచున్న పతకమునఁగల 'బాబా' చిత్రముఁజూపి (యీ పతకమునగల యతఁడు, అటనిలువఁబడి యున్నాఁడుసుగో యనునట్లు) అటగల బహిరంగస్థలమున వ్రేలిడి చూపుచు మరణించినది. బహుశా, శ్రీకృష్ణభగవానుఁడు, అంపశయ్యాగతుఁడై, భౌతిక శరీరమును త్యజించుచున్న భీష్మునికన్నులకుఁ గానఁబడినరీతి

యీశిశువునకుఁ గూడ శ్రీమహారాజు......కానఁబడి దర్శన మిచ్చెను కాబోలు!

బాబా తనభక్తులను, స్థిరముగా భక్తిమార్గమునకును, కర్మమార్గమున కనుగమింపఁ జేసెదరు. వారు తప్పక మొట్ట మొదట, తమగురుదేవునియందు తదుపరి యిష్టదేవతపైనను దృఢవిశ్వాసముంచి తమచిత్తమును, సర్వభారమును శ్రీవారి యం దుంచవలయును. ఇట్లు చిత్తమును, హృదయము నీవిధ ముగ మార్చుటేగాక, యీయింద్రియములచేతఁ గట్టఁబడ కుండ, గమ్యస్థానముఁ జేరుటకై ఎల్లప్పుడు సత్క్రియలఁ జేయుటకై గూడ, బాబాచేఁ బ్రబోధింపఁ బడుచున్నారు.

ఈ విషయమునసే క్రీస్తు మహాశయుఁడు యిటుల వాక్రుచ్చినాఁడు. "నీవు భగవత్సామ్రాజ్యమును, ఒకశిశువు చందమునఁ బొందవలయును." నమ్మకము.— పర్వతముల సైతము పెకలింపఁజాలు నీనమ్మకమే మతమునందు తొమ్మిది వంతులు మగ్నమయి యున్నది. ఈ మార్గానుసారముగనే, శ్రీబాబాయు, తన భక్తులను, కర్మవిముక్తులఁజేసి, గమ్యస్థాన మునకుఁ గొనిపోవుచున్నాఁడు. తనభక్తుల నీ విశ్వాసమా ర్గాను వర్తులఁగావించి బాబా తన శిష్యులకుఁ గొన్ని కొన్ని ముఖ్యవిషయముల యందు స్వాతంత్ర్య మొసఁగుచున్నాఁడు. ఎవరి ఇష్టదైవముల వారర్చింపవచ్చును. ఇదివర కలవాటయిన వారివారి సాధనాపద్ధతుల మార్చుకొన నవసరములేదు. శ్రీమహారాడచంద్రుఁడు పారశీకులకు, మహమ్మదీయులకు సైతము, వారివారి గమ్యస్థానాగమన కార్యమున యనల్ప సహాయము నొసఁగియున్నారు. అచ్చట కరుదెంచిన యొక

పారశీకుఁడు, శ్రీవారు హిందువగుటచే, నాటికడకుఁ జన, లజ్జఁ జెందుటఁగాంచి శ్రీబాబా యిటుల సెలవిచ్చియున్నారు. “మీ సంఘమునందే ఎవరైన సత్పురుషుఁడున్న వారినే కనుఁగొనుము. అటుల లేకపోయిన ఏ కులమునకుఁ జెందిన సత్పురుషునైన నిరాటంకముగ నాశ్రయింపవచ్చును. సత్పురుషులు జాతి మత భేదములఁ బాటింపరు. వారు తన్నాశ్రయించిన ప్రతిభక్తుని వారివారి మానసిక ప్రవృత్తికిఁ దగిన విశ్వాసమార్గమున నడిపించి * గమ్యస్థానమునకుఁ జేర్పఁ జేయుదురు.” ‘నమ్మిక’ మన ప్రదేశముననే బాబా తనభక్తుల నందరిని లంగరు వేయఁ దలచునది. జ్ఞానమనునదే గమ్యస్థానమనుమాట నిజము. ఆ జ్ఞానమనునది, నమ్మకముచేతనే పొందఁగల మనుమాట నిర్వివాదాంశము.

సత్కర్మ (ఇందుతోడనే స్వధర్మము కలసియున్నది) యనునది తన భక్తులను బాబా ధరింపఁజేయు రెండవ మహాస్త్రము. వారొక్క నిమేషకాలముగూడ యీసత్కార్యముల విషయమయి మాటలాడక యుండుట మనము గాంచఁజాలము. శ్రీవారు చెప్పు నుపన్యాసము లెన్నియుఁ జాలవరకు యీసత్కర్మల గురించియు నాయా మతముల వారి కాయా

పర్వదినములలో విధింపబడిన సత్కర్మల ముఖ్యముగ నాచరించ వలయును.

నూతన శిష్యులకు ఆతఁడు సంపూర్ణముగఁ బాహ్యాత్మాభిప్రాయ బద్ధుఁడుగా నున్నప్పుడు దప్ప పసిపిల్లలయందు మోయరాని బరువులనెత్తినట్లు వారలనెన్నఁడాధ్యాత్మికముగ నతిక్లిష్ట కార్యముల మోయఁజేయఁడు. అక్కడ బాబాగారి ఆశ్రమమున వసించు భక్తులొనరించు కార్యములఁ బరికించు వారలు వారిదినచర్యయం దెంతమగ్నీకృత మానసులై వర్తింతురో గ్రహింపఁగలరు. వారలు బాబాగారియొక్కయు దత్తాత్రేయుల వారియొక్కయు దర్శన, హారతీ సమయములయందు హాజరగుటయేఁగాక దత్తాలయమునను, బాబాగారిద్వారము కడను, సామాజికముగను, ఒంటరిగను భజనలు సేయుటేగాక వారలు శ్రీబాబాగారి పటమునకు, వారి యిష్టదైవమునకు ఏకాంతారాధనయు ప్రత్యేకముగ భజనయుఁ గలదు. అదియుఁగాక వారలు ప్రతిదినము దత్తాలయమునకును, బాబాకును, హనుమద్విగ్రహమునకును, అశ్వత్థవృక్షమునకును, ఔదుంబర తరువునకును ప్రదక్షిణ మాచరించెదరు. వారలు స్వయముగ నన్నము వండి గురుదేవునకును, అతిథులగు భిక్షులకును బెట్టి మిగిలిన పదార్థమును వారలు స్వీకరింతురు. శ్రీబాబాయాజ్ఞానుసారము బ్రాహ్మణోత్తము లచ్చటఁగల పవిత్ర మందిరమున వారివారి నిత్యకర్మ నైమిత్తిక కర్మలను జపతపాదుల నప్రమత్తతతో నొనరించు చుందురు. వీనితోపాటు బాబా సప్తాహముల,యజ్ఞముల నొసరింపఁజేసి వారివారి యాధ్యాత్మిక బలముల వృద్ధిగావించు చుందురు. సప్తాహమనగా దత్త

మందిరమునను, బాబాగారి నిలయమునను స్త్రీపురుషాదులు, రాత్రిందివములు పాళీలుగ ప్రత్యేక దివసములందు అనగా సంక్రాంతి, శ్రీరామనవమి, గురుపూర్ణిమ, నవరాత్రి మొదలగు పవిత్ర దినములయందు నిర్ణయింపబడిన మంత్రమును బిగ్గరగ 'నేక్ తార్' లేక హార్మోనియం సహాయమున పఠన మొనరింతురు. శ్రీరామనవమికి ముందు 7 దినములనుండి రాత్రిం దివము లీక్రింది మంత్రము ఆశ్రమమునుండి శ్రవణానందముగ వినవచ్చుచుండును.

శ్లో. రామాయ, రామభద్రాయ, రామచంద్రాయ, వేధసే
రఘునాథాయ, నాథాయ, సీతాయాః పతయే నమః.

నేను శ్రీరామునకు, నాప్రియమైన రామునకు, చంద్రునిఁ బోలిన శ్రీరామునకు, విశ్వమునకెల్ల తండ్రియగు శ్రీరామునకు, రఘువంశమునకు నాథుఁడగు శ్రీరామునకు, సర్వజగములకు అధిపతియగు శ్రీరామునకు, శ్రీసీతాప్రాణేశ్వరుఁడగు రామునకు నమస్కరించుచున్నాను.

తదుపరి ఐదు దినముల వరకు—

శ్లో. మనోజవం మారుతతుల్యవేగం । జితేంద్రియం, బుద్ధిమతాం వరిష్టం । వాతాత్మజం, వానరయూథముఖ్యం ।
శ్రీరామ దూతం, శిరసా నమామి॥

మనోవేగ, వాయువేగములఁ గలవాఁడును, ఇంద్రియ ప్రవృత్తులనెల్ల నరికట్టిన వాఁడును, మిక్కిలి బుద్ధిబల సంపన్నుఁడును, వాయు కుమారుఁడును, శ్రీరామదూతయు నగు హనుమంతునకు (మారుతికి) వందన మొనరించు చున్నాను.

ఈ చిన్నయాశ్రమ ప్రదేశమునుండి, జనించు నీపవిత్ర నామధ్వని, రాత్రిందివములు చుట్టుపట్లగల వారలఁ బవిత్రీభూత మొనరించి, యీప్రాపంచకేచ్ఛలనుండి విముక్తులఁ గావించును. అప్పుడప్పుడు, వినేకహృదయులకు, ఆకస్మికముగ నిష్టదేవతాదర్శన భాగ్యముగూడఁ గలుగుచుండును. అట్టి దర్శనభాగ్యము నొంది, వారలు గమ్యస్థానముఁ జేరఁ గలుగుచున్నారు. వారి వారి హృదయమందిరములఁ బరమేశ్వరునిఁ బ్రతిష్ఠించుకొని, తమజీవితముల సార్థక పరుచుకొనుచుందురు. దీనినే సాక్షాత్కారమందురు. అప్పుడు వారి కీకలుషలంపటలంటఁజాలవు. ప్రాపంచక నీచమగు కోరికలు బంధింపవు. చాలమందిటుల ప్రతిదినము, తమయిష్టదైవ దర్శనభాగ్యము నొంది యీవిషయమును, తమదినచర్యలో ప్రధానాంశముగాఁ బరిగణించుకొనిన వారలు గలరు. ఆత్మసాక్షాత్కారము కలిగినను లేకున్నను, తమయిష్టదైవములయందలి భక్తి వీడక భజనలో పాల్గొనుచుందురు. పూర్వజన్మ సుకృతవశమున, ఒక్కొక్కనికి త్వరలో సాక్షాత్కార మొనఁగూడును. ఎటులన "శ్రీరామ ధ్యానము సేయుచు నిరువురు గూరుచున్నా రనుకొనుము. మొదటివాఁడు పూర్వవాసనవలన, త్వరితకాలమున సాక్షాత్కారమునొంది సమాధిమగ్నుఁడగును. రెండవవాఁ డింకను, తన శత్రువులను, దుర్భర ప్రాపంచకేచ్ఛలతోడను, ఇంద్రియాపాటాటోడను పోరాడుచుండును. దానికిఁ గారణమేమిటి? మొదటివాఁ డీజన్మలోనఁ గాని, పూర్వజన్మమునఁగాని రామమంత్ర పఠనఁ గావించియుండును. రెండవవాఁ డట్లు సలుపలేదు." ఏదైన మంత్రోపదేశమును పొంది కొందరు, వెంటనే జ్ఞాన

పూర్ణులై నిజమును తెలిసికొని, మహదానందమగ్నులై యుండగా, ఆ మంత్రోపదేశము నొందిన వారలే మరికొందరు, ఏమాత్రము హృదయమున, నూతృప్తిగానక యుందు రేమిటి? ఈ పైవిషయమే దీనికిఁ గారణము.

ఈ మంత్రజపమొక్క ఆధ్యాత్మిక లాభమునకేగాదు. ఏనులు, యీప్రపంచక లాభములకు, అనగా ధనము, ఇంద్రియ సౌఖ్యములు, సంతతి మొదలగునవి పొందుటకై యీజన్మమునఁ గాని, పూర్వజన్మలయందునఁ గాని తన్మంత్ర జపము నొందెదరు. సాధారణముగా బాబా సకామకర్మ కన్న నిష్కామ కర్మ మంచిదని పలుకుచుందురు. తదుపరి, యీ ఘట్టమున యజ్ఞవిషయములై కొన్ని సంగతులు చెప్పఁబడుచున్నవి. వేదములు యజ్ఞములగురించి వర్ణించుచున్నవి. వేదములను, తన్మంత్రములఁ దెలసినవారలివి గావింతురు. ఈ యజ్ఞమును చేయించినవారు చూచినవారుఁగూడ లాభమును పొందుదురు.

యజ్ఞముల యందలి సర్వపరికరములు, చేయువారు, చేయించువారు, చూచువారు, దేవతా స్వరూపులు. కావున సంపూర్ణ విశ్వాసముతో, సక్రమముగ నొనరించిన దేవతలవలన దీవింపఁబడుదుము. మనకు పవిత్రములగు మంత్రము [illegible]కర్మలుగలవు. యజ్ఞముసేయించిన వాఁడును, చేసిన [illegible] చూపరులును దేవతానుగ్రహపాత్రు లగుదురు.

శ్లో॥ దేవాన్ భావయతా నేన తే దేవా భావయంతువః ।
పరస్పరం భావయంత శ్శ్రేయః పరమవాప్స్యథ ॥

— గీత ౩. ౧౧

అనగా దేవతలను మీరు వృద్ధిపొందింపఁ జూచినచో, వారుమిమ్ము వృద్ధి పొందింపఁ జూతురు. మరియు, యాగంబు వలన సంతోషించిన దేవతలు మీకు సమస్తమయిన శుభ ముల నొనఁగూర్తురు. ఈ విధముగా నొకరి కొకరు భావించు కొనుచు, గొప్ప శ్రేయస్సులఁ బొందుఁడు. ఏ పురుషుఁడు దేవతలకీయక భుజింపఁ బ్రయత్నించునో, వాఁడు చోరుఁడిరి దీనుఁడు నగుచున్నాఁడు. నమ్మకముగల వారిచ్చట, ప్రతిదినము బాబాగారి సంస్థానమునఁ జరుగు యజ్ఞాది సత్కార్యముల వలన ననేక వింతలఁగాంచఁ గలుగుదురు. అనేకులు రోగపీడి తులు, ఇష్టబంధు వియోగులు, దురదృష్ట వంతులు, ఆర్తు లరుదెంతురు. వారలకు బాబా సాధారణముగా, దత్తారాధన, ఔదుంబర వృక్షమునకు, శనికిఁ బ్రదక్షిణలు, దరిద్రసేవ, భక్తా రాధన, నియమిత మంత్రజపము యజ్ఞాగ్నికి ఆహుతుల నొసం గుట, ఏకాదశీవ్రతముల నొనర్చుట, విప్రులకు, బీదలకు, భోజ నము నిడుట మొదలగు సత్క్రియల గావింపఁజేతురు. ఇట్టి సత్క్రియల ననేకము లొనరించి, సంకటవిముక్తులై యీ కార్యములయం దెక్కువ నమ్మకముగలిగి, యిట్టి వానిని నిర్వ ర్తింపు నలవాటును, వృద్ధిపఱచి, యిష్టదేవతారాధన, జప మందు చిత్తస్థైర్యత, శాంతి మొదలగు సద్గుణములను వాటయిన ములఁ బొందుచుందురు ఏదోయొక కోరికతో నచ్చటి కరుగు దెంచి, సత్కర్మలఁజేయ మొదలిడి, నిష్కామముగఁ జేయు కర్మలవలన పొందు, నధికమగు లాభమును గాంచి, సర్వము నకును భగవంతునిపై భారమువెచి, సద్ధర్మముల నిర్వర్తిం

పుచు, స్వలాభ కాంక్షాపిదూరులై, ప్రశాంతముగ నుందురు. ఒక్కొక్కప్పుడు బాబా ఆశ్రమమున మహదానందముగ, యజ్ఞముల సేయించెదరు. అప్పు డానియమిత దినమున, భక్తు లెల్ల రేగుదెంచి శతచండి, విష్ణుయాగము, మొదలగు వానిని (ఆయాగాగ్ని కుండముల, ధాన్యము, పండ్లు, దధి ఘృత ంల నపరిమితముగ నర్పణముచేయుచు) దత్తమందిరమున గాని, లేక మరియొకచోటఁగాని నిర్వర్తింతురు. అప్పుడు చూపరులు, అనేకవేల సంవత్సరములవెనుక, మహారణ్యములలో మహర్షులచే నొనర్పఁబడిన యజ్ఞదృశ్యములు దృక్పథమునకు వచ్చి "పూర్వకాలమందలి పవిత్రమగు హిందూమతమును, పునరుద్ధరించి, వృద్ధిగావింపనే బాబా జన్మించి యున్నాఁ"డని గ్రహింపకపోరు.



## అధ్యాయము ౨౪

### బాబావలనఁ గలుగు శ్రేయమేమి ?

పై అధ్యాయములన్నియుఁ జదివిన పిదపఁ గొందరు చదువరులు "వీనివలనఁ గలుగుచున్న లాభమేమి ?" యని [illegible]గరు. ఈ ప్రస్తుత పరిస్థితులలో బాబా కార్యక్రమము వ్యక్తిగతముగఁ గాని, సాంఘికముగఁ గాని ఏమిమేలు గూర్చుచున్నది? ప్రతిపాఠకుని ప్రశ్నల కొక్కొకదు జవాబు చెప్పుట దుస్సాధ్యమయినను, కొన్నివిషయములు మాత్రమిచ్చుటఁ బొందుపఱుపఁ బడుచున్నని. ఈవిషయము జాగరూకతతోఁ

జరిపిన బాబాచేఁ గలుగుచున్న లోకకల్యాణక్రమము నెఱుంగఁ గలరు. ప్రతి సంవత్సరము వేనకువేలు జనులు బాబాకడకు వచ్చుచున్నారు. ఎందువలన వారట్లరుగు చున్నారు?

"చతుర్విధా భజన్తేమాం, జనా స్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ, జ్ఞానీచ భరతర్షభ." —

అని శ్రీకృష్ణుఁడు వాక్రుచ్చి యున్నవాఁడు.

అనఁగా నాల్గురకముల మనుజులు నన్నాశ్రయించు చున్నారు. ఆర్తుడు, జిజ్ఞాసువు, ధనమును కోరువాడు, జ్ఞాని. వీరిలో ముఖ్యముగ అసంఖ్యాకులు శ్రీబాబానుగాని, శ్రీకృష్ణునిఁగాని ఆశ్రయించువారలు మూడవ తరగతివారు. తదుపరి మొదటి తరగతివారు. స్వసుఖములఁగోరి రోగాది దురదృష్ట క్లేశములనుండి విముక్తులగుటకు మాత్రమే తన్నారాధింప వచ్చుటకు శ్రీబాబా సమ్మతింపరు. కాని అందరి నాపద్ధతినే చూడరు. కొందరి కీవిషయములలోఁ గూడ తన సహాయము నొసఁగు చుండెను. అనేకులు శ్రీవారి సహాయ పాత్రులగుచున్నారు. తమకష్టములను, దుఃఖములను నుపశమింపఁ జేసుకొనుటకై శ్రీవారికడ కేగుదెంచి శ్రీవారి సంస్థాన స్పర్శచే వారివారి సహజస్థితుల యందొక మహాత్తమ పరివర్తనము గలిగినవార లగుచున్నారు. దాని కుదా[illegible] [illegible] నిట నొకవిషయము వ్రాయుచున్నాను. తనకు[illegible] ప్రాణముఁ గాపాడుకొనుటకును, ధనముఁ బోగొట్టుకొనుట వలన సంభవించిన దివాలానుండి విముక్తుఁడగుటకును శ్రీబాబా కడకేగుదెంచి యొకడు ఆలాభముల నైతముఁ గాంచి అట

నుండి శ్రీగురుదేవునిపై యత్యంతాఖండ విశ్వాస పూర్ణుఁడై శ్రీవారిని సేవించుచున్నాఁడు. ఇటువంటి నిదర్శనములనేకములు గలవు. శ్రీవారు తన్నాశ్రయించిన వారల విశ్వాసమును వారి (భక్తుల) యాధ్యాత్మిక ప్రభావమును వృద్ధిపఱచి గమ్యస్థానమునకు భద్రముగఁ జేర్చుటకే ఉపయోగించుచుందును. ఒకవేళ నావ్యక్తి తానేది వాంఛించి యచ్చటి కరుగుదెంచెనో ఆ యశాశ్వత లాభముల నాతఁడు పొందలేక పోయినను శ్రీగురుదేవుని విచిత్ర ప్రభావ సంకల్ప బలమున ఆపవిత్రాశ్రమ ప్రశాంత మారుత స్పర్శాభాగ్యమున అతని ప్రథమోద్దేశ్యము మారి, యాతుచ్ఛైహిక వాంఛల నణఁగద్రొక్కుకొని మహోత్తమాధ్యాత్మిక సోపానారోహణమున కుపక్రమించును. మొట్టమొదట చాలమంది (భక్తులు) ప్రాపంచిక సౌఖ్యములకే మహాత్ముల నాశ్రయించుచుందురు. తదుపరి మహోత్తమపదవి నొందఁగలిగెదరు. * జనసమూహములు శ్రీబాబాను దర్శింప వచ్చిన వారలు "శ్రీవారు తన ఆశ్రమమున వచ్చువారలకెల్ల తుచ్ఛప్రాపంచిక సౌఖ్యముల నొసఁగఁ గూర్చున్న గారడీవాఁడు కాడని" ఎఱుంగఁగలరు. మానవ సమూహముల నీప్రాపంచిక సంక్షోభములనుండి విడఁదీసి వారివారి స్వమత ధర్మపథముల ననువర్తింపఁజేసి సత్క్రమ ఉత్కృష్టతర కార్యమునకు గడంగుటకై ధైర్యము నవలంబింపఁ జేసి యుత్సాహము నొసంగ కొలదిగ ముందు రుచిచూపిం

---

* ధ్రువుఁడు సైతము ప్రథమమున ప్రపంచమున యీప్రపంచ విషయకమగు కోరికతో తపమునకుఁ గడంగి, తుదకు జ్ఞానమూర్తియై నవియెల్ల మరచి మహోత్తమ పదవి నధిష్ఠించినాఁడు.

చుటకు లాభముల సైతముఁ గలుగఁజేయుచు ప్రజాబాహుళ్యముల శోకవిదూరులఁజేసి వారలకు మహాత్మపదవిఁ గలిగింప నవతరించిన శ్రీభగవదంశా సంభూతుఁడగు సద్గురుమూర్తి యని యెఱుంగఁ గలరు.

మొట్టమొదట పసిపిల్లలకు, ఏదేని మిఠాయిని రుచి జూపించునట్లు, శ్రీబాబా, శిష్యులకు ప్రప్రథమమున లాభముల సైతము రుచిజూపించి, క్రమక్రమముగ వారివారి కర్మల నిర్వర్తింపఁజేసి, ఆధ్యాత్మిక సాధారోహణమునకు, అనేక దుస్తర కార్యముల నిర్వహింపఁ జేయుదురు.

తమ ప్రియబంధువులఁ బోగొట్టుకొనిన వారలు, దిక్కుమాలినవారు, అనేకమంది భిషగ్వరులచే, కాదని వదలఁబడి నిరాశావృతులగు రోగపీడితులు, నిరాశాహృదయులై, ప్రచండ ప్రపంచ దుఃఖజ్వలన జ్వాలా దగ్ధవినష్ట శరీరులగు దీనులై, భయంకరాగాధ మరణకూపపు టొడ్డున నున్నవారలు- అనేకులు శోకోపహతులు ఆర్త శరణ్యుఁడగు మహారాజ చంద్రునికడకుఁ బరుగిడి పోయి, వారి దాక్షిణ్యేక్షణా ప్రసరము నొందఁ గలుగుచున్నారు!

శ్రీవారు, సర్వసాధారణముగ, ఆశ్రయులకు, ఆరోగ్య ధన ప్రాపంచక పదవులఁ గూడ నొసగి చాలమందిని స[illegible]యిమున ద్రిప్పుచుందురు.

శ్రీవారు చెప్పుమార్గములు, పాఠములు, అనేక విధములు. వానిలోఁ గొలదిమాత్రమే, వ్రాయుచున్నాను. కష్టానుభవమే తపస్సుగా బాబాచే భావింపఁ బడుచున్నది. పవిత్రము

లగు మంత్రములను, పురాణాది సద్గ్రంథముల నెతింగినవారలు, తపస్సును శ్లాఘించి, దాని నొక భాగ్యముగ నెంచెదరు. అందుకనియే బాబా, తనవద్దకేగు దెంచెడి యాత్రలను, 'ఆ, అరణ్యావాసములో పూర్వతపస్వులు కష్టపరంపరలవలన, ఎంత మహాత్వమును, కీర్తి నార్జించిరో, అటులనే, అప్రయత్నముగ వచ్చు కష్టపరంపరలవలన గూడ మహోత్తమ పదవి కలుగఁ గలదని' తలంపుఁ జేసెదరు.

ఆంగ్లముసందీగ్రంథమును రచించిన శ్రీ బి. వి. నరసింహ స్వామివారు ప్రథమమున సకోరి కేగినప్పుడు, వసతి సరిగ లేనందున నిద్ర లేకపోవుటచే, యటనారుండఁ జాలకష్టముగనుండెను. అప్పుడు వారి విసుగుతోఁగూడిన యానసముఁ గాంచి, బాబా, "కష్టపరంపరలు వచ్చినప్పుడు, వానిని భరించుటకు మానవులు సంతసింపవలయును. తపస్వులు అరణ్యములకేగి, ఘోరకష్టములఁ దెచ్చిపెట్టుకొనెదరు." 'అప్రయత్నముగ, నాకష్టములు అవియంతటవియే మనపైకి వచ్చుటచే వారలకన్న మనము మిన్నగామా?' కష్టములు రావలదని కోరకూడదు. మనలోని సహాన శక్తియే వానిని దటిమి వేయును.

ఈ బాధానివారణార్థము లగు తదితర విషయములు గూడ బాబా కోరరాదందురు. పూర్వజన్మ కృత కిల్బిషముల మున, యీ బాధలు సంప్రాప్తము లగుచున్నవి. అందువలన వాని ననుభవించుచు నెదుర్కొనుటే మంచిది. ఎందుకన ?– ఆతని పూర్వకర్మ యెల్ల నిర్మూలమయి, తృప్తియు కర్మాధీశుఁడగు భగవంతునిపై భక్తియుఁ గలిగి, చిత్తము స్థిరీకరింపఁ బడుచున్నది. తన యుపన్యాసము లందును, ప్రబో

ధములందుచు, బాబా కష్ట పరంపరలచేఁ గలుగు, లాభముల బాగుగా వా క్రుచ్చెదరు.

శ్రీబాబాగారు, వారిభక్తులును, యీ పద్ధతినే సక్రమముగా నిర్వర్తించుటఁ గాంచి యాశ్చర్యమొందిరి. నల్లులు, చీమలు బాబాగారి దేహముపైఁ బ్రాకునప్పుడు శ్రీవారు, వాని యిష్టానుసారమున కాటంకముఁ గలుగఁజేయరు. ఒకప్పు డొక భక్తుడు, బాబాదేహముపై నల్లులు ప్రాకుచుండుటఁ గాంచి వానిఁ బట్టుకొన నెంచెను. అప్పుడు బాబా "వాటి జోలికి పోకుము. వానికది విహారస్థానము" అనెను.

కొలది కష్టానుభవమువలనఁ గలిగిన లాభమే, సంవత్సరముల కొలది చదువుట వలనను, ధ్యానమువలనఁ గలిగిన దానికన్న, మిక్కిలి యుత్తమ పదవి నొందింపగలదు. ఒక వ్యక్తిని మూఢత్వము నుండి, దైవత్వమునకుఁ గొనిపోవు సాధన మీక్లేశానుభవమే. ఎవ రెంత కష్ట పరంపరలఁ బొందెదరో, ఆతఁ డంత భగవదంశము నొందఁగలఁడు. ఇదియే వైరాగ్యాంశ మూలము. ఈక్లేశములే వివేకముఁగలిపి, ఆధ్యాత్మిక, సౌధారోహణా సోపానములగు సద్గుణముల ననేకములఁ గలిపి, సంసార శృంఖలా విముక్తునిఁ గావించును. ప్రాపంచమున కుదాహరణముగ, భగవదవతారములగు * శ్రీ సీతారామ చంద్రులు సైతము కష్టముల నొందిరి. ఈ సంబంధము

* ఈ కాలమునకు సంబంధించిన వారలఁ గోరినయడల, బుద్ధుఁడు క్రీస్తు, రామదాసు, రామకృష్ణుఁడు, స్వామి వివేకానందుఁడు, స్వామి రామతీర్థ ప్రభృతులు శ్రీఉపాసనబాబా విషయముఁగూడ పాఠక మహాశయు లూహయ వచ్చును.

నకుఁ జెందిన బాబాగారాడు మహావాక్యమిది. అనగా "ఏది యెటులఁ జరుగునో, అదియటుల జరుగనిమ్ము." దీనిని శ్రీబాబా తన బాల్యమునుండియు నాచరణమునఁ బెట్టినాఁడు. చిన్నతనమం దాతఁడు కల్యాణపురమున దిరుగాడు నపుడు, ఒక మహారాష్ట్ర స్త్రీపలికిన వాక్యము లీయర్థమునే స్ఫురింపఁ జేయుచున్నవి. దీని ననుసరించుటచే ననేకములగు సద్గుణ పుంజము లలవడినవి. తృప్తి, భగవంతునియందు విశ్వాసము, ఓర్పు, పట్టుదల, నమ్రత, సాధుత్వము, ప్రపత్తి మొదలగు సద్గుణము లిందే నిబిడీకృతములై యున్నవి.

(శ్రీ)ఉపాసన బాబా భగవంతునిఁ గనుఁగొనినాఁడా? అదియుఁగాక వారెవరికైన మహాత్మ్యము పదవిఁ గలిగించినారా? ఎవరైనను వారి యనుగ్రహమున సచ్చిదానంద లేశమైన బొందగలిగినారా?

భగవంతునిఁ దెలిసికొన్నవారలు దానివిషయమై వృథా సంభాషణ మొనరింపరు. అట్లొనరించు వృథావాచాటులు సాధారణముగా డాంబికాచారులే. గురుకరుణా విశేషమున నట్టి పదవుల నొందినవారి శిష్యులు సయితము వానివిషయమై సాధారణముగ బహిరంగ పరుచుట గర్వమనుకొనెదరు. గురువుగారి యొక్క ఆజ్ఞగూడ అట్లొనరింప రాదనియే. అయినను లట వశమున బాబాగారి భక్తులలో నొకరు 'కాయధవుఁ' డను నొకవర్తకునికిఁ గలిగిన యనుభవ మిటఁ బొందుపరుపఁ బడినది. (N. B. కాయధవుఁడను నది మారుపేరు) 1924-25 లో ఈ కానఁబడు జగమెల్ల శాశ్వతము కాదు. (బ్రహ్మ మొక్కఁడే సత్యము అని తెలియఁజేయు) 'బ్రహ్మ సత్యం

జగన్మిథ్యా' యను దానివిషయమై 4, 5 గంటలు శ్రీబాబా తీవ్రోపన్యాస మొనరించు చుండిరి. శ్రోతల యందు జనించు చున్న నానావిధములగు సంశయములను శ్రీవారు తీరుపసాగిరి. నాకు గలిగిన సంశయ మిది. నేను వినుచున్నాను. బాబా ప్రబోధించు చున్నారు. కనుక యిదియంతయు దృగ్విషయ మైనదే. (Phenomena) నాకేమయిన బోధించడమునకును నే నేదయిన నేర్చుకొనుటకును, యీ దృశ్యప్రపంచము ముందు ముఖ్యముగాఁ గావలసినదేకదా. అసలు విషయమున కేది యాధారమో దానినే కాదని రద్దుచేయు ప్రబోధనవలన ఏమి లాభము? (ఇది యెటులున్నదన - ఒక కట్టెల గొట్టువాఁడు తాను కూరుచున్న కొమ్మను తానే నఱకుకొని క్రిందఁబడి చనిపోయినట్లున్నది.) తదుపరి గృహమునకేగి, సాయంతన ప్రశాంతసమయమున మా తోటలోఁ గూరుచుండి ధ్యానము గావించు కొనసాగితిని. ఆకస్మికముగ శ్రీ బాబా మూర్తి నా యెదుటఁ గానఁబడి యీవిధముగ వాక్రుచ్చినది. "నీకబద్ధముఁ జెప్పుట వలన నాకేమి లాభము రాదు. ఈ జేనెఁడు నారచీర దప్ప నాకేమియు నక్కరలేదు. నే నెందుకు నీకసత్యముఁ జెప్పెదను?" అయినను, నా సంశయము వీడలేదు. అంతట వారిటులఁ బలికినారు. 'నీ సంశయ నివారణార్థము కొలదిగ నీ కనుభవముఁ గూర్చెద.' అంతట వారు తన కాలి కాయి వ్రేలును నా వక్షమందుంచినారు. అప్పుడు జరిగిన విశేష మత్యద్భుతము. అప్పు డీ జగమందలి నానావస్తు ప్రకరములు తోట, సకోరి, స్నేహితులు మొదలగునవన్నియు నావైపునకు గిరగిర దిఱుగుచు, నా కనులలో జొరఁబడి యదృశ్యములయి

నవి. ఈ జగమంతయు, బాబా, మూర్తితోఁ గూడ గిరగిర పరిభ్రమించుచు నా కనులయం దదృశ్యమయినది. అప్పుడేదో పరమానంద కరమగు మైమరపు (Blissful restfulness) కలిగినది. ఇట్లెంతకాలముంటినో నేను చెప్పజాలను. ఆ స్థితిలో నేను కాలమును లక్ష్యము సేయలేదు. తదుపరి నేను ఆ యానందము శాశ్వతముగ నుండవలెనని తలంపసాగితిని. ఇట్లు తలంచుచుండగనే బాబా తన పాదమును తీసినారు. వెంటనే ఒకటి తరువాతొక్కటి నా కన్నులకుఁ గానఁబడ సాగినవి. ఒక్క నిమేషములో బాబా అంతర్ధాన మొందినాఁడు! పూర్వరీతి సర్వము యథారీతిగా నున్నది.

ఈవిధముగనే కాయధర్మము, యీ ప్రపంచము, సకోరీ, స్నేహితులు మొదలగునవన్నియుఁ గానఁబడి యదృశ్యములగుటచే, నివి యన్నియు అసత్యములు, మిథ్యలు. బ్రహ్మ మొక్కఁడే సత్యము, అని తెలిసికొనినాఁడు. ఈవిషయము లన్నియు నాతఁడు బాబాతో విన్నవింపలేదు. సోనీబాయి (Sonibai) అను నామె బావుసాహెబ్ సింగ్వేకారు (Bhou Saheb Singvekar) కుమారితె, బాబాగారికిఁ బ్రియభక్తురాలు. తన ధ్యానములో తన్నొక యనిర్వాచ్యానందమున నుంచి యీ ప్రపంచమంతయు అదృశ్య మయినదని తెలుపుచున్నది. అనేకు లిటుల శ్రీవారిచే దివ్యానుభవములఁ బొందుచున్నారు.

—•—

# అధ్యాయము ౨౫

## మహాసమాధి

1936 నుండి బాబా పూర్ణముగ లోకోపకార దృష్టితో చరించెను. ఆతని జీవితమం దత డనుభవించిన కష్టపరంపర కీశాంతిసమయము పారితోషికమని భావించవచ్చును. ఇప్పుడు బాబా యొక సద్గురుపీఠము నధిష్ఠించి చరించుచు భక్తులందరకు నాధ్యాత్మిక జ్ఞానమును బంచియిచ్చుచుండెను. యజ్ఞములన బాబాకధిక ప్రీతి. కారణమేమన యజ్ఞము వాతావరణమును గూడ బరిశుద్ధ మొనర్చును. ప్రథమమున బ్రాహ్మణులు హావనమొనర్చెడివారు. ఇందు కన్యలుగూడ పాల్గొనుదురు. బ్రాహ్మణులు వ్యావహారికకర్మలం దాసక్తులయి యుండుటచే వారియందలి సత్త్వగుణము పరిపూర్ణమనియు, కన్యలు సత్వ గుణ సంపూర్ణలనియు నాయన భావన. హావనము బరిసమాప్తి నొందగనే బాబా భక్తులందరమీఁద తీర్థముజల్లి హావనభస్మను బంచెడివారు.

“ఇట్టి సమయములందాయన దరచు సత్కర్మాచరణకై భక్తులఁ బ్రబోధించుచు, జీవన నిర్వాహణమునకేదే నొక వృత్తి యవసరమనియు, కాని తీరికసమయములందు సత్కార్య నాచరించిన పారలౌకిక సౌఖ్యముఁగూడ బ్రాప్తించుననియు, బ్రాపంచిక కర్మలవలన, బారలౌకిక కర్మలకెట్టి యాటంకము గలుగనేరదని” నిర్వచించెడివారు. మఱియు నాటకీయ పాత్రాభినేత తన పాత్రముగియగనే వేఱొండు పాత్రను ధరించునటుల



శ్రీ ఉపాసనీబాబా ప్రథమనివాసము, శ్మశానము
ప్రస్తుత మహాక్షేత్రము



శ్రీ సతి గోదావరీ మాత

మానవుడు లౌకిక వ్యాపార నిర్వహణానంతరము ఆధ్యాత్మిక పాత్రను ధరించవలెనని యామెని భావము.

1939 సం॥ మున హిమాలయమందలి జ్యోతిర్మఠ వాసియగు శ్రీశంకరాచార్యులవారు బాబాను దర్శింప సాక్షాత్కరించెను. ఆయన ఆశ్రమమందలి బరిశుద్ధ వాతావరణముం గని యచటి వారలకు గొన్ని ధార్మికగ్రంథములను గానుకగ నొసంగెను. మరియు బాబా ఎదుట వర్తమాన హిందూమత దౌర్బల్యమును బ్రకటించి వాతావరణమును బరిశీలింప మరల నభ్యున్నతస్థితి యొదవుట సాధ్యమని విచారించెను. అంతటతో బాబా రాబోవు యవతారమును గూర్చి కొలది యంశముల దెలిపి సమాధానించెను. శ్రీస్వామిని బాబాయు నతని శిష్యులు నతిభక్తితో బూజించిరి. అనంతరము స్వామి "ధూరియా" కరిగెను.

ఆ సం॥ముననే బాబా తనతొంబదేండ్ల ముసలి తల్లికి సన్యాస మిచ్చెను. స్త్రీలకు సంన్యాస దీక్షనిచ్చు విషయమై యనేక వాదోపవాదములు జరుగుచున్నను అర్హత ననుసరించి సంన్యాస మిచ్చుటగలదు. (ఈ విషయము రమణ మహర్షికికూడ నభిమతమని "రమణగీత" యందొక పూర్ణాధ్యాయమున వివరముగగలదు.) కాని యామె వృద్ధయగుటచే దినదినము క్షీణించి వైశాఖ అమావాస్యనాడు భగవత్సాన్నిధ్యమును చేరెను. బాబా పంజరమునకు వాయవ్యదిశ నామె సమాధి యొనర్చబడెను.

1940 సంవత్సరాంతమున కన్యాకుమారి స్థానమున బాబా భవిష్యత్కార్య క్రమమును గూర్చి తెలియజేసెను.

ఆయన అప్పుడప్పుడు శరీరము నశ్వరమని తెల్పుచు భగవదంశా సంభూతులు విదేహులయ్యు శాశ్వతులని చెప్పుచుండెను. కన్యలకు భక్తులకు నాయన దానుగూడ నశ్వర దేహినని తెల్పుచు మీరందరు సక్రమముగ నేజెప్పిన చొప్పున చరించిన మిమ్ముల సంరక్షింప నేనెల్లపుడు నుందుననియుఁ బ్రబోధించుచుండెను. తానీదేహము వీడిన పిమ్మట నెచ్చట నెవ్విధముగ దీనిని సమాధియొనర్చునదియు, అచటివారలకు దినచర్యయు దెలిపెను. 1940 సం॥ రము డిసెంబరునెలయందు బాబా కాశీకి బయనించి యచటనుండి మరల జనవరినెలలో సాకోరీ జేరెను.

1941 సం॥ జనవరిలో సాకోరీయందు బాబా ఆదిశక్తి ననుకరించు దుస్తులధరించిన కన్యలంగూడి సూర్యయాగ మొనర్చెను. త్రయంబకేశ్వర వాసియగు 'బువ' యను గవీశ్వరుడు బాబా నీసమయమున పవిత్ర మందాకినీ సంయుత జటామండిత మస్తకుడగు నాదిశంకరునితో బోల్చి వర్ణించెను. ఈ సమయముననే బాబా—

"సూర్యనారాయణం దేవం, సచ్చిదానంద సద్గురుమ్,
అజ్ఞాన తమ నాశాయ, వందే సర్వాత్మకం రవిమ్."

యను సూర్యమంత్రము నందఱిచే బఠింపించెను.

1941 సం॥ ము ఫిబ్రవరి నెలయందు బాబా సూరత్ వెళ్లెను. అటనుండి మరలునపు డాయన భక్తులగాంచి కన్నీరు గార్చెను. అప్పటి యశ్రుస్యందనమునకు కారణమేరికి తెలియ

కున్నను బాబా సమాధి స్థితుడు కాగానే యుందరి కందలి భావము గోచరించెను.

**1941** సం॥ ఏప్రియల్ 26 వ తేదీన అమావాస్యా శని వారమగుటచే నిది శనిప్రీతికరమగు దినమని బాబా కన్యాల యమున కరిగిఁ బ్రసాదమును బంచియిచ్చి తనకు కొలది కాల ములో బదిలీ యగునని నుడివెను. ఆమాటలు భక్తులకు విచా రముకలిగించి సందేహనివృత్తికై బాబాను బ్రశ్నింప నాతడు "నేనెల్లప్పుడు నొకచో నుండువాడనా? ఒకప్పుడు నాగ పురము, మరొకప్పుడు హైదరాబాద్, ఇంకొకప్పుడు షిర్డీకి నరుగుచుందును, గాన యట్టింటిని గాని వేరొండుగాదు" యని సమాధానమిచ్చెను. ఈసమయమున బాబా తరచు 'సతారా' కేగుచుండెను. అట నొకప్పుడు 'తాత్యామూలే' (బాబా బాల్య మిత్రుడు) రోగగ్రస్తుడగుట నాతని జూడబోయి బాబా యాత నికి మనశ్శాంతిని జేకూర్చెను.

**1941** నవంబరు **24** వ తేదీన బాబా, సతి గోదావరీ బాయి మరియు కొందరు కన్యలు వెంటరా, హైదరాబాద్‌న కరిగెను. అట రాజా నరసింగరాజు బాబాను పూలమాలచే నలంకరించి వేరొండు మాల గైకొని గోదావరి నర్పింప నేగ, బాబా 'ఇక నీ వీమె నర్చింపవచ్చును.' అని చెప్పి తన సమాధి ఆసన్నస్థితిని సూచించెను. ఇదేసమయమున కొందరు మద్రాసీయు లరుదెంచి బాబాను దమకేదయిన నుపదేశింపు మని వేడ, బాబా—

"ఓం నమః సద్గురో శ్రీ ఉపాసనీనాథ పరమానంద అద్వయ'' యను మంత్రము నుపదేశించెను,

బాబా మరల డిసెంబరు 12వ తేదీకి పూనా జేరెను. అట 'నామదేవరావు ఉపలాప' యను భక్తునింట విడిసి యాతనికి "నివృత్తి జ్ఞానదేవ సోపాన ముక్త ఏకనాథ నామదేవ తుకారామ్ తుకారామ్" అను మంత్రము నుపదేశించెను. ఉపలాప కామంత్రమందలి యర్థము వెంటనే ఈవిధముగ గోచరించెను. "నివృత్తి మార్గము ననుసరించిన ముక్తిని బడయుదువు. జ్ఞానము (సోపాన) మెట్లువలె సహాకరించును. (ముక్త) ముక్తినొందుటకు (ఏకనాథ) అద్వైతానుభవ మందిన బిమ్మట (తుకారామ్) రామునితో నైక్యమొందుదువు. బాబా పూనాలో నున్నపుడు శ్రీనారాయణ మహారాజు 'కేడగామ్' నుండి యటకరుదెంచెను. కృష్ణంభట్టను భక్తుని బాబాకు మహారాజునకు పరిచయమొనర్పదలచ బాబా "మహారాజు నాకంటె ఘనుఁడు, నేనల్పుఁడనుగాన నాప్రణతు లాతనికి దెల్పు" మనెను. అప్పటికి మహారాజు 'కేడగామ్' వెళ్లిపోయెను. కృష్ణంభట్టు కేడగామ్ వెళ్లి బాబా ప్రణతు లాయన కెరింగించెను.

19 వతేదీన బాబా మరల సాకోరీ కరుదెంచెను. ఆతని రొమ్మున నొప్పి జనించి యస్వస్థతగా నున్నను దర్శనమందరకు నగుచుండెను. 22 వతేదీ బాబా సతానా కరిగి యట నిర్మింపబడుచున్న దేవాలయముఁ గాంచెను. పనివారల నందర నాతడు "సూర్యుఁ డస్తమింప నున్నాడ"ని త్వరబెట్టెను. అట నాతడు బండ్రెండు జ్యోతిర్లింగములఁ బ్రతిష్ఠించెను. రాత్రి బాబాకు చాలా కష్టతరముగ గడచెను. ఉదయ మాయన దేవాలయపు మేస్త్రీని రావించి 'నేను లేనప్పుడు

నీవీపనిని సక్రమముగ నిర్వర్తించవలె' నని తెలిపి యాతని నుత్సాహితు నొనర్చి పంపెను. 23 వ తేదీ సాయంత్రమునకు బాబా సాకోరీ జేరెను. అతనికి ఛాతియందు నొప్పి యధికమయ్యెను. చికిత్స నాతడంగీకరింపలేదు. 24 వ తేదీ తెల్లవారుఝామున లేచి యాయన "నిద్రించుట కిదేనా సమయమని బలవించెను." అదే సమయమునకు గోదావరీమాయికిగూడ "నీవింకను నిద్రించుచుంటివా ?" యని ఎవరో ప్రశ్నించి నట్లయ్యెను. తెల్లవారుదనుక బాబా కన్యలందరకు హితము గరపుచు గడపెను. సూర్యోదయమునకు ముందాతడు "కొలది సేపు విశ్రమింతు ననియు, ఒక యరగంటలో పూర్ణముగ స్వస్థుడ నగుదుననియు" జెప్పెను. ఆయన శరీరమును జాచి కనులుమూసి పరుండెను. ఈసమయముననే యాతని యాత్మ భౌతిక శరీరమువీడి పరబ్రహ్మయం దైక్యమయ్యెను.

కొంతసేపటివరకటనున్న వారికెట్టి యనుమానము గలుగలేదు. డా. పటే లరుదెంచి బాబా శరీరమును బరీక్షించి ఆత్మ శరీరమును వీడుచున్నదని తెలిపెను. డా. మెహతా యరుదెంచి బాబా భౌతికశరీరము మాత్ర మిటనుండెను. ఆత్మ బ్రహ్మయం దైక్యమయ్యెనని తెలిపెను.

కార్యక్రమమేమియు నాపబడలేదు. బాబా శరీరమును దర్శింపగోరు వారు దర్శింపవచ్చునని భక్తులకు దూరదూరములకు దంతు లొసంగబడెను. 25 వ తేదీ సాయంత్రమున గన్యలందరు బాబాదేహమును దడపి పట్టుకంబళము నొకదానిని గప్పి మేళతాళములతో, వేదమంత్రోచ్చారణతో దత్తమందిరమునకు, బాపుసాహెబ్ సమాధికిని దీసుక వెడలి పిదప

బంజరమున కెసరుగా మహారాజు శరీరము సమాధిజేయ బడెను. బాబా విగ్రహమొండు బంజరమున జనవరి 13 వ తేదీన నుంప బడెను. భక్తులకు బాబా జీవితావస్థయందు కంటె నిప్పుడు మిగుల చేరువయై వారిమానసముల నెల్ల వేళల దోచుచు నిత్యము వారల కనేక దివ్యానుభూతుల నొసంగుచుండెను.

ఒకపరి మనము బాబాజీవితమును పునరాలోచన జేయుదము. 1930 వ సం॥మున బాబా హైదరాబాద్‌నకు వెడలెను. అప్పు డాతని సేవింప గన్యలెవ్వరును లేరు. జీజీ యాతని వెంటనుండెను. అప్పు డాతడు ముడులువైచిన యొక త్రాటిని జీజీ కొసంగి "ధనవంతులు విలువైన జపమాలలను ధరించగలరు, నే నకించనుడ నగుట యీత్రాటిని నిట్లు ముడి వైచుకొని జపము నొనర్చుచుందు" నని తెలిపెను. అప్పటి నుండి యామె దాని నతిభద్రముగా వాడుచుండెను. శిథిలము కాగానే దాని నొక వెండిబరిణ యుందుంచి బూజించు చుండెను. ఒకనా డామె యాశిథిల మాలను వెలికి దీయ "ప్రహ్లాదలోండే" యను నాతడు చూచి వింతపడి యందలి ముడులను లెక్కింప నవి సరిగ 71 యుండెను. బాబాకూడ తన 71వ సంవత్సరముననే యీ ప్రపంచమును వీడెను. ఆతని వయస్సునకు నా త్రాటి ముడులకు సామ్య మేల కలిగెనో తెలియరాదు! అంతయు చిద్విలాసమే.

బాబాఎల్లపుడు తనభక్తులతో "ఆత్మశక్తిని పెంపొం దించు కొనుమనియు, గాఢవిశ్వాసముంచి సత్కర్మల నొన ర్చుచు వాసనల నణచి శాంతినొందు" మని హెచ్చరించు

చుండెను. స్త్రీలవిషయమై బాబా యభిప్రాయము లతి ముదావహములు. స్త్రీలను గూర్చి—

"రూపవైరుధ్య కారణము స్త్రీ పురుషు లిరుతెగలై యుండుటచే వారి కర్మలుగూడ ప్రత్యేకములు, విశిష్టములు. పురుషుడు రాజసికజాతికి జెందినవాడు. జీవన నిర్వాహణోపాయము లందును, వృత్తులందు నీతడగ్రగామియై వర్తిలును. కాని స్త్రీలు సత్త్వగుణ సంపన్నలై రాజసిక కర్మలకు దూరముగ నుందురు. అందువలననే వారల కర్మప్రారబ్ధము లంటజాలవు. హైందవ ధర్మశాస్త్ర రచయిత మనువు "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" యని చెప్పి స్త్రీలకుగల కర్మప్రారబ్ధ రాహిత్యమును సూచించెను. అందువలననే స్త్రీ పరాధీనయై తన సత్త్వగుణ సంపదచే తానుండు పరివారమున కంతకు మేలొనగూర్చుటయందు సమర్థయై యుండును. పురుషుల దుష్కృతముల నామె నశింపజేయును. స్త్రీకిదియే (అస్వాతంత్రయై సత్కర్మల నాచరించుట) భగవద్విహిత మగు కర్తవ్యము. అదియునుగాక పురుషుడు దైవసాన్నిధ్యము నొందనసమర్థుడైన, రాజసిక తామసిక కార్యములకు దూరముగ వర్తిలు స్త్రీ యాతని కుత్తమగతి కల్పింపగలదు. కన్య భగవత్సాక్షాత్కారము నొందిన బురుషునకు దానమీయబడిన నామె 21 తరముల తన కుటుంబము వారల దరింపజేసి, దానుగూడ ముక్తి నొందును." అని బాబా తెలుపుచుండెడివాడు.



# అధ్యాయము ౨౭

## ఆశ్రమ విశేషములు

బొంబాయినుండి, మానమడ్ (Manmad) తదుపరి చిటేలు (Chatale) నుండి సకోరీ చేరఁగలరు. లేక దక్షిణము నుండి ధోండా (Dhond) చిటేలు దాటవలయును. చిటేలు నుండి పదకొండు మైళ్లదూరములోనున్న 'సకోరీ'కి మోటారు కారుపై నేగవలయును. మైలు, రెండుమైళ్ల దూరములో నుండగనే మహోన్నత దత్తాత్రేయాలయ గోపురము గాన వచ్చుచుండును. మన మా దేవాలయమునఁ బ్రవేశించినయెడల, ఆ కోవెల క్రిందిభాగమందు దీర్ఘమగు హాలుఁ గనుఁగొనెదము. ఆ లోపలి భవనము చాల పవిత్రీభూతముగను, సుందరముగను, లెక్కింపరాని పవిత్రములగు చిత్రపటములతోను, నీ మందిర మెంతయు చూపరుల కానందముగా నుండును. దత్తాత్రేయ భగవానుని పవిత్రరజితపాదుకలు రెండుజతలు గలవు. అన్నిటి కన్న లోపలిభాగము చాలపవిత్రమైనది. రాత్రిందివములు — [illegible] బ్రాహ్మణోత్తములు సక్రమముగ పూజాభిషేకములఁ గావించుచుందురు. అక్కడ శ్రీఉపాసనీ బాబాగారి యొక్కయు, శ్రీవారి గురుభగవానులగు శ్రీసాయి బాబాగారి యొక్కయు పెద్ద చిత్రపటముల కిరుపార్శ్వముల నెల్లప్పుడారిపోవని దీపజ్యోతులు (జ్ఞాన హృదయముల దివ్యజ్యోతులవలె) దేదీప్యమానముగ వెలుగుచుండును. ఇంకను కొన్ని శ్రీకృష్ణాది భగవద్విగ్రహములు కలవు.

ఈమందిరమునఁగల శ్రీదత్తాత్రేయుల పాదపద్మములకును, తదితర విగ్రహ, పటములకును, కనిసము దినమునకు మూఁడు పర్యాయములు ఉదయము 5 గంటలకు, మధ్యాహ్నము 11 గంటలకు, సాయంతనము 7 గంటలకు హారతి యొసఁగఁబడును. ఈ సమయములయందు, ముఖ్యముగ, అచ్చట వసించు భక్తులు, తదితరపాంథులు (దర్శకులు) అరుగుదెంచెదరు. ఈ హారతి సందర్భముల శ్రీబాబా ప్రార్థనలును, భగవత్ప్రార్థనలును జరుగుచుండును. మధ్యాహ్నసమయముల పవిత్రోత్తమ మంత్ర ప్రాశస్త్యములఁ గూర్చియు, మతవిషయకోపన్యాసములు జరుగుచుండును. హారతి అయినవెంటనే యథాప్రకారము గురువులును, సేవకులును పూజింపఁబడినపిదప (మామూలు హిందూధర్మప్రకారము) అచ్చటికేఁ దెంచిన ప్రతి భక్తుఁడును దేవతలకు, గురుచంద్రునకును పుష్ప ఫల పత్రాదు లొసంగెదరు. తదుపరి తీర్థప్రసాద స్వీకరణానంతరము (తీర్థమనగా, శ్రీదత్తాత్రేయుల పాదములఁ బ్రక్షాళించిన పవిత్ర జలము) దేవళము వీడి చనియెదరు.

పైజెప్పినట్లు త్రికాలముల యందునను భక్తులనేకులీదత్తాలయమునుండి 100 గజముల దూరమునఁగల శ్రీగురుదేవుని నిలయమున కేగెదరు. ప్రాతఃకాల పూజాసమయమున మాత్రమిక్కడికి శ్రీవా రూరియందున్నను, లేకపోయినను రారు. ఇచ్చట మామూలుగాఁ జరుగు గురుప్రార్థనలు, దైవప్రార్థనలు, తదితర దేవాలయములలోవలె సాధారణములే అయినను యిచ్చటఁ జరుగు కర్మకాండ జీవితప్రాశస్త్యమును తెలియఁజేయుచు ప్రాపంచక మోహ బంధములచేఁ గట్టఁబడి

కష్టపరంపరల నీడఁ జాలక యశక్తులైన భక్తులకు ధైర్యో త్సాహములఁ గలుగఁజేసి, భయంకర క్లేశ సాగరమునందుండి నావయై దాటించి గమ్యస్థానముఁ జేర్పఁగల విచిత్రానంత దివ్యప్రభావుఁడగు శ్రీగురుభగవానుని పాదపద్మములయందు చిత్తమును నిలువఁ గలిగించును.

శ్రీవారు మామూలుగా గ్రామమం దున్నప్పుడు మధ్యాహ్నిక సాయంతన సమయములయందు తన నివాసము నందలి పంజరప్రదేశమును జనుదెంతురు. ఇక్కడ జరుగు ముఖ్యపూజావిధాన మేమన ప్రతిభక్తుఁడును బాబాగారి పంజరముకడ కేగి శ్రీవారిదివ్యాంఘ్రుల పుష్పములచేఁబూజించి తమపరి శ్రీవారి ప్రియభక్తురాలగు శ్రీగోదావరీబాయి యను పుణ్యాత్మురాలి పాదపద్మములఁ బుష్పములచే పూజింతురు. శ్రీబాబాగారి ప్రార్థనలఁ బాడినపిదప (భజనావళియందలి పవిత్రకీర్తనలు) ఇరువది లేక నలుబదిమంది స్త్రీసముదాయము హార్మోనియ వాద్యముతో భగవత్కీర్తనఁ గావింతురు. ఈ స్త్రీరత్నములట్లు పాడుచుఁబాడుచు వలయాకారముగఁ దిరుగుచు కోలాటము వేసెదరు. దక్షిణదేశమున దీనిని కోలాట మనియు, మహారాష్ట్రదేశమున తిప్పేరి (Tipperi) యనియుఁ బేర్కొందురు. ఆ కీర్తనలు మతప్రాశస్త్యకరములై భక్తి పూరితములై తమ సర్వస్వమగు శ్రీగురుమూర్తి బాబాపై నిర్మలమగు ప్రేమను గల్పింపఁజేయుటకు జాలినవైయుండును. ఆకీర్తనలు హిందీ భాషలోను, మహారాష్ట్రముననుఅందరకుఁ దెలిసినవై శ్రీబాబాగారి భక్తులచే రచింపఁబడినవై యున్నవి. మధ్యాహ్నిక సమయమున హారతీ యనంతరమున సరభక్త

బృందములకుఁ బ్రసాద మొసఁగఁబడును. ప్రథమమున శ్రీగురు పాదములఁ గడుగుట కుపయోగించిన నీరక్షీరములును, అప్పుడప్పుడు శ్రీవారికి దర్శనార్థులు తెచ్చిన పండ్లు ఫలహారములును పంచిపెట్టెదరు. సకోకి ఆశ్రమవాసుల దినచర్యయేమన— తెల్లవారుజామున నాలుగు గంటలకే ఆశ్రమ ఘంటానినదము వినఁబడగనే లేచి కాల్యకృత్యముల నిర్వర్తించి దేవాలయమునను శ్రీగురు నిలయమునను, హారతిసేవలకు హాజరయ్యెదరు. తదుపరి కావలసినవారు అల్పాహారముల నారగించి వారివారి పనుల నిర్వర్తింప నేగెదరు. స్త్రీభక్తురాం డ్రు దేవాలయస్థలము నూడ్చి, గోమయముతోఁ గలసిన నీళ్లజల్లి శుభ్రముగ రంగు రంగుల ముగ్గులిడి స్నానముల ముగించుకొని, శ్రీగురుభగవానునకు సంబంధించినవి తదితర దేవాలయోపకరణ పాత్రల శుభ్రపరచెదరు. మగవారలు, దేవాలయమునను, తోటయందును వారివారికిఁ దగిన నానావిధ కృత్యముల నెరవేర్చుచుందురు. సంధ్యానుష్ఠానాచారములను నెరవేర్చుకొనెదరు.

చాల మందిభక్తులు, ధర్మశాలలందును, దత్తమందిరమునను వసించుచుందురు. చాలమంది వారివారి స్వార్జిత ధనమును వెచ్చించియే యన్నము వండుకొని భుజించుచుందురు. రాత్రింబగళ్లు దత్తాత్రేయ మందిరమున మధ్యాహ్నము 12 లోపలను, రాత్రి 10 లోపలను, నిత్యము సక్రమముగ ప్రార్థనా భజనాదులు, వాద్యవిశేషములతో మహదానందముగఁ జరుగుచుండును. దత్తదేవాలయమున అర్ధరాత్రము వరకు 12 గం॥ల కాలము స్త్రీభక్త సముదాయము జట్టీలు జట్టీలుగ నరుగుదెంచి భజనలు చేసెదరు. మధ్యాహ్నము పన్నెండువరకు

మగవారలరుగుదెంచి భజనలు చేసెదరు. ప్రతిభక్తుడును ఏదోయొక నియమిత సమయమున, గంటయో రెండుగంటలో యీ భజనయందు పాల్గొనవలయును. ఉదయము 9 గంటల ప్రాంతమున మగవారలగు భక్తులు శ్రీబాబాగారి నిలయద్వారమున భజన గావింతురు. సాయంత్ర మూరుగంటలప్పుడు, ఆ ప్రదేశముననే స్త్రీలుగూడ భజనఁ గావింతురు. ఉదయము 10, 11 గంటలమధ్య బాబా వెలుపల కరుగుదెంచి పంజరముకడఁ గూరుచుండెదరు. బ్రహ్మతేజో విరాజమానులగు ఆ మహనీయుని ప్రాతఃకాల దర్శనముఁ భక్తులెల్లరును గావించుకొనియెదరు. ఈసమయములనే, యొక్కొక్కప్పుడు శ్రీవారితో కొలదికాలము మాటలాడు సమయము తటస్థించుచుండును.

తదనంతర మొక యర్ధగంటకు నైవేద్యగంట వినవచ్చును. శ్రీవారికి నైవేద్యమొసఁగఁ దలచిన భక్తులు, తమతమ యాహారములఁ గొని శ్రీబాబానిలయమున కేగుదెంతురు. మామూలుగా బాబాకన్యలు నైవేద్యమునందు ఒకభాగము గ్రహించి శేషమును ప్రసాదముగా మరల నొసంగెదరు. ఇటుల శ్రీవారిచే స్పృశింపబడిన పిదపఁ భక్తులాయాహారములారగింతురు. మధ్యాహ్నము దేవాలయమున "హారతీ సేవనము" ఒకగంటయు, గురునిలయమున గంట, రెండుగంటలును జరుగును. ప్రతిదినము జరుగు ముఖ్యదినచర్యయిది. ఈ హారతీసందర్భముననే గురుసన్నిధానమున సాధారణముగ పవిత్రగ్రంథములు చదువబడుచుండును. దినమువిడిచి దినము భగవద్గీతలో నొక యధ్యాయము, అష్టావక్రగీతలో సుమారు ముప్పదినలుబది శ్లోకములను చదువఁబడుచుండును. శ్రీ భగవ

త్స్వార్థమై వచ్చినవారలు ఎవరైన వచ్చుచుందురు. గురు ప్రసాదముతోడను, స్త్రీల కీర్తనాకోలాటములతోడను, సేవా కార్యము సమాప్తియగును. భోజనార్థము కొలది తడవు విశ్రమానంతరము, మధ్యాహ్నము 3 మొదలు 6 గంటలలోపల అనేక భక్తసముదాయము లరుదెంతురు. అప్పుడే బాబా, తనతోడ సంభాషింపఁ దలచినవారలతో తన మృదుమధుర వాక్యములతో సంతసింపఁ జేయును. వారిని దర్శింప వచ్చిన వారలు తమకష్టనిష్ఠూరముల దయాసముద్రుఁడగు బాబాతో విన్నవించుకొని, శ్రీవారు, వారియం దెంతయు జాలింబొందుటఁ గని యాశ్చర్య పడుచుందురు. కరుణాశరధి యగు శ్రీమహారాజు దుఃఖితాత్ముల జూచి, దుఃఖించును. సంతోషించు వారల గని సంతోషించును.

కాని యిది శ్రీవారి పవిత్రహృదయ పూర్వకమైనది గాని బాహ్యనటనాచారము గాదు. శ్రీవారు తనసహాయ ప్రభావమున తన్నాశ్రయించిన వారలకు సంకట నివృత్తి యొనరించి వారివారి యాధ్యాత్మిక బలమును వృద్ధిగావింతురు. శ్రీబాబా ప్రకృతి విషయమున స్వతస్సిద్ధమయిన జ్ఞానియగుటచే తన్నాశ్రయించిన ప్రతిభక్తునకు తనయభిప్రాయమును వారివారికి సరిపోవునట్లు సెలవిచ్చుచుందురు. అంత వారలు శ్రీవారి రక్షణక్రింద నుండి, వారి యాజ్ఞానుసార ప్రవర్తనులై, యీప్రాపంచకేచ్ఛల నుండియు క్లేశపాశముల నుండియు విముఖులయి, పరిశుద్ధహృదయులై, సద్గుణాఖనులై, ఆత్మబలమును వృద్ధిగావించుకొని అత్యుత్తమాధ్యాత్మిక ప్రభావమును గాంచుచుందురు. తనకడకు లౌకిక సిద్ధులకొరకు

మాత్రమే జనుదెంచకుఁడని వాక్రుచ్చెదరు. ఒక వేళ వారల కీసిద్ధు లప్రయత్నముగ నలవడినను వానివిషయమై నాలో చింపక ప్రశాంతచిత్తమున భగవద్గురుపూజాక్రియల నెరవేర్చు చుండుఁడని పల్కుచుందురు. పర్వ (పండుగ) దినములలో అనేకమంది భక్తులు తదితర పాంథజన బృందములు ఆశ్రమము కడకేగుదెంతురు. అప్పుడు బాబా తనయుపన్యాసముల (ప్రవచనముల) చెప్పెదరు. భక్తు లేవిధముగ నరుదెంచి శ్రీవారి వాక్యములందలి ప్రతియక్కరమును అమృతబిందువుల పగిది గ్రోల నతిశ్రద్ధాభక్తులఁ గలిగియుందురో తెలిసికొనుట కీదృశ్యము సహాయకారి. ఎవ్వరైనను గుణపరీక్షకులు శ్రీవారి యుపన్యాసములఁ గాంచి, ఆవాక్యములయందు ఏవిధమయిన భాషా పటిమగాని తర్కపాండిత్యాదులుగాని లేకపోయినను వారి వాక్యములంత మృదుమధురముగా నుండుటఁ గాంచి యబ్బురపడఁగలరు! ఇదియే సత్పురుషుల వాక్యములలోని మాధుర్యము! వారు స్వయముగా భగవంతుని కనుఁగొనిన వారలుగాన వారేమియు గ్రంథార్జిత పాండిత్యమునఁగాక స్వతస్సిద్ధ హృదయోద్భవ సత్యవాక్యములతో తమ స్వాచరణార్జిత విశేషముల నుపన్యసించి ప్రజల నానందాబ్ధిఁ దేల్చెదరు. వారు మహాత్తను విచిత్రశక్తి సంపన్నులనియు పవిత్ర హృదయులనియు గ్రహింపఁగలరు. ఆవిచిత్ర శక్తిచేతనే మంత్రబద్ధులఁ జేసినట్లు 3, 4 గంటలు సాధారణ విషయముల మీదనే వినుగు జనింపనీయక మృదుమధుర వాక్యముల ప్రజల నానందింపఁ జేసెదరు.

అంపుచేతనే వారలు, 'బాబా! ఎట్లు మమ్ముల మంత్ర శక్తిచేత బంధించినట్లు, కట్టివేసినారు?' అని యాశ్చర్యపడు చుందురు. 3-6 గంటలమధ్య బాబా ఆశ్రమమునఁగల స్త్రీలు, సంస్కృతమును చదువుకొనుచు, చిన్నచిన్న మతగ్రంథములను పాటలను జదువుకొని నేర్చుకొను చుందురు. ఒక్కొక్కప్పుడు పవిత్రగ్రంథ పఠనమునకును, హరికీర్తన గావించుటకును, సాయంతనము 5-6 గంటలమధ్యకాలము, దేవాలయమున విని యోగింపఁ బడుచుండును. తదుపరి గంట బాబాగారి ద్వారము కడ, దేవాలయమునను, హారతీకార్యము జరుపఁబడును.

ఈ విధముగా భక్తులిచ్చోట రాత్రిందివము, పవిత్ర భగవత్కార్యములందునఁ బాల్గొని, విశ్రమము, సోమరితనము, అనవసర సంభాషణలు, యీప్రాపంచిక తుచ్ఛేచ్ఛల మఱచెదరు. వాదనలు, వార్తాపత్రికలు గూడఁ గాంచఁబడవు.

**జయ్! శ్రీ సద్గురు ఉపాసనీ మహారాజ్!**



# బదరీయాత్ర రు. 1/-

(సచిత్రము - మూడవకూర్పు)

గ్రంథకర్త: విద్వాన్, బుఱ్ఱ సూర్యప్రకాశ శాస్త్రి

"ఆస్తిక్యబుద్ధి గల యాత్రికులకు తమ పుస్తక మెంతో యుపకరించును."

—శ్రీ దివాకర్ల వేంకటావధాని

"బదరీయాత్ర, యాత్రికులకు కరదీపిక వంటిది."

—శ్రీ శివశంకర శాస్త్రి

"బదరీయాత్ర చేయుచున్నట్లే అంతరంగ మానందపరవశ మగుచున్నది."

—శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి

"అసమర్థులమై యున్న అస్మదాదులకు తత్తత్క్షేత్రసందర్శన ఫలలాభమును కలిగించియున్నారు."

—శతావధాని, శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

"మీ పుస్తకము జిజ్ఞాసువులకు, యాత్రికులకు ... ధన్యత నర్థించువారికి పరమోప కారకము."

—శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

"వివిధ క్షేత్రాలను సందర్శింప దలచిన యాత్రికులు గమనించవలసిన విధులు, అనుసరించవలసిన ఆచారాలను చక్కగ ఇందులో వివరించారు, యాత్రికుల కత్యంత ముపయుక్తమైన గ్రంథం."

—ఆంధ్రప్రభ

"తీర్థములను సేవించువా రీ గ్రంథమును దగ్గర నుంచుకొన్న ఎంతయో ప్రయోజనకారి కాగలదు."

—దివ్యవాణి